భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ భవిష్య పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ భవిష్య పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.


*Responsible for selection of matter etc under the PRB & Copyright Acts etc.

*We have made many efforts to present this book without errors, But some errors might have crept in. We do not take any legal responsibility for such errors and omissions. If you bring them to our notice we shall correct them in our next edition. All disputes are subject to Vijayawada Jurisdiction only.*

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**



"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

“వేదోపబృంహణాలు” అని పేరు. “ఉపబృంహణం” అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశథా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా ఉండవచ్చు.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠునికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదునికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదునికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ర్బాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ భవిష్య పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశపురాణాలలో భవిష్యపురాణం తొమ్మిదవది. 'భవిష్యదక్షిణోజానుః' అన్న మాట ప్రకారం ఈ పురాణం శ్రీమహావిష్ణువు కుడి మోకాలుతో పోల్చి చెప్పబడింది. ఈ పురాణంతో మొత్తం 585 అధ్యాయాలు, 14,500 శ్లోకాలు వున్నాయి. అష్టాదశ పురాణాలలో అన్నిటికన్నా కాస్త విభిన్నంగా ఈ పురాణం చెప్పబడింది. సమాజంలోని అన్ని వర్ణాలవారు భగవంతుడి అనుగ్రహాన్ని పొందటానికి సంబంధించిన ఎన్నో మార్గాలని ఈ పురాణం ప్రబోధిస్తుంది. ఈ పురాణం నాలుగు పర్వాలుగా విభజించబడింది. 1.బ్రహ్మపర్వం 2.మధ్యమపర్వం 3.ప్రతిసర్గపర్వం 4.ఉత్తర పర్వం.

## భవిష్యపురాణంలో చెప్పిన విషయాలు

**1. బ్రహ్మ పర్వం :** ఈ పర్వంలో సుమంతుడికి శతానీకమహర్షి చెప్పిన సృష్టివర్ణన, నాలుగు వేదాల ఉత్పత్తి, కాలగణన, యుగధర్మాలు, సంస్కారాలు, ఆచార్య లక్షణాలు, బ్రహ్మచారి లక్షణాలు తల్లి, తండ్రి, గురువుల మహిమ, వివాహ సంస్కారం, స్త్రీలలోని శుభాశుభలక్షణాలు, పురుషులలోని శుభాశుభ లక్షణాలు, గృహస్థాశ్రమధర్మాలు, పతివ్రతల ధర్మాచరణ, పంచమహాయజ్ఞాలు, ఉపవాసాలు, ప్రతిపత్తు వ్రతవిధానం, వివిధరకాల వ్రతాలు, సర్వలక్షణాలు, విషహరణ చికిత్సలు, నాగపంచమీవ్రతం, శ్రీకృష్ణ సాంబసంవాదం,సూర్యుడి నిత్యార్చనా విధి, స్కంధషష్ఠీవ్రతం, సూర్యుడిమహిమ, రథసప్తమి మహిమ,

స్వప్నాలు వాటి ఫలితాలు, సూర్యకుటుంబం వీర వ్రత విధానాలు, తిథులు, నక్షత్రాల దేవతల పూజావిధానం – ఫలితాలు, యమదూతల నరక సంవాదం, సూర్యాభిషేకం, యోగజ్ఞానం, సౌరధర్మం, స్మృతిధర్మాలు, శ్రాద్ధభేదాలు, శుద్ధప్రకరణం, పంచమహాపాతకాలు, ఆదిత్యపూజ, పాతకాలు ఉపపాతకాలకి యమలోకంలో విధించే శిక్షలు, బ్రహ్మ పర్వశ్రవణ మాహాత్మ్యం తదితర విషయాలు చెప్పబడ్డాయి.

**2. మధ్యమ పర్వం :** ఇది మూడు భాగాలుగా విభజించబడింది. ఈ పర్వంలోని ప్రథమభాగంలో ప్రధానంగా గృహస్థాశ్రమధర్మాలు సృష్టిక్రమం, ఊర్ధ్వ అధోలోకాలు, భూగోళ విజ్ఞానం, ఖగోళ విజ్ఞానం, బ్రాహ్మణుల మహిమ, తల్లి, తండ్రి గురువుల మహిమ, పురాణశ్రవణం వాచకం, దేవప్రతిమల్ని నిర్మించేవిధానం, అగ్నిపూజావిధి, హోమద్రవ్యాలు, యజ్ఞంలో ఉపయోగించే పాత్రలు తదితర విషయాలు చెప్పబడ్డాయి. ఇక ద్వితీయ భాగంలో– యజ్ఞమండలాన్ని ఎలా నిర్మించాలి, యజ్ఞకర్మల్లో దక్షిణ ప్రాశస్త్యం, కలశస్థాపనావిధి, నాలుగు రకాల మాసవ్యవస్థ, కాలవిభాగం, తిథుల నిర్ణయం, వాస్తుపూజ, గోత్రప్రవరలు ఎందుకు, అగ్నిజిహ్వాలు, ప్రతిష్ఠకి ముహూర్తం ఎలాపెట్టాలి? జలశయనాది ప్రతిష్ఠలు ఎలా చేయాలి? వంటి విషయాలు చెప్పబడ్డాయి. మూడో అధ్యాయంలో ఉద్యానవనాల్ని ఎలా ప్రతిష్ఠించాలి? రావిచెట్టు, పుష్కరిణి, జలాశయాలు, పుష్పవాటికలు, తులసివనాలు, ఏవిధంగా ప్రతిష్ఠించాలి. దివ్య భౌమ అంతరిక్షాల ద్వారా కలగే ఉత్పాతాలకి తగిన శాంతులు ఎలా చేయాలి? వంటి విషయాలు సవివరంగా చెప్పబడ్డాయి.

**3. ప్రతిసర్గ పర్వం :** ఇది నాలుగు ఖండాలుగా విభాగించబడింది. ఇందులోని మొదటి ఖండంలో సత్యయుగం నాటి రాజులవంశ వర్ణన, త్రేతాయుగ రాజులైన సూర్య చంద్రరాజవంశాల వారి వృత్తాంతాలు, ద్వాపరయుగ రాజవంశాల చరిత్ర, మ్లేచ్ఛవంశీయుల చరిత్ర, మ్లేచ్ఛ భాషల పరిచయం, మగధరాజ

వంశీయుల వృత్తాంతం, చౌహాన్ రాజుల చరిత్ర, విక్రమాదిత్యుడి చరిత్ర వంటి విషయాలు ప్రధానంగా వివరించబడ్డాయి.

త్రిలోకసుందరి కథ, సత్యప్రకాశుల కథ, హరిస్వామికథ, జీమూత వాహనుడి కథ, మధ్యమపుత్రుడికథ, నలుగురు మూర్ఖుల కథ, సత్యనారాయణ వ్రత కథ, పాణినికథ, శ్రీదుర్గా సప్తశతికి సంబంధించిన ఆది చరిత్ర, మధ్యమ చరిత్ర, ఉత్తమ చరిత్ర, పతంజలి మహర్షి చరిత్ర వంటి ముఖ్య విషయాలు చెప్పబడ్డాయి.

మూడు నాలుగు ఖండాలలో – ఆంధ్రవంశీయుల చరిత్ర, ఢిల్లీ రాజస్థాన్ రాజుల చరిత్ర, ఆచార్యుల ఆవిర్భావం, మధ్వాచార్యులు, శ్రీధరస్వామి, వరాహమిహిరుడు, ధన్వంతరి, శుశ్రుతుడు, జయదేవుడు, చైతన్యమహాప్రభువు, వాల్మీకి, శంకరాచార్యుల ఆవిర్భావం, రుద్రమాహాత్మ్యం, రామానుజాచార్యుల జననం, కుబేర ఉత్పత్తి, కబీర్, సరసీ మెహతా, గురునానక్ ల పూర్వజన్మలు, ఆచార్యుల వైష్ణవ ధర్మ ప్రచారం, అక్బర్, సూరదాసుల పూర్వ జన్మ వృత్తాంతాలు, మ్లేచ్ఛరాజ్యాల విస్తరణ, కల్కి అవతరణ వంటి విషయాలు ప్రధానంగా వివరించబడ్డాయి.

**4. ఉత్తర పర్వం :** ఈ పర్వంలో భువనకోశవర్ణన, జీవులు చేసే పాపపుణ్యాలు, పంచాగ్ని సాధనవ్రతాలు, లలితా తృతీయావ్రతం, రంభాతృతీయావ్రత మాహాత్మ్యం, శ్రీపంచమీవ్రత కథ, శ్రీకృష్ణ జన్మాష్టమీ వ్రతకథ, అనఘాష్టమీ వ్రత విధానం కథ, శ్రవణద్వాదశీవ్రతం–కథ, అనంగత్రయోదశీ, సావిత్రీ వ్రత కథలు, ఉగాది తిథులలో చేయవలసిన విధులు, శనైశ్చరవ్రతం, పిప్పలాదుడి కథ, మాఘస్నాన విధి, దీపదాన మహిమ, వినాయకశాంతి, మహాశాంతి విధానాలు, దానమహిమ, కన్యాదాన కపిలగోదాన, వృషభదాన, భూదాన, అన్నదానాదుల మహిమ, దశవిధదానాలు వంటి ప్రధానమైన విషయాలు చెప్పబడ్డాయి.

# సుమంత శతానీక సంవాదం

పాండవవంశంలో జన్మించిన శతానీక మహారాజు మహావీరుడు, ధర్మప్రభువు. ఒకనాడు ఆయన సభకి వ్యాసమహర్షి ప్రధాన శిష్యుడైన సుమంతుడు, వశిష్ఠ మహర్షి, పరాశర మహర్షి,జైమిని, యాజ్ఞవల్క్యుడు, గౌతమ మహర్షి, వైశంపాయనుడు, శౌనక, అంగీరస, భారద్వాజ మహర్షులు ఆశీర్వదించటానికి విచ్చేసారు. శతానీకుడు వచ్చిన మహర్షులందరికీ సాదరంగా స్వాగతం పలికి అతిథి సత్కారాలు చేసి సుఖాసీనులు కమ్మని ప్రార్థించాడు.

అంతమంది మహర్షులు తన సభకి రావటంతో శతానీకుడు ఎంతో సంతోషించి వారితో "మహాత్ములారా! మహర్షులారా! మీ అందరి రాకతో నా జన్మ ధన్యమయ్యింది. నా రాజ్యం పావనమయ్యింది. నా దొక చిన్న కోరిక మీరంతా ఎన్నో ధర్మశాస్త్రాల్ని పురాణ విశేషాలని బాగా తెలిసినవారు. నాకు కూడా ఆ విషయాల్ని తెలుసుకోవాలనుంది. దయచేసి నాకు ధర్మ ప్రబోధాత్మకమైన పుణ్య కథల్ని, ఇతి వృత్తాల్ని తెలియచేయండి" అని ప్రార్థించాడు.

శతానీకుడి ప్రార్థనవిన్న మహర్షులంతా ఒక్కసారిగా "శతానీకా! నీకు సకల ధర్మాలనీ పురాణాలనీ సవివరంగా ప్రబోధించగలిగేవాడు వ్యాసమహర్షి ఒక్కరే ఆయన్ని స్మరించు" అన్నారు. వెంటనే శతానీకుడు మనసులో భక్తిగా వ్యాసులవారిని స్మరించాడు. తక్షణమే అక్కడ ప్రత్యక్షమయ్యాడు వ్యాసుడు. శతానీకుడు తన కోరికని ఆయనకి వెల్లడించాడు. వ్యాసుడు అది విని చిరునవ్వుతో "శతానీకా! నీ కోరిక ధర్మ బద్ధమైంది. నీవు అడిగిన అన్ని విషయాలనీ ఇదిగో ఇక్కడే వున్న నాశిష్యుడు సర్వజ్ఞుడు అయిన సుమంతుడు నీకు ప్రబోధిస్తాడు అని చెప్పి వెళ్ళిపోయాడు.

శతానీకుడు వ్యాసులవారి మాటవిని అక్కడే వున్న సుమంతుణ్ణి ప్రార్థించాడు. సుమంతుడు "రాజా! ధర్మశాస్త్రాలు, వివిధ మహర్షుల ఆవిర్భావచరిత్రలు, పద్దెనిమిది పురాణాలు, ఇవన్నీ ధర్మ ప్రబోధకాలే. వీటిలో

ఏది నీవు వినాలనుకుంటున్నావు?” అని ప్రశ్నించాడు. అందుకు సమాధానంగా మహర్షీ! మీరు చెప్పిన పురాణాలు, ధర్మ శాస్త్ర విషయాలు ఇంతకుముందే నేర్చుకున్నాను. కనుక ప్రస్తుతం నాకు భవిష్యపురాణం గురించి చెప్పండి” అని కోరాడు శతానీకుడు. సుమంతుడు చెప్పటం ప్రారంభించాడు.

శతానీకా! నీవు చాలా దివ్యమైన పురాణం గురించే తెలుసుకోవాలి అనుకున్నావు. మంచిది! ఈ పురాణం మొదట బ్రహ్మదేవుడి నుంచి వెలువడింది. కనుక ఇది ఎంతో ప్రశస్తమైనది. ఈ పురాణాన్ని పండితులు శ్రద్ధగా పఠించి తమ శిష్యులకీ, సమాజంలో వున్న అన్ని వర్ణాల వారికీ ప్రబోధించాలి. శ్రౌతస్మార్త ధర్మాలు రెండూ ఇందులో చెప్పబడ్డాయి. ఇది పుణ్యప్రదమైనది, మంగళకరమైనది కూడా.

పూర్వం ఈ భవిష్యపురాణాన్ని బ్రహ్మదేవుడు శివుడికి, శివుడు శ్రీహరికి, శ్రీహరి నారదుడికి నారదుడు ఇంద్రుడికీ, ఇంద్రుడు పరాశరుడికి, పరాశరుడు మా గురుదేవులైన వ్యాస మహర్షికి వినిపించారు. తరువాత నేను వ్యాసుల వారి ద్వారా ఈ పురాణాన్ని విన్నాను. భక్తి పూర్వకంగా ఈ పురాణాన్ని విన్నా చదివినా తేజస్సు, జ్ఞానం, ఐశ్వర్యం లభిస్తుంది.

**భగవంతుడి సృష్టి :** మహాతేజోవంతుడైన పరమాత్మ తాను చేసిన సృష్టిని సంరక్షించటానికి తన నోటినుంచి బ్రాహ్మణుల్ని, భుజాల నుంచి క్షత్రియుల్ని, తొడల నుంచి వైశ్యుల్ని, పాదాల నుంచి శూద్రులని సృష్టించాడు. ఈ నాలుగు వర్ణాల వారూ ఏఏ పనులు చేయాలో కూడా ఆయనే నిర్దేశించాడు.

**బ్రాహ్మణ వర్ణం :** బ్రాహ్మణవర్ణంలో జన్మించినవారు అధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, దానం, ప్రతిగ్రహణం అనే ఆరు కర్మల్ని విధిగా చేయాలి.

**క్షత్రియ వర్ణం :** క్షత్రియవర్ణంలో జన్మించినవారు ప్రజల్ని ధర్మబద్ధంగా పాలించటం,అందరినీ బాహుబలంతో రక్షించటం, యజ్ఞయాగాది ధార్మిక క్రతువుల్ని జరిపించటం దాన ధర్మాలు ఆచరించటం చేయాలి.

**వైశ్య వర్ణం :** వైశ్య వర్ణంలో జన్మించినవారు యజ్ఞయాగాలని చేయించటంతో పాటు, పశుపోషణ, వ్యవసాయం, వస్తు వ్యాపార నిర్వహణ, దానధర్మాలు ఆచరించటం వంటి పనులు చేయాలి.

**శూద్ర వర్ణం :** శూద్ర వర్ణంలో జన్మించినవారు పై ముగ్గురు తమ తమ ధర్మాల్ని ఆచరించటంలో వారికి సహాయపడాలి.

ఈ నాలుగు వర్ణాల వారిలో మొదటి వర్ణం వారైన బ్రాహ్మణులు తమ తపస్సు, యజ్ఞయాగాల ద్వారా మొత్తం సమాజానికి మేలు కలిగేలా ప్రవర్తించాలి. ఈ బ్రాహ్మణుల్లో ఎంతోమంది మంత్రద్రష్టలు, మంత్ర సృష్టి కర్తలు ఉన్నారు. అలాగే ఎంతోమంది బ్రహ్మ జ్ఞానాన్ని పొంది బ్రహ్మ వేత్తలుగా ప్రసిద్ధి పొందినవారూ వున్నారు. ఈ బ్రాహ్మణులు ధర్మాచరణ ద్వారా సమాజాన్ని ఉద్ధరించటం కోసమే సృష్టించబడ్డారు.

## సంస్కారాలు

శతానీకా! వేదాలల్లో శాస్త్రాల్లో బ్రాహ్మణులకి మొత్తం నలభై ఎనిమిది సంస్కారాలు చెప్పబడ్డాయి. శాస్త్రబద్ధంగా ఈ సంస్కారాలన్నీ ఏ బ్రాహ్మణుడికి జరపబడతాయో అతడే బ్రహ్మలోకానికి చేరుకోగలడు. ఈ నలభైఎనిమిది సంస్కారాలలో ప్రధానమైనది. 1.గర్భాదానం 2.పుంసవనం 3.సీమంతం 4.జాతకర్మ 5. అన్నప్రాశన 6.చేలం 7.ఉపనయనం 8.4 బ్రహ్మవ్రతాలు 9.స్నాతకం 10.వివాహం 11.పంచమహాయజ్ఞాలు 12.సప్తపాక యజ్ఞాలు 13.అష్టకాద్వయాలు వంటివి. వీటితోపాటు ఎనిమిది ఆత్మ గుణాలు కూడా ఉత్తముడైన బ్రాహ్మణుడికి ఉండాలి.

**4. బ్రహ్మ వ్రతాలు :** 1.ప్రాజాపత్యం 2.సౌమ్యవ్రతం 3.ఆగ్నేయవ్రతం 4.వైశ్వదేవవ్రతం

**పంచమహాయజ్ఞాలు :** 1.బ్రహ్మయజ్ఞం 2.దేవయజ్ఞం 3.పితృయజ్ఞం 4.మనుష్యయజ్ఞం 5.భూతయజ్ఞం

**సప్తపాకయజ్ఞాలు :** 1.ఔపాసన 2.వైశ్వదేవం 3.పార్వణ 4.అష్టబలి 5.మాసశ్రాద్ధం 6.సర్వబలి 7.ఈశానబలి

**సప్తసోమ యజ్ఞాలు :** 1.అగ్నిష్టోమ 2.అత్యగ్నిష్టోమ 3.ఊక్థ్వ యజ్ఞం 4.షోడశీయజ్ఞం 5.వాజపేయం 6.అతిరాత్రం 7.అప్తోర్యామం.

**సప్తహావిర్యజ్ఞాలు :** 1.అగ్న్యాధాన 2.అగ్నిహోత్ర 3.దర్శపౌర్ణామాస్య 4.చాతుర్మాస్య 5. నిరూఢ 6.పశుంధన 7.సౌత్రామణి

**అష్టగుణాలు :**

అనసూయా దయాక్షాంతి రనాయాస్చ మంగళం ।
అకార్పణ్యం తథాశౌచం మస్పృహాచకురూద్వహ ॥

*(అధ్యా-3 శ్లో-155)*

1.అసూయలేకపోవటం 2.దయ 3.క్షమాగుణం 4.అనాయాసం 5.మంగళం 6.అకార్పణ్యం 7.శౌచం 8.అస్పృహ అనే ఈ ఎనిమిదీ ఆత్మ గుణాలు.

**1. అనసూయ :** ఇతరుల గుణాల్ని చెడుగా మరొకరికి చెప్పక పోవటం, తన గుణాలని తానే ఎక్కువగా పొగడక పోవటం, ఇతరుల గొప్పతనాన్ని చూసి ఈర్ష్యపడకుండా వుండటం.

**2. దయ :** తనకి సంబంధించిన వారిమీద, ఇతరుల మీద మిత్రులు, శత్రువుల మీద సమానంగా సద్భావం కలిగి వుండటమే దయ.

**3. క్షమ :** మానసికంగా కానీ, వాచికంగా కానీ, శారీరకంగా కానీ ఎవరైనా కష్టాలు కలిగించినా వారిమీద ఎలాంటి కోపం లేకుండా వుండటం.

**4.శౌచం :** తినకూడని పదార్థాలని విడిచిపెట్టటం, సజ్జనులతోనే సాంగత్యం కలిగి వుండటం, సదాచారాల్ని పాటిస్తుండటం.

**5. అనాయాసం :** శుభకర్మల్ని ఆచరించేడప్పుడు తన శరీరం తపిస్తున్నా (బాధపడుతున్నా) దాన్ని ఏమాత్రం లెక్కచేయకుండా ఆ శుభకర్మని కొనసాగించటం.

**6. మంగళం :** మంచిపనుల్ని చేయటం, అమంగళకరమైన పనుల్ని చేయకపోవటం.

**7. అకార్పణ్యం :** తనకి కొంచెం సంపదేవున్నప్పటికీ ఏమాత్రం లోభించకుండా, లేదనకుండా, నిరంతరం యథాశక్తి దానం చేయటం

**8. అస్పృహ :** ఎక్కువ ఆశకి పోకుండా లభించింది స్వల్పమైనా సంతృప్తిగా వుండటం.

ఈ విధమైన సంస్కారాలన్నిటినీ పొంది విధివిధానంగా వర్ణాశ్రమ ధర్మాల్ని ఎవరైతే పాటిస్తారో వారికి తప్పకుండా మోక్షం లభిస్తుంది.

**ప్రధాన సంస్కారాలు :** పుట్టిన శిశువుకి బొడ్డు కోయటానికి ముందు ప్రారంభించే కర్మనే జాతకర్మ సంస్కారం ప్రారంభించబడుతుంది. పుట్టిన శిశువుకి వేదమంత్రాల్ని చదువుతూ బంగారం, తేనె, నెయ్యి ఆ శిశువు నోట్లో ఉంచాలి. పదో రోజు లేక 12, 18, 30వ రోజు దాటగానే మూహూర్తాన్ని చూసుకుని నామకరణ చేయాలి. బ్రాహ్మణుల పేర్లు మంగళకరమైన పదాలతో శివశర్మ, విష్ణుశర్మ ఈ విథంగా వుండాలి. క్షత్రియుల పేర్లు బలవాచకంగా ఇంద్రవర్మ, శక్తి వర్మ అని వుండాలి. వైశ్యుల పేరు ధనవంతులలాగా ధనవర్ధనుడు, పుష్టివర్ధనుడు అని, శూద్రుల పేర్లు భగవంతుడి దాసుడు అనే భావం వచ్చేలా విష్ణుదాసు, రామదాసు అని వుండాలి.

స్త్రీల పేర్ల విషయంలో బాగా విచారించి మంచి పేరుని పెట్టాలి. ఆ పేరుని పలకటం కష్టంగా వుండకూడదు పేరు వినగానే హాయిగా, సౌమ్యంగా, మంగళకరంగా వుండాలి. ఉదా: లలితా, కల్యాణీ, సావిత్రీ అని శిశువు జన్మించిన తరువాత 12వ రోజు గానీ 14వ రోజు గానీ ఆ శిశువుని ఇంటినుంచి బైటికి తీసుకురావాలి. దీనినే నిష్క్రమణం అంటారు. శిశువుకి మొదటి సంవత్సరం లేక మూడో సంవత్సరంలో జుట్టుని కత్తిరించాలి. తరువాత బ్రాహ్మణుడికి ఎనిమిదో సంవత్సరంలో, క్షత్రియుడికి పదకొండో సంవత్సరంలో, వైశ్యుడికి పన్నెండో సంవత్సరంలో, ఉపనయన సంస్కారం జరగాలి.

పదహారు సంవత్సరాల లోపల బ్రాహ్మణుడికి, క్షత్రియుడికి ఇరవై రెండు, వైశ్యుడికి ఇరవైనాలుగు సంవత్సరాల లోపల గాయత్రీ మంత్రాన్ని ఉపదేశం పొందే అధికారం వుంది. ఆ వయసుదాటిన వారు వ్రాత్యులు అని పిలవడతారు. వారు వ్రాత్యస్తోమం అనే యజ్ఞం చేస్తేగానీ పవిత్రులు కారు. అలా చేసిన తరువాతే గాయత్రీ మంత్రదీక్ష స్వీకరించటానికి అర్హులౌతారు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలవారు ముగ్గురూ మృగచర్మాన్ని, గడ్డితో చేసిన వడ్డాణాన్ని, జంధ్యాన్ని, దండాన్ని ధరించాలి. వీటిని ధరించిన తరువాత ముందుగా సూర్యుణ్ణి, తరువాత గురువుని శాస్త్రోక్తంగా పూజించాలి. బిక్షాటనకి బయలుదేరాలి.

వటువులకి మొదటి బిక్ష తల్లి లేకపోతే అక్కగానీ, మేనత్తగానీ వేయాలి. బిక్షని అడిగేడప్పుడు బ్రాహ్మణ వటువు 'భవతి భిక్షాందేహి' అని, క్షత్రియవటువు "భిక్షాం భవతిమేదేహి" అని, వైశ్య వటువు "భిక్షాం దేహిమే భవతి" అని అడగాలి. భిక్షలో ధనాన్ని, బంగారాన్ని, వెండిని, బియ్యాన్ని ఆహారాన్ని వెయవచ్చు. ఈ విధంగా భిక్షద్వారా లభించిన పదార్థాలని గురువుకి సమర్పించాలి. తరువాత ఆయన అనుమతితో శాస్త్రోక్తంగా ఆచమనం చేసి భోజనం చేయాలి.

**భోజన విధి :** బ్రహ్మచారి శాస్త్రోక్తంగా భోజన విధిని ఆచరించాలి. తూర్పుదిశవైపు కూర్చుని భోజనం చేస్తే ఆయువు, దక్షిణదిశవైపు కూర్చుని తింటే కీర్తి, పడమర వైపు కూర్చుని తింటే ధనం, ఉత్తరాభిముఖంగా కూర్చుని భోజనం చేస్తే సత్యం వృద్ధి చెందుతాయి.

★భోజనాన్ని ఏకాగ్రతతో చేయాలి ★భోజనం చేసేటప్పుడు ఎవరితో మాట్లాడకూడదు ★మంచి ఆహారాన్ని తినాలి ★భోజనం చేసిన తరువాత ఆచమనం చేసి కళ్ళు, ముక్కు, చెవిని నీటితో తాకాలి ★అన్నాన్ని ఎప్పుడూ స్తుతించాలి ★అన్న నింద చేయకూడదు ★అన్నాన్ని చూడగానే ఆనంద పడాలి ★తినేదాన్ని సంతృప్తిగా తినాలి ★అన్నాన్ని పూజిస్తే బలం తేజస్సు వృద్ధి

చెందుతాయి. దాన్ని నిందిస్తే ఈ రెండూ నశిస్తాయి. ★ఎంగిలి ఆహారాన్ని ఎవరికీ దానం చేయకూడదు. ★ఒక్కడే భుజించకూడదు. ★భోజనాన్ని నాలుగైదుసార్లు చేయకూడదు. ★ఒకేసారి నిష్ఠగా సంతృప్తిగా భుజించాలి.

ఒకసారి తిని వదిలిన అన్నాన్ని తిరిగి తినకూడదు ★అధికంగా భుజిస్తే అనారోగ్యం కలుగుతుంది. ★అధికంగా భుజిస్తే అనారోగ్యం కలుగుతుంది. ★ఎన్నోరోగాలు, అజీర్ణవ్యాధివల్లే పుట్టుకొస్తాయి. అజీర్ణవ్యాధికి గురైన వారు స్నానం, దానం, తపం, హోమం, తర్పణం పూజలాంటి నిత్యనైమిత్తిక సత్కర్మల్ని మనసు లగ్నం చేసి శ్రద్ధగా చేయలేడు. ★అతిభోజనం వల్ల ఆయువు తగ్గిపోతుంది. ★అధికంగా తినేవాడికి సమాజంలో గౌరవం వుండదు. ★భోజనం చేసిన తరువాత నోరు చేతులూ శుభ్రంగా కడగకపోతే అశుచిదోషం ఏర్పడుతుంది. ★అన్నం పరబ్రహ్మ స్వరూపం కనుక భోజనాన్ని ఒక పవిత్రకార్యంలా భావించి శ్రద్ధగా భుజించే వాళ్ళు ఇహపరసుఖాల్ని పొందుతారు.

**ఆచమనం :**

ఆచమనాన్ని చేస్తే దేవతలు సంతోషిస్తారు. అయితే ఆచమనాన్ని విధివిధానంగా చేయాలి. చేతులూ, కాళ్ళూ శుభ్రంగా కడుక్కుని చక్కని దర్భాసనాన్ని నేలమీద వేసుకుని దానిమీద కూర్చోవాలి. తూర్పు లేదా ఉత్తర దిశకి తిరిగి కుడి చేతిని మోకాళ్ళకి మధ్యస్థంగా పెట్టి పిలకని ముడి వేసి నిర్మలమైన నీళ్ళతో ఏకాగ్రంగా ఆచమనం చేయాలి. వేళ్ళని కలిపివుంచి శ్రద్ధగా పవిత్రజలంతో ఇలా మూడు సార్లు ఆచమనం చేస్తే గొప్ప ఫలితం లభిస్తుంది. దేవతలు ప్రసన్నమౌతారు. మొదటిసారి చేసిన ఆచమనానికి ఋగ్వేద దేవతలు, రెండోసారి చేసిన ఆచమనానికి యజుర్వేదదేవతలు, మూడోసారి ఆచమనం చేస్తే సామవేద దేవతలు సంతృప్తి చెందుతారు.

ఆచమనం చేసిన తరువాత చేతిలో మిగిలిన జలాన్ని తలకి తాకిస్తే శివుడు ఆనందిస్తాడు. ఆచమనం చేసిన తరువాత ఆ చేత్తో శిఖని స్పర్శిస్తే ఋషిగణాలు, కళ్ళని తాకితే సూర్యుడు, ముక్కునితాకితే వాయువు, భుజాలని స్పర్శిస్తే అష్టదిక్పాలకులు తదితరులు ఆనందిస్తారు. ఆచమనం చేసిన నీటిని

బొడ్డుకు అద్దితే సకలదేవతలనీ ఆరాధించినఫలం లభిస్తుంది. ఆచమనం చేసిన తరువాత కాళ్ళు కడుక్కుంటే శ్రీహరిని పూజించిన ఫలితం కలుగుతుంది. ఆచమనం తరువాత మిగిలిన నీళ్ళని నేలమీదకి భక్తిగా చల్లితే వాసుకి (సర్పాన్ని) తలచినంత పుణ్యం లభిస్తుంది.

బొటనవేలు అగ్నిస్వరూపం. చూపుడువేలు వాయు స్వరూపం. మధ్యవేలు ప్రజాపతి. ఉంగరం వేలు సూర్యుడి రూపం. చిటికెనవేలు ఇంద్రస్వరూపం. కనుక ఈ వేళ్ళతో న్యాసం చేయాలి. ఆచమనం చేసిన తరువాత బొటనవ్రేలు ఉంగరం వేలితో ముక్కుని, బొటనవేలు చూపుడు వేలుతో కళ్ళని, బొటనవేలు చిటికెనవేళ్ళతో చెవుల్ని, అన్ని వేళ్ళతో భుజాల్ని, తలని తాకాలి. తరువాత బొటనవేలితో బొడ్డుని తాకాలి. ఈ విధంగా శ్రద్ధా భక్తులతో ఆచమనాన్ని చేసేవాడిని దేవతలు ఆశీర్వదిస్తారు. లోకంలో అందరూ అతన్ని గౌరవిస్తారు.

**గాయత్రీ జపవిధి :**

దర్శ, పౌర్ణమాసాది విధి యజ్ఞాల కన్నా జపయజ్ఞాలు గొప్పవి. అలాంటి యజ్ఞాలు చేసినా చేయలేకపోయినా బ్రాహ్మణుడు గాయత్రీ యజ్ఞాన్ని చేసి తీరాలి. దీనిద్వారా అతడికి అన్ని సిద్ధులూ లభిస్తాయి.

ఉపనయనం అయినవాడు సూర్యోదయానికన్నా ముందు బ్రాహ్మీ ముహూర్తంలో ప్రాతః సంధ్యావందనాన్ని ఆచరించాలి. ప్రాతః సంధ్యని సూర్యోదయానికి ముందు నుంచి సూర్యుడు ఉదయించేదాకా చేయాలి. అలాగే సాయం సంధ్యా వందనాన్ని కూడా సూర్యాస్తమయానికి ముందే మొదలుపెట్టి సూర్యాస్తమయంలో తారలు ఉదయించేదాకా చేయాలి. ఈ రెండు సంధ్యలలో గాయత్రీ మంత్ర జపాన్ని కనీసం వెయ్యిసార్లు జపించాలి.

ప్రాతఃసంధ్యావందనంలో నిలబడి గాయత్రీ మంత్రజపం చేయాలి. దానివల్ల రాత్రి చేసిన పాపాలు తొలగిపోతాయి. అలాగే సాయం సంధ్యావందనాన్ని కూర్చుని చేయాలి. దీనివల్ల ఉదయం నుంచి చేసిన పాపాలు

నశించి పోతాయి. కనుక గాయత్రీమంత్ర జపాన్ని ఇరు సంధ్యల్లో చేయటం ఉత్తమం. గాయత్రీ మంత్రాన్ని ఇంటికి బైటగానీ, అరణ్యాలలో, నదీ సాగర తీరాలలో, నదీ సాగర సంగమ స్థలాలలో, ఏకాంతంగా జపించటం వల్ల ఫలితం త్వరగా లభిస్తుంది.

**శిష్యుడి ధర్మాలు :**

విద్యని గురువుద్వారానే నేర్చుకోవాలి. గురువు లేకుండా స్వయంగా వేద శాస్త్రాలు అభ్యసించేవాడు రౌరవాది నరకాలకి వెళతాడు. గురుకుల మర్యాదని పాటించి గురువు ఆజ్ఞని శిరసావహించాలి. గురువు సమక్షంలో ఆసనం మీదగానీ, మంచం మీదగానీ కూర్చోకూడదు. ఒకవేళ ముందే కూర్చొనివుంటే గురువురాగానే లేచి నిలబడి నమస్కరించాలి. వృద్ధుల్ని గౌరవించాలి. వారికి నమస్కరిస్తే ఆయువు, బలం, విద్య వృద్ధి చెందుతాయి. బ్రహ్మచారి వినయాన్ని గౌరవాన్ని కలిగి వుండాలి. తనకి బంధువు కాని స్త్రీలని 'భవతీ' అని పిలవాలి. తనకన్నాచిన్నవాళ్ళని 'సుభగే' 'భగినా' అని సంబోధించాలి.

ఒక మనిషి అభివృద్ధి చెందటానికి గొప్పవాడుగా కీర్తి ప్రతిష్ఠలు పొందటానికి 1.ధనం 2. బంధువులు 3.వంశం 4.చేసేపనులు 5.విద్య అనేవి కారణాలుగా వుంటాయి.

**ఆచార్యుడు :**

ఎవరైతే తన శిష్యులకి ఉపనయన సంస్కారం చేసి, తత్త్వరహస్యాన్ని బోధిస్తాడో, సమగ్రంగా వేదాధ్యయనాన్ని చేయిస్తాడో అతడే 'ఆచార్యుడు' అని కీర్తించబడతాడు. అలా కాకుండా శిష్యుడి జీవన పోషణ కోసం వేదాల్నికాక వేదాంగాలని బోధించిన వాడు 'ఉపాధ్యాయుడని' పిలవబడతాడు. శాస్త్రంలో చెప్పిన సంస్కారాలన్నీ విధిగా జరిపించి, శిష్యుణ్ణి పోషించే వాడిని 'గురువు' అంటారు. అగ్నిష్టోమాది పాకయజ్ఞాలని స్వయంగా శిష్యుడి చేత చేయిస్తూ వాటిని నేర్పేవాడిని 'ఋత్విక్' అంటారు. కనుక శిష్యుడు వీరందరినీ గౌరవించి పూజించాలి.

ఉపాధ్యాయాందశాచార్య ఆచార్యాణాంశతం పితా।
సహస్రేణ పితుర్మాతా గౌరవేణాతిరిచ్యతే ॥ *(అధ్యా-4 శో-71)*

ఉపాధ్యాయుడికన్నా పదిరెట్లు ఎక్కువగా ఆచార్యుడు, ఆచార్యుడికన్నా వందరెట్లు ఎక్కువగా తండ్రి, అతడికన్నా వెయ్యిరెట్లు అధికంగా తల్లి గౌరవించతగిన వారు. శిష్యుడికి తండ్రి-వేదాన్ని నేర్పిన గురువు ఇద్దరూ తండ్రులే. వీరిద్దరిలో వేదాధ్యయనం చేసినవాడే మహాగురువు. జన్మనిచ్చిన తండ్రికన్నా గొప్పవాడు.

**మహాగురువు :**

వేదాలని అష్టాదశపురాణాలని, రామాయణ భారతాలని, విష్ణుతత్త్వాన్ని, శివశక్తి తత్త్వాలనీ, వేదాంగాలని, స్మృతుల్ని బాగా అధ్యయనం చేసినవాడిని మహాగురువంటారు. వయసుకాదు జ్ఞానమే గురుత్వానికి కొలమానం.

## స్త్రీల శుభాశుభ లక్షణాలు

బ్రహ్మచర్యాశ్రమాన్ని ముగించిన స్నాతకుడైన శిష్యుడు వేదాధ్యయనం పూర్తయిన తరువాత గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. స్నాతకుడిగా ఇంటికి వచ్చిన బ్రహ్మచారిని ఇంట్లోని వారు పూలమాలవేసి లోపలికి తీసుకెళ్ళి మంచం మీద కూర్చోబెట్టి మధుపర్కాలు ఇవ్వాలి. తరువాత అతడికి వివాహం చేయటం కోసం శుభలక్షణాలున్న కన్యని వెతకాలి.

**స్త్రీల శుభలక్షణాలు :**

★ఎర్రగా కలువపూలలాంటి కాంతులతో ప్రకాశిస్తూ, నడిచేడప్పుడు కాలికీ నేలకీ మధ్య ఖాళీలేకుండా సమతులంగా వున్న పాదాలు ఏ స్త్రీకి వుంటాయో ఆ స్త్రీ సుఖభోగాలు లభిస్తాయి. ★కాలి మడమలు నున్నగా సమంగా వుండే స్త్రీ ధనవంతురాలవుతుంది. ★మెడమీద నాలుగు అంగుళాల వెడల్పుతో మూడు రేఖలు స్పష్టంగా కనిపించే వనిత అధికారిణి అవుతుంది. ★పగిలిన, ఉబ్బిన పాదాలు దారిద్ర్యానికి సంకేతాలు. ★కాలివేళ్ళు ఒకదానితో ఒకటి పరస్పరం తగులుతూ గుండ్రంగా నున్నగా వుండి, చిన్న గోళ్ళు కలిగివుంటే

ఆ స్త్రీ ఐశ్వర్యవంతురాలవుతుంది. ★కాలివేళ్ళు చిన్నగా వుంటే మంచిది కానీ వాటిమధ్యదూరం ఎక్కువగా వుంటే ధనలక్ష్మి క్షీణిస్తుంది.

**చేతులు :**

★స్త్రీ చేతి రేఖలు మెత్తగా, లోతుగా, గులాబీ రంగులో వుంటే భోగాన్ని కలిగిస్తుంది. అంతేకాదు ఆ స్త్రీ భోగాల్ని అనుభవిస్తుంది కూడా. ★అదే హస్తంలోని రేఖలు తెలిపోతూ ముక్కలుగా వుంటే దరిద్రం పడుతుంది. చిటికెనవేలు మూల నుంచి చూపుడువేలు చివరదాకా ఒక రేఖ గనుక అరచేతిలో వుంటే ఆ స్త్రీ నూరేళ్ళు జీవిస్తుంది. ★చేతి చిటికెనవేళ్ళు గుండ్రంగా, పొడుగ్గా, సన్నగా పక్క వేలితో కలిపి వుంచితే ఏమాత్రం సందులేకుండా ఎర్రని రంగులో వుంటే ఆ స్త్రీ ఎన్నో సుఖభోగాల్ని పురుషుడికి అందిస్తుంది. ★ఎర్రగా ఎత్తుగా నున్నగా గోళ్ళు వున్న స్త్రీ ధనకారకురాలవుతుంది. ★రెండు చేతులూ సమానంగా లేకుండా తగులుతూ పగిలి పోయివుంటే ఆ స్త్రీ కష్టాలు అనుభవిస్తుంది. వేళ్ళ మధ్య సందులు సమానంగా వుండి యవధాన్యం గింజలు గుర్తులు కలిగివుండే స్త్రీకి అపారమైన సుఖాలు, అక్షయంగా ధనధాన్యాలు ప్రాప్తిస్తాయి. ఎర్రగా నున్నగా పొట్టిగోళ్ళు వున్న పడతి సౌభాగ్యవతి ధనవంతురాలు అవుతుంది. స్త్రీకి గోళ్ళు పొడవుగా వుంటే కొడుకులు పొట్టిగా వుంటే తల్లి ఐశ్వర్య వంతులవుతారు.

**మెడ :**

★స్త్రీకి మెడ బలహీనంగావుంటే బీదరాలవుతుంది. బాగా పొడవైన మెడవున్న స్త్రీ ఎంతో మంది పురుషులతో సాంగత్యాన్ని కోరుతుంది. మెడ మరీ చిన్నగా వున్నా మంచిదికాదు. అలా వుంటే ఆ స్త్రీకి సంతాన నష్టం జరుగుతుంది. మెడ పక్కగా వచ్చే భుజాలు పొట్టిగా గుండ్రంగా పుష్టిగావుంటే ఆ స్త్రీ దీర్ఘాయువు పొందుతుంది. తన భర్త ఆయుష్షుని కూడా పెంచుతుంది.

**ఇతర అంగాలు :**

★స్త్రీకి నాసిక (ముక్కు) ఎటువంటి ఎగుడుదిగుడు లేకుండా సమతులంగా వుంటే సౌభాగ్యవతి అవుతుంది. అదే విధంగా రెండు కనుబొమలూ

కలవకుండా విల్లులాగా ఒంపులు తిరిగి సన్నగా వుండాలి. ఆమె కేశాలు కూడా నల్లగా ఒత్తుగా వుండాలి. అలా వున్న స్త్రీ సౌభాగ్యాల్ని భర్తకు కుటుంబానికి అందిస్తుంది. కోయిల, వీణ, భ్రమరం (తుమ్మెద) వేణువులతో సమానమైన గొంతు కలిగిన స్త్రీలు సుఖసంపదలకి నిలయాలుగా భాసిస్తారు. ఇది కాకుండా గాడిద, కాకి, కంచులాంటి స్వరాలు కలిగిన స్త్రీలకి రోగాలు, భయం, శోకం, దరిద్రం వంటివి కలుగుతాయి.

**స్త్రీల నడక :**

స్త్రీల నడక హంసలాగా, ఆవులాగా వృషభంలాగా, చక్రవాకంలాగా, ఏనుగులాగా వుంటే వారు తమ వంశానికి ఎంతో కీర్తి ప్రతిష్ఠలు తీసుకువస్తారు. రాణీ భోగాలనుభవిస్తారు. కుక్కలాగా, నక్కలాగా నడిచేస్త్రీలు నిందలకి గురౌతారు. లేడిలాగా నడిచేస్తే దాసీ అవుతుంది. ఆగి ఆగి నడిచే స్త్రీ బంధకి అవుతుంది. శరీరంలో వున్న అన్ని అంగాలు కోమలంగా వుండి అధికంగా చెమట పట్టకుండా, రోమాలు లేకుండా వుండే స్త్రీ అందరిచేతా పూజించ బడుతుంది. గౌరవించబడుతుంది.

పింగళవర్ణం(పసుపు)తో, కపిల వర్ణంతో వుండేది. అన్ని అంగాలు పెద్దవిగా కనబడేది. ఎక్కువగా మాట్లాడేది అయిన స్త్రీని వివాహం చేసుకోకూడదు. వివాహం చేసుకునే స్త్రీ పేరుని కూడా పరిశీలించి చేసుకోవాలి. నక్షత్రం, వృక్షం, నది, పర్వతం, పక్షి సర్పం లాంటి పేర్లు కలిగిన స్త్రీని పెళ్ళాడకూడదు. శరీరాంగాలు సమతుల్యంగా వుండి, మంచిపేరు కలిగి, సన్నని రోమాలు కలిగి, హంస లేక ఏనుగులా నడిచేదానిని, నల్లగా మెరిసే కేశపాశాలు, తెల్లగా మెరిసే దంతాలు కలదానిని వివాహం చేసుకోవాలి.

ఈ శుభలక్షణాలన్నీ వున్న స్త్రీని జాగ్రత్తగా చూసుకుని వివాహం చేసుకోవాలి. శారీరక లక్షణాలకన్నా సదాచారాన్ని పాటించేవారి వైపే మొగ్గు చూపాలి. అందమైన శరీరాకృతి వున్నా ఉత్తమ సంస్కారంలేని కన్యని పెళ్ళి చేసుకోకూడదు.

## వివాహయోగ్య కన్య - వివిధ రకాల వివాహాలు

బ్రహ్మచారి తల్లికి చెందిన ఏడుతరాల వారి ఇంటి పేర్లలో ఏ ఒక్కపేరూ, తను పెళ్ళిచేసుకోబోయే కన్య ఇంటిపేరు ఒక్కటి కాకూడదు. అలాగే బ్రహ్మచారి తండ్రి గోత్రం కన్య తండ్రి గోత్రం ఒకటికాకూడదు. ఈ రెండు లక్షణాలు లేసి కన్యని వివాహం చేసుకోవాలి. వివాహం చేసుకోబోయే కన్యకి కనీసం ఒక్కడైనా సోదరుడుండాలి. అంతేకానీ ఒకే సంతానంగా పెరిగిన కన్యని వివాహం చేసుకోకూడదు. ధర్మాచరణ సక్రమంగా కొనసాగాలంటే ప్రతి ఒక్కరూ తమ వర్ణంలో వున్న స్త్రీలనే వివాహం చేసుకోవాలి.

వివాహాలలో మొత్తం ఎనిమిదిరకాలున్నాయి. అవి 1.బ్రహ్మం 2.దైవ 3.ఆర్ష 4.ప్రాజాపత్య 5.అసుర 6.గాంధర్వ 7.రాక్షస 8 పైశాచ అనేవి.

**1. బ్రహ్మ వివాహం :** యజ్ఞం చేస్తున్న ఋత్విజుణ్ణి అలంకరించి, పూజించి శాస్త్రోక్తంగా కన్యనిచ్చి వివాహం జరిపించటం

**2. దైవ వివాహం :** యజ్ఞం చేస్తున్న ఋత్విజుణ్ణి అలంకరించి, పూజించి శాస్త్రోక్తంగా కన్యనిచ్చి వివాహం జరిపించటం

**3. ఆర్ష వివాహం :** వరుడినుంచి అతనికి కాబోయే మామగారు ధర్మబద్ధంగా రెండు జతల ఆవుల్ని, ఎద్దుల్ని స్వీకరించి తన కుమార్తెనిచ్చి వివాహం చేయడం

**4. ప్రాజాపత్య వివాహం :** పెద్దలు కాబోయే పెళ్ళికూతురు పెళ్ళి కొడుకుల్ని ఒకచోట చేర్చి "మీ ఇద్దరూ ఈనాటి నుంచి గృహస్థ ధర్మాన్ని ఆచరించండి" అని చెప్పి వారిద్దరికీ వివాహం జరిపించటం

**5. అసుర వివాహం :** వరుడు స్వచ్ఛందంగా, తాను వివాహం చేసుకోబోయే కన్యకి, ఆమె తండ్రికి, బంధువులకీ, యథాశక్తి ధనధాన్యాల్ని సమర్పించి ఆ కన్యని వివాహం చేసుకోవటం.

**6. గాంధర్వ వివాహం :** ఎవరి అనుమతీ లేకుండా వరుడు కన్య పరస్పరం ఇచ్ఛాపూర్వకంగా తమకు తామే చేసుకునే వివాహం.

**7. రాక్షస వివాహం :** కన్యకి ఇష్టం లేకపోయినా ఆమెని అపహరించి బలవంతంగా పెళ్ళిచేసుకోవటం

**8. పైశాచ వివాహం :** అన్నిటికన్నా అధమమైనది ఈ పద్ధతి నిద్రపోతున్న కన్యని, లేదా కామగ్రస్తురాలిని, పిచ్చి పట్టినదానిని, ఎవరూ చూడకుండా ఎత్తుకుపోయి చేసుకునే వివాహం.

బ్రహ్మవివాహం ద్వారా జన్మించిన పుత్రుడు అటు ఇటు పది తరాల వారినీ ఉద్ధరిస్తాడు. దైవ వివాహం వల్ల ఆ దంపతులకి జన్మించిన కుమారుడు అటు ఇటు ఏడుతరాలవారిని తరింపచేస్తాడు. ఆర్ష వివాహం జరుపున్న దంపతుల పుత్రుడు అటు ఆరు ఇటు ఆరు తరాలవారిని, ప్రాజాపత్య పద్ధతిలో వివాహం జరుపుకున్న దంపతుల కుమారుడు అటు ఇటు ఆ తరువాత వారినీ ఉద్ధరిస్తాడు.

## పతివ్రత ధర్మాలు

భర్త మనసెరిగి అతడు ఎప్పుడేది కోరుకుంటాడో దాన్ని అతడు అడగటానికి ముందే తెచ్చిపెట్టేది. సర్వకాల సర్వావస్థలలో భర్తమేలునే కోరుకునేది. భర్తనే కాక అతడి తల్లి తండ్రుల్ని, గురువుల్ని బంధుమిత్రుల్ని గౌరవించేది. భర్త ఆజ్ఞని ఏ మాత్రం జవదాటనిది అయిన స్త్రీ పతివ్రత. ఉత్తమ స్త్రీ తన భర్తని మనసా వాచా కర్మణా దైవంగా భావించాలి. భర్త చేసే దైవ, పితృ కార్యక్రమాల్లో అతిథి సత్కారాలలో ఎవరినీ వినియోగించకుండా తానే స్వయంగా పాల్గొనాలి.

భర్తృ చిత్తానుకూలత్వం యాసాంశీల మవిచ్యుతం ।
తాసాంరత్న సువర్ణాది భార ఏవ స మండనం ॥ 1

లోకజ్ఞానే పరాకోటిః పత్యై భక్తిశ్చ శాశ్వతీ ।
శుద్ధాన్వయానాం నారీణాం విద్యాదేతత్కులం వ్రతం ॥ 2

*(అధ్యా-13 శ్లో 64-65)*

భర్తకి అనుకూలంగా వుండటం, మంచి శీలం అనే ఈ రెండు గుణాలు కల్గివున్న స్త్రీలకి బంగారం, రత్నాలు వంటివి కేవలం బరువులు మాత్రమే అవుతాయి కానీ అలంకారాలు కావు. ఏ కులంలో వంశంలో పుట్టిన స్త్రీకైనా లోకం, జ్ఞానం భర్తమీద అచంచలమైన భక్తి కంటే గొప్ప ధర్మాలు మరేవీ లేవు. ఇదే కులస్త్రీ ధర్మం. కనుక ఏ స్త్రీ లోకాన్ని భర్తని సక్రమంగా ఆరాధిస్తుందో ఆ స్త్రీ మాత్రమే ధర్మార్ధకామాల్ని పొంది ఉత్తమ పతివ్రతగా విఖ్యాతి చెందుతుంది.

## పంచ మహాయజ్ఞాలు

గృహస్థుడైన ప్రతివాడూ పంచమహాయజ్ఞాల్ని ఆచరించాలి. ఇవి మన దైనందిన కర్మల్లో ఎంతో ప్రాధాన్యం కలిగినవి. నిత్యం గృహస్థులు చేసే కర్మల్లో రోలు, తిరగలి, పొయ్యి, చీపురు, నీళ్ళు ఉంచే చోటు అన్ని ప్రదేశాల్లో హింస జరుగుతూ వుంటుంది. ఇక్కడ గృహస్థులు చేసే పనుల వల్ల ఎన్నో సూక్ష్మజీవులు పరోక్షంగా హింసించబడుతున్నాయి. ఆ పాపం నుంచి విముక్తి కలగటం కోసం పంచమహాయజ్ఞాలు విధిగా చేయాలి. 1. బ్రహ్మ యజ్ఞం 2. పితృయజ్ఞం 3. దైవయజ్ఞం 4. భూతయజ్ఞం 5. అతిథి యజ్ఞం అనేవి పంచయజ్ఞాలు.

## నిత్యం ఔపాసన చేయనివారు తరించే విధానం

ఏదైనా కారణాల వల్ల గృహస్థులు నిత్య ఔపాసన కర్మల్ని నిర్వర్తించకపోతే వారు వ్రతాలు, ఉపవాసాలు, కొన్ని నియమాలు, దానాలు, దేవతాస్తుతులు ఆచరించటం వల్ల ఉద్ధరించబడతారు.

ప్రతిపత్తిథి (పాడ్యమి) నాడు పాలని ఆహారంగా స్వీకరించాలి. మరేదీ తినకూడదు. ద్వితీయ (విదియ) నాడు ఉప్పులేని పదార్ధాలు స్వీకరించాలి. తదియ రోజు కేవలం నూనె, అన్నం మాత్రమే తినాలి. చవితి నాడు పాలు మాత్రమే ఆహారం కావాలి. పంచమినాడు పళ్ళని మాత్రమే స్వీకరించాలి. షష్ఠినాడు కేవలం కూరగాయల్ని (పచ్చివి), సప్తమిరోజు బిల్వఫలాల్ని, పత్రాల్ని, అష్టమిరోజు కేవలం పిండిని, నవమి తిథినాడు నిప్పుతో వండని ఆహారాన్ని,

దశమి,ఏకాదశులలో నెయ్యిని, ద్వాదశి రోజు కేవలం ఫలరసాల్ని, త్రయోదశి నాడు గోమూత్రాన్ని, చతుర్ధశి తిథిలో యవధాన్యంతో వండిన అన్నాన్ని స్వీకరించాలి. పౌర్ణమిరోజు దర్భలతో పవిత్రంచేయబడిన నీటిని మాత్రమే తీసుకోవాలి. ఇక అమావాస్య తిథిరోజు హవిష్యాన్ని భుజించాలి.

ఈవిధంగా ఒక పక్షం (15రోజులు) ఈ వ్రతాన్ని ఆచరించిన వారికి పది అశ్వమేధయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. ఒక మన్వంతరం దాకా స్వర్గలోక నివాసం కలుగుతుంది. ఇలా మూడు నాలుగు మాసాలు ఉపవాసం చేస్తే వారికి వంద అశ్వమేధాలు, వంద రాజసూయయాగాలు చేసిన ఫలితం లభిస్తుంది. అలాగే ఎన్నో మన్వంతరాలు స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. ఇదే ఉపవాసవ్రతాన్ని ఎనిమిది నెలలు పాటించిన వారికి పైన తెలిపిన శుభఫలితాలతో పాటు పద్నాలుగు మన్వంతరాలకాలం స్వర్గలోక నివాసం లభిస్తుంది. అదే ఒక సంవత్సరకాలం ప్రతినెలా పక్షంరోజులు పాటు ఈ వ్రతాన్ని క్రమం తప్పకుండా ఆచరించిన వారికి సూర్యలోక నివాసంకలుగుతుంది. ఈ ఉపవాస వ్రతాన్ని నాలుగు వర్ణాల వారూ ఆచరించవచ్చు.

ఎంతో విశిష్టమైన ఈ వ్రతాన్ని ఆశ్వయుజ శుద్ధ నవమి, మాఘ సప్తమి, వైశాఖ శుద్ధ తదియ, కార్తీక పౌర్ణమి తిథుల్లో ప్రారంభించి నియమబద్ధంగా పూర్తి చేసినవారికి దీర్ఘాయువు, మరణించాక సూర్యలోక ప్రాప్తి కలుగుతాయి.

## పుష్పద్వితీయ వ్రతం - చ్యవనమహర్షి కథ

సత్యయుగంలో ఒకనాడు చ్యవన మహర్షి గంగాతీరంలో కూర్చుని తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ మహాముని తపస్సులోనే మునిగిపోయాడు. ఒకనాడు శర్యాతి మహారాజు తన పరివారంతో గంగానదీ స్నానం కోసం బయలు దేరి చ్యవనమహర్షి ఆశ్రమ ప్రాంతంలో విడిదిచేశాడు. అక్కడ నుంచి వెళ్ళి తన బృందంతో సహా పవిత్ర గంగానదిలో స్నానాదికాలు, పిండప్రదానాలు నిర్వర్తించి తిరిగి తన

రాజ్యానికి బయలుదేరాడు. అయితే అప్పుడొక విచిత్ర సంఘటన జరిగింది. శర్యాతి మహారాజుకి ఉన్నట్టుండి ఏదో ఆందోళన మనసులో ప్రారంభమయ్యింది. కొద్దిసేపటికి ఆయన మూత్ర ద్వారం, మలద్వారం బిగుసుకుపోయాయి. కళ్ళు కనపడటం లేదు. శర్వాతి మహారాజు ఒక్క క్షణం తమాయించుకుని ఆలోచించాడు. తన పరివారంలో ఎవరో ఏదో తప్పుచేసారనిపించింది. వెంటనే అందరినీ పిలిచి "ఇది చ్యవనమహర్షి పవిత్ర తపఃస్థలం ఇక్కడ మీలో ఎవరైనా అనుచితమైన పనిచేసారా" అని ప్రశ్నించాడు. ఎవరూ ఏమీ జవాబివ్వలేదు. అంతలో శర్వాతి కుమార్తె సుకన్య వచ్చి తండ్రితో ఇలా చెప్పింది.

తండ్రిగారూ! నేనొక వింతని చూసాను. ఈ ఆశ్రమం పక్కనే వున్న ఆ ఉద్యానవనంలోకి నేను విహారానికి వెళ్ళాను. నాకు అక్కడ "ఓ సుకన్యా ఇటురా! ఇటురా! అనే మాటలు వినిపించాయి. నేను ఆశ్చర్యంగా ఆ మాటలు వినిపించే చోటుకి వెళ్ళాను. అక్కడ నాకు బాగా ఎత్తుగా పెరిగిన పుట్ట కనిపించింది. ఆశ్చర్యంగా ఆ పుట్టకి రెండు గుంటలున్నాయి. అందులోంచి దివ్యమైన కాంతులు బైటికి వస్తున్నాయి. ఏదో దివ్యమణి ఆ పుట్టలో వుందని ఈ వెలుగులు దానివేనని నాకనిపించింది. అయినా నాకెందుకులే అనుకుని వెనక్కి రాబోయాను. బుద్ధి చెడ్డది కదా! నాకు ఆసక్తి తగ్గక పక్కనే వున్న ఒక దర్భని తీసుకుని దానితో వెలుగులు వస్తున్నా ఆ రెండు గుంటల్లో పొడిచాను. వెంటనే అందులోంచి వెలుగులు రావటం ఆగిపోయాయి" అని చెప్పింది.

సుకన్య మాటలు విన్న శర్యాతికి అనుమానం వచ్చింది. తన కూతురేదో తప్పు చేసిందనిపించింది. ఆలస్యం చేయకుండా సుకన్యని వెంటబెట్టుకుని ఆపుట్ట దగ్గరకి వెళ్ళాడు. ఆ పుట్టని పరిశీలించి చూడగా లోపల తపస్సు చేసుకుంటున్న చ్యవన మహర్షి కనిపించాడు. సుకన్య పొడిచింది ఆయన కళ్ళనే. రాజు చూసేసరికి నేత్రవిహీనంగా చ్యవనుడు తపస్సులో వున్నాడు. శర్యాతి ఎంతో భయంతో ఆయన పాదాల మీద పడి పోయాడు. తన కుమార్తె చేసిన తప్పిదాన్ని క్షమించమని వేడుకున్నాడు. చ్యవనుడు కళ్ళు తెరిచి "రాజా!

ఇది దైవ నిర్ణయం నేను నీ కుమార్తెను క్షమించాను. నీవు సుకన్యని నాకిచ్చి వివాహం చేయి నీకు సకల శుభాలూ కలుగుతాయి అని పలికాడు.

చ్యవనుడి కోరిక ప్రకారం శర్యాతి సుకన్యని ఆయనకిచ్చి వివాహం చేసాడు. వెంటనే రాజుకి అతడి పరివారానికి ఆందోళన ఇతర శారీరక బాధలన్నీ తొలగిపోయాయి. సుకన్యని ఆయనకి అప్పగించి శర్యాతి తిరిగి తన రాజధానికి వెళ్ళిపోయాడు.

ఆనాటినుంచి సుకన్య భర్తనే ప్రత్యక్షదైవంగా భావించుకుంటూ చ్యవనమహర్షికి సేవలు చేయసాగింది. ఆమె సేవలకి చ్యవనుడు ఎంతో ఆనందించాడు కొన్నాళ్ళ తరువాత సుకన్యతో "దేవీ నీకు మాతృత్వాన్ని కలిగిస్తాను" అని అన్నాడు. ఆమాటలు విన్న సుకన్య సిగ్గుతో స్వామీ తమరు తపశ్శక్తి సంపన్నులు. మీ శక్తితో నవయవ్వన రూపం ధరించి నాకు మాతృత్వాన్ని అందించండి" అని కోరింది. దేవీ! ఈ విషయం కోసం నా తపశ్శక్తిని వ్యర్థం చేసుకోలేను అని చెప్పి తిరిగి తపోదీక్షలో మునిగిపోయాడు చ్యవనమహర్షి. అలా కొన్నేళ్ళుకాలం గడిచిపోయింది.

ఒకనాడు దేవవైద్యులైన అశ్వినీకుమారులు ఇద్దరూ ఆ వనంలో విహరిస్తూ అక్కడే వున్న సుకన్యని చూసారు. ఆమె దగ్గరకి వెళ్ళి ఎవరు నీవు? ఎందుకిక్కడ సంచరిస్తున్నావు? అని ప్రశ్నించారు. సుకన్య తన వృత్తాంతాన్నంతా వారికి చెప్పింది. అది విన్న అశ్వినీకుమారులు ఆమెతో "దేవీ! వృద్ధుడైన నీ భర్తతో ఏం సుఖపడతావు. మా ఇద్దరిలో ఎవరో ఒకర్ని వరించు. అని అన్నారు.

వారిమాటలు విన్న సుకన్యకి ఎంతో బాధకలిగింది. కోపం కూడా వచ్చింది. ఆ రెండిటినీ తమాయించుకుని "స్వామీ! మీరు దేవతలు, మేము మానవులం. మీరిలా కోరటం భావ్యం కాదు. నా భర్తనే దైవంగా కొలిచే పతివ్రతను. దయచేసి నన్ను కోరకండి. మీకిది ధర్మం కాదు" అని వినయంగా పలికింది.

అశ్వినీకుమారులు ఆమెతో "దేవీ! మేమొక పనిచేస్తాం. మా దివ్యశక్తితో నీ భర్తని యవ్వనవంతుణ్ణి చేస్తాం. ఆయన మేమిద్దరం గంగలో స్నానంచేసి ఒకే రూపంతో నీ ముందుకి వస్తాం. అప్పుడు మాముగ్గరిలో నీవు ఒకర్ని వరించాలి. అది నీకు సమ్మతమేనా అని అడిగారు. క్షమించండి స్వామీ! నా భర్త అనుమతి లేకుండా నేనేమీ చెప్పలేను అన్నది సుకన్య. సరే నీవు వెళ్ళి నీ భర్తతో చెప్పి ఆయన్నిక్కడికి తీసుకురా! అని చెప్పి పంపారు అశ్వినీ కుమారులు.

సుకన్య సరాసరి చ్యవన మహర్షి దగ్గరకి వచ్చి ఆయనకి విషయమంతా నివేదించింది. అంతా విన్న చ్యవనుడు అశ్వినీ కుమారుల దగ్గరకి వచ్చి "తనని యువకుడిగా మార్చమని వారు కోరిన విధంగానే గంగనుంచి వచ్చిన మన ముగ్గురిలో సుకన్య ఒకర్ని వరిస్తుందని" చెప్పాడు. అందుకు సమ్మతించిన అశ్వినీకుమారులు వృద్ధ చ్యవన మహర్షిని తమతోపాటు గంగలో స్నానానికి తీసుకువెళ్ళారు. ముగ్గురూ ఒక్క మునక వేశారు. ఆశ్చర్యం! తిరిగిపైకి లేచేసరికి చ్యవనుడు, అశ్వినీకుమారులు నవయవ్వనులుగా మారిపోయాడు. ముగ్గురూ కలిసి ఒకే సారి నదినుంచి బైటకి వచ్చారు.

సుకన్య ముగ్గుర్ని చూసింది. ముగ్గురూ ఒకేలావున్నారు. వీరిలో తన భర్తని ఎలా గుర్తుపట్టాలో ఆమెకి బోధపడలేదు. వెంటనే మనసులో తన భర్తని స్మరించి కళ్ళు మూసుకుని" అశ్వినీ దేవతలారా! నేను నా భర్తని మనసావాచా కర్మణా ప్రేమిస్తున్నాను. ఆయన వృద్ధుడైనప్పటికీ ఆయనతోనే నా జీవితం మీ దయవల్ల ఆయనకి యవ్వన శరీరం వచ్చింది. దయచేసి మీరు దేవతల్లానే ప్రవర్తించండి. నేను అనుకున్న మాటలు సత్యమైతే వెంటనే మీరు మీ నిజస్వరూపాల్లో మారిపోండి" అని ప్రార్థించింది.

వెంటనే ఆ ముగ్గురి దగ్గరకీ వచ్చి పరీక్షగా వారిని గమనించింది. వారిలో ఇద్దరి పాదాలు నేలకి ఆనటం లేదు. ఆ ఇద్దరి కనురెప్పలూ మూసుకోవటం లేదు. ఇవి దేవతా లక్షణాలు ఇది గ్రహించిన సుకన్య

ఈ ఇద్దరూ కాని మూడోవ్యక్తే తన భర్త అని తెలుసుకుని అతన్నే వరించింది సుకన్య. వెంటనే ఆకాశం నుంచి పూలవాన కురిసింది. దేవదుందుభులు మ్రోగాయి.

యవ్వనుడుగా మారిన చ్యవనుడు అశ్వినీ కుమారులతో "దేవవైద్యులారా! మీనుంచి నేను ఎంతో ఉపకారాన్ని పొందాను. తిరిగి మీకు ప్రత్యుపకారం చేయటం ధర్మం కనుక మీరెందుకు వచ్చారో చెప్పండి" అని పలికాడు. వెంటనే వారిద్దరూ "సుకన్యని కోరినందుకు ముందుగా క్షమించమని ప్రార్థించి" స్వామీ! మాకు దేవతలందరికీ నిత్యం అందే యజ్ఞభాగాలు అందటంలేదు. దానివల్ల దేవలోకంలో మమ్మల్ని అందరూ తక్కువగా చూస్తున్నారు. కనుక మీరు మాకు యజ్ఞభాగాలు దక్కేలా చేయండి" అని ప్రార్థించారు. తథాస్తు మీ కోరికని అతి త్వరలోనే నెరవేరుస్తానని ఆశీర్వదించాడు చ్యవనమహర్షి. వారు వెనక్కి వెళ్ళిపోయారు.

శర్యాతిమహారాజుకి చ్యవనుడు అందగాడైనాడు అనే వార్త తెలిసింది. వెంటనే ఆయన సంతోషంతో కూతుర్ని అల్లుణ్ణి వెంటబెట్టుకుని తన రాజ్యానికి వచ్చాడు. రాగానే చ్యవనుడు ఒక యాగం చేయాలి, అందుకు తగిన సన్నాహాలు చేయమని కోరాడు. శర్యాతి అలాగేనని యాగానికి తగిన ఏర్పాట్లు చేసాడు. యాగం ప్రారంభమయ్యింది. చ్యవనుడు దేవతలందరికీ ఋత్విక్కులద్వారా ఆహుతులు సమర్పిస్తున్నాడు. ఆయన దివ్యశక్తి ప్రభావంతో దేవతలంతా ప్రత్యక్షంగా వచ్చి ఋత్విక్కులిచ్చే ఆహుతుల్ని ఆనందంగా స్వీకరిస్తున్నారు. చ్యవనుడు అశ్వినీ కుమారులనుద్దేశించి ఆహుతులిప్పించాడు. అవి స్వీకరించటానికి అశ్వినీ కుమారులు వెంటనే అక్కడకి వచ్చారు. అక్కడేవున్న ఇంద్రుడు వారిని చూసాడు. ఆయనకి కోపం వచ్చింది. యాగం చేస్తున్న ఋత్విక్కులతో "మునులారా! ఈ అశ్వినీ కుమారులు కేవలం దేవవైద్యులు కనుక వారికి యజ్ఞభాగాన్ని పొందే అధికారం లేదు. మీరు ఆహుతుల వారికి ఇవ్వకండి" అన్నాడు.

వెంటనే చ్యవనుడు పైకిలేచి దేవేంద్రా! ఈ అశ్వినీకుమారులు కూడా మీ దేవగణంలోని వారే కదా! వారు నాకెంతో ఉపకారం చేసారు. అందుకే వారికి నేను ఆహుతులిప్పించాను. నేను పిలిస్తేనే వారు వచ్చారు. దయచేసి దీన్ని రాద్ధాంతం చేయకు అన్నాడు.

చ్యవనుడి మాటవిన్న ఇంద్రుడికి కోపం వచ్చింది. వెంటనే తన వజ్రాయుధాన్ని ఆయనపై విసరబోయాడు. చ్యవనుడు తన తపఃశక్తితో ఆయుధంతో సహా ఇంద్రుణ్ణి స్తంభింపచేశాడు. ఈ విషయం తెలుసుకున్న బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చి అశ్వినీ కుమారులకి కూడా హవిర్భాగాన్ని ఆనాటి నుంచి కల్పించి, ఇంద్రుణ్ణి స్తంభన నుంచి విడిపించాడు. చ్యవనుడి ద్వారా విముక్తుడైన ఇంద్రుడు ఆయనకి కృతజ్ఞతలు తెల్పి, అశ్వినీదేవతలకి మాతో పాటే హవిర్భాగం కల్పిస్తున్నాం అని తన ఆమోదాన్ని తెలిపి వెళ్ళిపోయారు. అలా చ్యవన మహర్షి అశ్వినీకుమారులు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చేసి ఋణం తీర్చుకున్నాడు. దివ్యమైన ఈచ్యవనమహర్షి వృత్తాంతాన్ని విన్నవారికి పఠించిన వారికి రూప యవ్వనాలు సంప్రాప్తిస్తాయి.

## వ్రత విధానం

ఈవిధంగా అశ్వినీకుమారులకి చ్యవనమహర్షి ద్వారా ద్వితీయా తిథినాడే యజ్ఞాలలో హవిర్భాగం లభించింది. ఈ ద్వితియాతిథినే విదియ అంటారు. కార్తీకమాసంలో శుక్ల పక్ష తిథినే విదియ అంటారు. కార్తీకమాసంలో శుక్ల పక్ష విదియనాడు ఈ వ్రతాన్ని ప్రారంభించాలి. ఆ నాటి నుంచి ఒక సంవత్సరంపాటు కేవలం పుష్పాలని మాత్రమే భుజిస్తూ వ్రతాన్ని సమాప్తం చేయాలి. అలాచేసిన పురుషులకి నవయవ్వన రూపం ప్రాప్తిస్తుంది.వ్రతం పూర్తయిన తరువాత బంగారు లేదా వెండి పూలని గానీ, కమలాలని గానీ బ్రాహ్మణులకి దానమివ్వాలి, ఆ విధంగా వ్రతాన్ని ఆచరించిన వారికి అశ్వినీదేవతల అనుగ్రహంతో ఒక కల్పాంతం వరకూ స్వర్గలోక ప్రాప్తి లభిస్తుంది. మరోజన్మలో వేదవేదాంగ వేత్త అయిన బ్రాహ్మణ రూపం సిద్ధిస్తుంది.

# గౌరీ తృతీయా వ్రతం

స్త్రీలకి అన్ని రకాల సుఖాల్ని ప్రసాదించే వ్రతం గౌరీ తృతీయా వ్రతం. మాఘమాసంలోగానీ, భాద్రపదమాసంలో గానీ తృతీయా (తదియ)తిథినాడు ఈ వ్రతాన్ని ఆరంభించాలి. ఇది స్త్రీ, పురుషులు ఆచరించాల్సిన వ్రతం. ఈ వ్రతం ఆచరించే రోజు ఉప్పు, ఉప్పుతో కలిపిన ఏ పదార్థాలనీ తినకూడదు. ఈ దివ్య వ్రతాన్ని సాక్షాత్తు గౌరీదేవే ధర్మరాజుకి ఇలా ఉపదేశించింది

**వ్రతవిధి :**

ఓ ధర్మరాజా! భార్యా భర్తల సౌఖ్యం కోసమే నేనీ వ్రతాన్ని ఏర్పాటు చేశాను. ఈ వ్రతాన్ని నియమ నిష్ఠలతో ఆచరించిన స్త్రీ నాలాగానే సుఖశాంతులు పొందుతుంది. ముందుగా బంగారు గౌరీదేవి ప్రతిమని పూజామందిరంలో ప్రతిష్ఠించాలి. ఏకాగ్రతతో గౌరీ దేవిని షోడశోపచార పూజతో అర్చించాలి. తరువాత శక్త్యానుసారం నైవేద్యాలు సమర్పించాలి. వ్రతం చేసిన వారు ఉదయం ఉపవాసం ఉండి రాత్రిపూట ఉప్పులేని ఆహారాన్ని స్వీకరించాలి. గౌరీదేవిని స్థాపించిన గదిలోనే నిద్రించాలి. రెండోరోజు ఉదయం బ్రాహ్మణ సమారాధన చేసి దక్షిణ తాంబూలాలతో వారిని సంతృప్తి పరచాలి.

**వ్రతఫలం :**

ఈ వ్రతాన్ని కన్యలు చేస్తే ఉత్తమ భర్త లభిస్తాడు. వితంతువులు ఈ వ్రతాన్ని చేస్తే ఆమె స్వర్గంలో భర్తని కలిసి చాలాకాలం అక్కడే వుండే అదృష్టాన్ని పొందుతుంది. వివాహమైన స్త్రీ ఈ వ్రతాన్ని చేస్తే దీర్ఘసుమంగళత్వం ప్రాప్తిస్తుంది. ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి.

**ఎవరు ఈ వ్రతాన్ని చేస్తారు? :**

పూర్వం ఇంద్రాణి (ఇంద్రుడి భార్య) ఈ వ్రతాన్ని చేసి సకల శుభ మంగళాలని పొందింది. అరుంధతీదేవి ఈ వ్రతాన్ని ఆచరించే తన భర్తతోపాటు ఆకాశంలో నక్షత్రంలో సుస్థిరస్థానాన్ని పొందింది. రోహిణీ ఈ వ్రత ఆచరణ వల్లే చంద్రుణ్ణి తన భర్తగా పొందగలిగింది.

**వ్రతంలో దానాలు :**

వైశాఖ తదియనాడు వ్రతాన్ని ఆచరించే దంపతులు బెల్లాన్ని ఉప్పుని ఆరోజు దానం చేయాలి. మాఘమాస తదియనాడు వ్రతాన్ని చేసేవారు శివుడి ప్రీతి కోసం లడ్డూలు, జలం దానం చేయాలి. వైశాఖ తదియ రోజు వ్రతాన్ని ఆచరించేవారు చందనం కలిపిన నీటిని, లడ్డూల్ని దానం చేస్తే బ్రహ్మదేవుడు సంతోషిస్తాడు. ఈవైశాఖ తదియనే అక్షయతదియ లేక అక్షయతృతీయా అంటారు. ఈ తిథి ఎంతో దివ్యమైనది. ఈ తిథినాడు అన్నదానం చేస్తే అక్షయ ఫలాలు దాతకి లభిస్తాయి. ఈ రోజు ఏ వస్తువు దానం చేస్తే ఆ వస్తువు దాత దగ్గర స్థిరంగా నిలిచిపోతుంది.

మహామహిమాన్వితమైన ఈ గౌరీతృతీయా వ్రతాన్ని అన్ని వర్ణాల వారూ ఆచరించవచ్చు. శ్రద్ధా భక్తులతో ఈ వ్రతాన్ని ఆచరించేవారు వ్రత సమయంలోనేకాక వీలైన సమయాల్లో ఉప్పుని వర్జిస్తే మంచిది. అలా చేసిన వారికి అంత్యకాలంలో సూర్యలోకం ప్రాప్తిస్తుంది.

## గణేశ చతుర్థీ వ్రతం

**వ్రతవిధానం :**

గణేషుడికి ప్రీతిపాత్రమైన తిథి చతుర్థి లేదా చవితి. ఈ చవితి తిథినాడు ఉపవాసం వుండాలి. ఆ రోజు బ్రాహ్మణుడికి నువ్వులు దానం చేసిన తరువాత మాత్రమే వ్రతం చేసేవాడు నువ్వులు కలిపిన (కొంచెం) ఆహారాన్ని భుజించాలి. ఈ విధంగా రెండు సంవత్సరాలు చేస్తే విఘ్నేశ్వరుడు కోరిన కోరికలు తీరుస్తాడు. రెండు సంవత్సరాలు ప్రతినెలా చవితినాడు క్రమం తప్పకుండా ఈ నియమాన్ని పాటిస్తూ వ్రతం చేయాలి.

**వ్రతఫలం :**

శ్రద్ధా భక్తులతో ఈ వ్రతాన్ని ఆచరించిన వారికి జీవితంలో అన్నిరకాల ఆనందాలు కలుగుతాయి. అపారమై సంపదలు భోగభాగ్యాలు లభిస్తాయి. ఇహపర సుఖాలు రెండూ కలుగుతాయి. తిరిగి ఈ లోకంలో జన్మించినప్పుడు ఏడు జన్మల పాటు సకల సంపదలు కలిగిన క్షత్రియుడుగానే జన్మిస్తారు.

**వ్రతకథ :**

ఒకరోజు కుమారస్వామి లక్షణశాస్త్రాన్ని రచిస్తూ అందులో భాగమైన పురుషుల, స్త్రీల లక్షణాల గురించి వ్రాస్తున్నాడు. ఆ సమయంలో గణేశుడు అక్కడికి వచ్చి ఆయన పనికి విఘ్నం కలిగించాడు. దానితో చాలాకోపం వచ్చింది కుమారస్వామికి. వెంటనే గణపతి రెండు దంతాల్లో ఒకదాన్ని పీకి దానితోనే గణపతిని పొడవబోయాడు. ఆ విషయం శంకరుడికి తెలిసింది హుటా హుటిన అక్కడికి వచ్చి వారిద్దర్నీ వారించి అసలు కారణం ఏమిటి? అని ప్రశ్నించాడు.

కుమారస్వామి శివుడితో "తండ్రీ! నేను లక్షణ శాస్త్రం రాస్తున్న విషయం మీకు తెలుసు కదా! ఈ రోజు పురుషులు స్త్రీల లక్షణాలు అనే అధ్యాయాల్ని రాద్దామనుకుని కూర్చున్నాను. పురుష లక్షణాలు చెప్పిన అధ్యాయం పూర్తయ్యింది. స్త్రీ లక్షణాలు తెలిపే అధ్యాయాన్ని ప్రారంభించేంతలో ఇదిగో ఈ గణపతి వచ్చి నాకు విఘ్నం కలిగించాడు. అందుకే నాకు కోపం వచ్చి తిరగబడ్డాను" అన్నాడు.

కుమారుడి మాటలు విన్న శంకరుడు ఆసక్తితో కుమారా! నీవు పురుషుల లక్షణాలు రచించానన్నావు కదా! ఏదీ నన్ను చూసి నాలో నీకు ఏ లక్షణాలు కనిపిస్తున్నాయో చెప్పు" అని అడిగాడు. వెంటనే కుమారస్వామి శివుణ్ణి ఎగాదిగా చూసి "తండ్రీ! మీ లక్షణాలని బట్టి కాలక్రమంలో అన్ని లోకాలూ మిమ్మల్ని 'కపాలి' అని పిలుస్తాయి" అన్నాడు.

కుమారుడి మాటలు విన్న శివుడికి కోపం వచ్చింది. వెంటనే అతడు రాస్తున్న లక్షణ శాస్త్రాన్ని తీసుకుని సముద్రంలోకి విసిరేశాడు. అదిచూసి కార్తికేయుడు ఎంతో బాధపడి శివుణ్ణి ప్రార్థించాడు. కుమారుడి ప్రార్థనకి కరిగిపోయిన శంకరుడు సముద్రుణ్ణి పిలిచి కార్తికేయుడు రాసిన గ్రంథాన్ని సముద్రుడి పేరుతోనే ప్రాచుర్యంలోకి తెమ్మని ఆదేశించాడు. ఆ విధంగా కుమారస్వామి రచించిన లక్షణ శాస్త్రం సముద్రుడి పేరుమీదుగా కాలక్రమంలో

'సాముద్రిక' శాస్త్రంగా ప్రఖ్యాతి గాంచింది. తరువాత శివుడు స్త్రీలకి సంబంధించిన అలంకారలక్షణాలు, వారి విలక్షణాలు తెలియచేస్తూ మరో గ్రంథాన్ని రచించమని కుమారుణ్ణి ఆదేశించి గణపతి దంతాన్ని తిరిగి ఇచ్చేయమన్నాడు.

తండ్రి కోరికని మన్నించిన కుమారస్వామి! తండ్రీ! నేనీ దంతాన్ని గణపతికి ఇచ్చేస్తాను. అయితే ఈ దంతాన్ని అతడు ఎప్పుడూ ధరించేవుండాలి. ఒకవేళ దాన్ని ఎక్కడైనా పెట్టి తిరగటానికి వెళ్తే ఆ దంతం అతన్ని భస్మం చేస్తుంది."అని చెప్పి తాను ఊడబీకిన దంతాన్ని తిరిగి గణపతికి ఇచ్చేశాడు.

అందుకే కొన్ని వినాయక ప్రతిమల్ని చూస్తే అందులో వినాయకుడి చేయి దంతానికి ఆన్చినట్టు కనిపిస్తుంది. ఇది పరమరహస్యమైనకథ. కేవలం చవితినాడే దీన్ని నాలుగువర్ణాలవారికీ చెప్పవచ్చు. అసలు ఈ కథని చెప్పటమే ఒక వ్రతం. ఈ దివ్యవ్రతాన్ని ఆచరించినవారికి జీవితంలో విఘ్నాలు అన్నవే ఎదురవ్వవు.

## బ్రహ్మ చెప్పిన పురుషుల శుభాశుభ లక్షణాలు

పూర్వం కార్తికేయస్వామి ఒకనాడు ఆగ్రహంతో క్రౌంచపర్వత శిఖరాన్ని ముక్కలు ముక్కలు చేసాడు. ఆ సమయంలో బ్రహ్మదేవుడు ఆయనకి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అప్పుడు కార్తికేయుడు "పితామహా!పూర్వం నేను రచించిన లక్షణశాస్త్రాన్ని నాతండ్రి రచించాలనుకుంటే నేను చేసిన సిద్ధాంతాలేవీ నాకిప్పుడు గుర్తుకు రావటం లేదు. దయచేసి నాకీ విషయాలన్నిటినీ బోధించు" అని  కోరుకున్నాడు.

కార్తికేయుడి కోరికని మన్నించిన బ్రహ్మ అతడితో సాముద్రిక శాస్త్రంలో వున్న అన్ని లక్షణాలనీ ఇలా చెప్పటం ప్రారంభించాడు. కార్తికేయా! స్త్రీ పురుషుల లక్షణాలని 1. ఉత్తమ 2. మధ్యమ 3. అధమ అని మూడు రకాలుగా చెప్పవచ్చు. ముందుగా పురుషుల లక్షణాలు ప్రధానమైనవి చెబుతున్నా విను.

పురుషులలో నూట ఎనిమిది అంగుళాలు ఎత్తు ఉన్నవాడు ఉత్తముడు. వంద అంగుళాల ఎత్తున్నవాడు మధ్యముడు. తొంభై అంగుళాల ఎత్తున్న పురుషుడు అధముడు. మొదట పురుషుడు ఆయుర్దాయాన్ని పరిశీలించి ఆ తరువాత అతడి లక్షణాలని బట్టి ఫలితాలు చెప్పాలి. శరీరావయవాల లక్షణాలు బట్టి ఫలితాలుంటాయి.

ఎవరి పాదాలైతే కోమలంగా, స్నిగ్ధంగా, మంచి కండపుష్టితో వుంటాయో! అతడు రాజరికం అనుభవిస్తాడు. అరికాలిలో అంకుశం గుర్తువున్నవాడు సుఖభోగాలనుభవిస్తాడు. పచ్చని పాదాలున్న వాడు తిరుగుబోతుగా వుంటాడు. నల్లని పాదాలున్నవాడు మద్యపాన ప్రియుడు, తెల్లటి పాదాలున్నవాడు భోజన ప్రియుడు అవుతారు. కాలి చూపుడు వేలు బొటన వేలుకన్నా పొడవుగా వున్న వాడికి స్త్రీ సుఖం లభిస్తుంది. కాలిచిటికినవేలు కాస్త ఎక్కువగా వున్నవాడికి స్వర్గప్రాప్తి కలుగుతుంది. గోళ్ళు బాగా పొడైన వాడికి శీలం వుండదు.

తొడలమీద దట్టంగా రోమాలు వుంటే ధనం నిలవదు. తొడలు చిన్నవిగా సన్నగా వుంటే ఐశ్వర్యం లభిస్తుంది. అయితే అది బంధించబడి వుంటుంది. లేడితో సమానంగా వుండే కాలిపిక్కలు రాజ్యాన్ని సంపాదిస్తాయి. పులిలేదా సింహం తొడలాంటి తొడలున్నవాడికి ధనం లభిస్తుంది. మోకాళ్ళు కాస్త కిందగా వున్నవారు స్త్రీలని వశం చేసుకోగలరు. మోకాలులో మాంసం లేకపోతే వారికి పరదేశంలో మరణం సంభవిస్తుంది.

కమలం రంగులో రక్తవర్ణం కలిగినవాడు ఐశ్వర్యవంతుడవుతాడు. ఎరుపు నలుపు కలగలిసిన వర్ణంతో రక్తం వున్నవాడు పాపకర్మలు చేసేవాడవుతాడు. పగడం రంగులో ఎర్రగా మెరిసే రక్తం వున్నవాడు సప్త ద్వీపాలకి అధిపతి అవుతాడు. విశాలంగా ఎత్తుగా రోమాలతో కూడిన వక్షఃస్థలం ఉన్నవాడు వంద సంవత్సరాలు జీవిస్తాడు. ధనవంతుడై సకల సుఖభోగాలూ అనుభవిస్తాడు.

**హస్తరేఖలు - చిహ్నాలు :**

అరచేతిలో మీనరేఖ వున్నవాడు గొప్పకార్యసాధకుడు, ధనవంతుడు, పుత్రవంతుడు అవుతాడు. అరచేతిలో 'వేది' చిహ్నం ఉన్నవాడు వ్యాపారంలో లాభాల్ని అర్జిస్తాడు. సోమలతా చిహ్నం వుంటే యజ్ఞయాగాలు చేస్తాడు. పర్వతం, వృక్షం లాంటి చిహ్నాలు వుంటే లక్ష్మి స్థిరంగా వుంటుంది. శూలం, బరిసె, బాణం, తోమరం, ఖడ్గం, ధనుస్సు వంటి చిహ్నాలు అరచేతిలో వున్న పురుషుడు యుద్ధాలలో విజయం సాధిస్తాడు. ధ్వజం, శంఖం లాంటి గుర్తులు వుంటే సముద్ర ఆకాశయానాల ద్వారా ధనప్రాప్తి కలుగుతుంది. శ్రీవత్సం, కమలం, వజ్రం, రథం లేదా కలశం గుర్తులు చేతిలోవున్న పురుషుడు శత్రువులు లేని రాజవుతాడు. కుడిచేతి బొటనవేలిలో యవధాన్యం గుర్తు వున్నవాడు అన్ని విద్యల్లో నిష్ణాతుడవుతాడు.

చిటికెనవేలి క్రిందనుంచి చూపుడువేలు మధ్య దాకా ఆగకుండా ప్రయాణించేరేఖ ఉన్నవాడు వందేళ్ళు జీవిస్తాడు. విశాలంగా వెడల్పుగా గుండ్రంగా బొడ్డు వున్న వాడికి ధనధాన్యాది సకల సుఖభోగాలూ లభిస్తాయి. పొట్టలో రెండు మడతలున్న వాడు స్త్రీ భోగి. మూడు మడతలున్న వాడు రాజు లేదా ఆచార్యుడవుతాడు. నాలుగున్నవాడికి అధిక సంతానం.

భుజాలు గట్టిగా పుష్టిగా, సమానంగా వున్న పురుషుడు రాజు పదవి పొందుతాడు. ఎగుడుదిగుడుగా దట్టమైన రోమాలతో వక్షఃస్థలం శూరుడిలక్షణం. ఎవరి గడ్డం వంకరగా వుంటుందో వాడి దగ్గర ధనం వుండదు. బలంగా లేకుండా అణిగినట్టు కనిపించే మెడ ధనహీనుణ్ణి సూచిస్తుంది. మెడసమానంగా నిటారుగా వుండటం రాజలక్షణం. మెడ చిన్నగా వున్నవాడు ధనవంతుడు, భోగి అవుతాడు.

ఏపురుషుడైనా భుజాలు పైకి లాగినట్టు కనపడితే అతడు కష్టాల్లో చిక్కుకుంటారు. చిన్న భుజాలున్నవాడు ఇతరులకి దాసుడుగా వుంటాడు. భుజాలు జారినట్టు వుండేవాడు చోరుడు. చేతిపైన గోతుల్లాంటివి వుంటే పిత్రార్జితం లభించదు. చేతి పైభాగం బాగా గరుకుగా వుంటే ధనహీనుడౌతాడు.

ఏ పురుషుడైనా చంద్రబింబంలాంటి ముఖం కలిగివుంటే వాడు ధర్మాత్ముడవుతాడు. తొండం ఆకారంతో ముఖం వుంటే భాగ్యహీనుడు, వంకరగా అతికినట్టుగా ముఖం ఉన్నవాడు చోరుడు. అవుతాడు. కమలంలా కోమలంగా చెక్కిళ్ళు వున్న పురుషుడు గొప్ప కీర్తి ప్రతిష్ఠల్ని పొందుతాడు. పురుషుడి క్రింది పెదవి సహజంగా ఎర్రగా వుంటే పాలకుడవుతాడు. దిబ్బలాగా ఎండినట్టుగా పెదాలువుంటే అతడు నిత్యం కష్టాలు, బాధలు పడుతుంటాడు.

చెవుల్లో సరిగ్గా మాంసం లేకుండా శుష్కించినట్టున్నవాడు యుద్ధరంగంలో మరణిస్తాడు. మల్లెమొగ్గలాంటి పలువరుసవున్నవాడు రాజుకాగలడు. ఏనుగు దంతం రంగులో మృదువుగా పలువరుస వున్నవాడు గుణవంతుడు. నాలుక చిన్నదైతే ఆ పురుషుడు విద్వాంసుడౌతాడు. కరకుగా, మోటుగా, మందంగా నాలుక వుంటే చెడ్డ గుణాలు వుంటాయి. నల్లని నాలుక వున్నవాడు వంశానికి తలవంపులు తెస్తాడు. మేఘ గర్జన లాంటి కంఠస్వరమున్న వాడు ధన్యుడు. దానిమ్మపూల లాంటి కళ్ళు కలిగిన వాడు రాజు కాగలడు. పులికన్ను లాంటి కళ్ళు వున్నవాడు ముక్కోపి. తేనెరంగు, పింగళవర్ణం కలిసిన రంగులో కళ్ళు కలిగినవాడిని లక్ష్మీదేవి విడిచిపెట్టదు. నుదురు అర్ధచంద్రాకారంలో వున్నవాడికి రాజయోగం వుంటుంది. పెద్ద నుదురు ధనాన్ని సూచిస్తుంది. ధర్మాత్ములకి చిన్న నుదురు వుంటుంది.

నుదిటి మధ్యలో వరుసగా ఐదు అడ్డరేఖలున్నవాడు వందేళ్ళు ఐశ్వర్యంతో హాయిగా జీవిస్తారు. మూడు అడ్డరేఖలుంటే డెభ్బై సంవత్సరాలు, నాలుగువుంటే ఎనభై సంవత్సరాలు, రెండు రేఖలు వుంటే అరవై సంవత్సరాలు, ఒకరేఖే వుంటే నలభై సంవత్సరాలు జీవిస్తారు. నుదిటి మీద ఏ రేఖాలేనివాడు ఆయుర్దాయం పాతిక సంవత్సరాలే. నుదుటి మీద త్రిశూలంలాంటి చిహ్నం వుంటే గొప్ప కీర్తివంతుడైన రాజుకాగలడు. తలగోళాకారంలో వుండి సమానంగా వెడల్పు పొడవులతో వుంటే ఆ పురుషుడు సుఖవంతుడవుతాడు. ఏనుగు తలలాంటి ఆకారంలో తలవున్నవాడు రాజుతో సమానుడు. ఈ విధంగా పురుషులకు సంబంధించిన లక్షణాలు వాటి ఫలితాలు వుంటాయి.

# విశేష వినాయక పూజ

గకారాక్షర స్వరూపుడైన విఘ్నేశ్వరుడి పూజకి ప్రత్యేకంగా తిథి, నక్షత్రం ఉపవాస విధులు ఆచరించక్కర్లేదు. ఎప్పుడు అవకాశం వుంటే అప్పుడు చేసుకోవచ్చు. ఈ గణపతి విగ్రహాన్ని బట్టి ఫలితాలు మారుతుంటాయి. వివిధరకాల పదార్థాలతో గణపతి ప్రతిమల్ని చేయించవచ్చు. అయితే ఒక్కోరకమైన ప్రతిమని ఒక్కోవిధంగా పూజించాలి.

**శ్వేతార్కగణపతి (తెల్లజిల్లేడు) :**

గణపతికి చాలా ఇష్టమైన వృక్షం తెల్లజిల్లేడు. అందుకే తెల్లజిల్లేడు వేరుని తెచ్చిదానితో బొటనవేలికణపు పరిమాణంలో ఒక గణపతి విగ్రహాన్ని చెక్కించాలి. ఆ విగ్రహం ఎలా వుండాలంటే పద్మాసనంలో కూర్చుని నాలుగు భుజాలతో, మూడు కళ్ళతో, ఆభరణాలు, సర్పయజ్ఞోపవీతం, తలమీద చంద్రరేఖ, ఎడమచేతిలో దంతం, కుడిచేతిలో జపమాల, మూడో చేతిలో గొడ్డలి, నాలుగో చేతిలో ఉండ్రాయిని ధరించినట్టుగా చెక్కించాలి.

**పూజావిధి :**

ఈ విధంగా చెక్కించిన గణపతి ప్రతిమని యధావిథిగా స్థాపించి సమాలంభం (అనగా కుంకుమచందనం కలిపిన పొడి) తో, వస్త్ర భూషణాలు సమర్పించి, ఎర్రని పూలతో గణపతిని పూజించాలి. తరువాత సుగంధభరిత ధూపాన్ని సమర్పించి, ఉండాళ్ళు నైవేద్యం పెట్టాలి. ఈ పూజ చేయటానికి ముందు విప్రుడికి భోజనం పెట్టాలి. ఆ బ్రహ్మణుడు పొట్టిగా మరుగుజ్జువాడుగా వుండాలి. అలాంటి విప్రుణ్ణి పూజించి అతడి ఆశీర్వచనాన్ని తీసుకోవాలి.

**పూజామంత్రాలు :** శ్వేతార్క గణపతికి ఈ క్రింది మంత్రాలతో పూజచేయాలి.

**గణపతి మూలమంత్రం – ఓం గం స్వాహా**

ఓం గం నమః హృదయాయ నమః। ఓం గీం శిరసేస్వాహా । ఓం గూం శిఖాయై వషట్ । ఓం గైం కవచాయహుం। ఓం గౌం నేత్ర త్రయాయై వషట్। ఓం గః అస్త్రాయ ఫట్ । అని హృదయన్యాసం చేయాలి.

ఓం ఆ గఛ ఉల్కాయ స్వాహా అని గణపతిని ఆహ్వానించాలి.

ఓం గం గణేశాయనమః అని గంధాన్ని సమర్పించాలి

ఓం గం పుష్పోల్కాయనమః అని పుష్పాన్ని సమర్పించాలి

ఓం గం ధూపోల్కాయ నమః అని ధూపాన్ని సమర్పించాలి

ఓం గం దీపోల్కాయ నమః అని దీపాన్ని సమర్పించాలి

ఓం గం మహోల్కాయ నమః అని బలి (నైవేద్యం) సమర్పించాలి

ఓం సంసిద్ధోల్కాయ నమః అని గణపతికి ఉద్వాసన చెప్పాలి.

**హోమవిధి :**

ఈవిధంగా శ్వేతార్కగణపతిని పూజించిన తరువాత ఈ క్రింది విధంగా మంత్రాలు చెబుతూహోమం చెయ్యాలి. ముందుగా హోమకుండాల్ని ఏర్పాటుచేసుకుని అందులో తూర్పు దిశలో "ఓం మహాకర్ణాయవిద్మహే వక్రతుండాయ ధీమహితన్నో దంతిః ప్రచోదయాత్ స్వాహా" అనే మంత్రాన్ని పఠించి ఆహుతిని సమర్పించాలి. 'ఓం మహాగణపతయే స్వాహా' అని పఠిస్తూ దక్షిణ దిశలో 'ఓం మహోల్కాయ స్వాహా' అని పడమర దిశలో, 'ఓం కుశ్మాండాయ స్వాహా' అని ఉత్తర దిశలో 'ఓం ఏకదంత త్రిపురాయ స్వాహా' అని ఆగ్నేయ దిశలో, ఓం "శివదత్త వికటహర హాస ప్రాణాయ స్వాహా' అని చెబుతూ నైరృతి దిక్కులో, "ఓం తులంబనాత్యచల దంతకాయ స్వాహా' అని వాయవ్య దిక్కున, ఓం పద్మ దంష్ట్రాయవరాయ స్వాహా అని ఈశాన్య దిశలో, హోమం చేయాలి.

**జపం, హోమ- ఫలితాలు :**

1.పై తెలిపిన శ్వేతార్క గణపతి హోమాన్ని నువ్వులతో ఎనిమిదివేల సార్లు చేస్తే మూడు రాత్రుల్లో రాజు వశమవుతాడు. 2.తిలలు, యవలు కలిపి హోమం చేస్తే జానపదులంతా వశ్యమవుతారు. సకలజన వశీకరణ శక్తి లభిస్తుంది. 3. సెనగలు బియ్యంతో హోమం చేస్తే దుర్జయుడవుతాడు.

4.వివిధ రకాల నూనెలతో హోమం చేస్తే విద్వేషణ ఫలిస్తుంది. 5. చంద్రగ్రహణ సమయంలో మూలమంత్రాన్ని నీళ్ళలో నిలబడి చేస్త యుద్ధంలో విజయం లభిస్తుంది. 6. సూర్యగ్రహణం నాడు సూర్యుడికి అభిముఖంగా నిలబడి ఎనిమిదివేలు జపం చేస్తే సూర్యానుగ్రహం కలుగుతుంది. 7.శుక్ల పక్షచతుర్థిరోజు ఉపవాసం వుండి గణపతిని పూజించి నువ్వులు బియ్యంతో హోమం చేయాలి. తరువాత హోమ భస్మాన్ని నుదుట ధరించాలి. అలా చేస్తే శత్రుపరాజయం కలుగుతుంది.

'ఓం గం స్వాహా' అనే ఈ గణపతి మూలమంత్రం తక్కువసంఖ్యలో (కనీసం 40 వేలు లేదా 4 వేలు) జపించినా సిద్ధిస్తుంది. ముందుగా ఈ మంత్రాన్ని పై తెలిపిన సంఖ్యలో జపించి ఆ తరువాత హోమం చేసేడప్పుడు 1.ఓం వక్రతుండాయస్వాహా 2.ఓం ఏకదంష్ట్రాయ స్వాహా 3.ఓం కృత కృష్ణాయ స్వాహా 4.ఓం గజకర్ణాయ స్వాహా 5.ఓం లంబోదరాయ స్వాహా 6.ఓం వికటాయ స్వాహా 7.ఓం ధూమ్ర వర్ణాయ స్వాహా 8. ఓం గగనకూజాయ స్వాహా 9.ఓం వినాయకాయ స్వాహా 10.ఓం గణపతయే స్వాహా 11.ఓం హస్తిముఖాయ స్వాహా అనే పదకొండు మంత్రాలతో ఆహుతుల్ని సమర్పించాలి. ఈ విధంగా శ్రద్ధా భక్తులతో గణపతి పూజని, జప హోమాల్ని నిర్వర్తించిన వాడికి అసాధ్యమైన కార్యమేదీ వుండదు. ఈ పూజని అన్ని వర్ణాల వారూ ఆచరించవచ్చు.

## వివిధ రకాల గణపతి ప్రతిమలు

**1. వేపకర్ర గణపతి :** వేప చెట్టు కర్రని తెచ్చి దానితో బొటనవేలి కణుపు పరిమాణంలో వినాయక ప్రతిమని చేయించి నిత్యం ధూపదీపనైవేద్యాలతో పూజిస్తే అందరికీ ప్రియమైనవాడవుతాడు.

**2. తెల్లజిల్లేడు వేరు :** తెల్లజిల్లేడు వేరుని తెచ్చి బొటనవేలంత కణుపు పరిమాణంలో ప్రతిమని చేయించి ధూపదీప నైవేద్యాలు సమర్పిస్తే అన్ని వర్ణాల వారూ వశమవుతారు.

**3. తెల్లచందనం గణపతి :** తెల్లచందనం కర్రతో గణపతి ప్రతిమని బొటనవేలుకణుపు పరిమాణంలో చేయించి, గంధపుష్పాలతో పూజించాలి. శుక్ల పక్ష చతుర్థినాడు ఎనిమిదివేల సార్లు మూలమంత్రం జపిస్తూ పెరుగు పాయసంతో హోమం చేయాలి. అలా చేస్తే రాజు వశమవుతాడు.

**4. ఎర్రచందనం గణపతి :** గణపతి ప్రతిమని బొటనవేలు కణుపు పరిమాణంలో ఎర్రచందనం కర్రతో చేయించి, భూత బలిని సమర్పించి తేనె, పెరుగు, నెయ్యి ద్రవ్యాలతో మూలమంత్రాన్ని పఠిస్తూ ఎనిమిదివేల సార్లు హోమం చేయాలి. ఇలా చేస్తే కోరినవారు వశమవుతారు.

**5. ఎర్రగన్నేరు వేరు గణపతి :** గణపతి ప్రతిమని ఎర్రగన్నేరు వేరుతో శాస్త్రోక్తంగా చేయించాలి. తరువాత ఆ ప్రతిమని ఎర్రగన్నేరు పూలతో గంధంతో పూజించి, నువ్వులు, ఉప్పు నేయితో ఎనిమిదివేల ఆహుతుల్ని సమర్పించాలి. అలా చేసినవాడికి పది ఊర్లు వశమవుతాయి.

**6. జిల్లేడు వేరు గణపతి :** గణపతి ప్రతిమని బొటనవేలు కణుపు పరిమాణంలో మామూలు జిల్లేడు వేరుతో విధివిధానంగా చేయించి, గంధ పుష్పధూప దీపనైవేద్యాల్ని సమర్పించి, తుమ్మి సమిథలతో వంద ఆహుతులు సమర్పిస్తే శత్రువులు వశమైపోతారు.

**7. మారేడు వేరు గణపతి :** బొటనవేలి కణుపు పరిమాణంలో మారేడు వేరుతో గణపతిని చేయించి గంధపుష్పధూపాదులు సమర్పించాలి. తరువాత త్రిమధువులతో (పాలు, తేనె, చక్కెర) ఎనిమిది వేల ఆహుతుల్ని సమర్పిస్తే రాజులు, మంత్రులు వశమవుతారు.

ఇదేవిధంగా ఏనుగుదంతంతో గణపతిని చేయించి పూజచేసి మంత్రజపంచేస్తే (రోజూ ఏడుసార్లు) స్త్రీలందరిచేతా ఆకర్షించబడతాడు. ★ఎద్దుకొమ్ముతో విగ్రహం చేయించి ధూపదీపాదికాలు సమర్పించి గుగ్గిలంతో ధూపాన్ని వేస్తే గోకులంవారంతా వశమవుతారు. ★పుట్టమన్నుతో గణపతి ప్రతిమని చేయించి శాస్త్రోక్తంగా పూజించి ఆ ప్రతిమకి శొంఠి, పిప్పళ్ళు,

మిరియాలు నూనెని లేదా పొడిని రాయాలి. తరువాత ఉమ్మెత్త సమిధలతో అగ్నిని రగిల్చి నువ్వులు ఆవాల మిశ్రమంతో ఎనిమిదివేల సార్లు మూలమంత్రంతో హోమంచేయాలి. ఈ విధంగా చేస్తే రాజ వశ్యం సకలజన వశీకరణం జరుగుతుంది.

పై తెలిపిన వివిధ రకాల గణపతి ప్రతిమలకి చేసేపూజ, హోమాలతో "ఓం గణపతయే వక్రతుండాయ గజదంతాయ గులగులేతి వినాదాయ చతుర్భుజాయ త్రినేత్రాయ ముసలపాశ వజ్రహస్తాయ సర్వభూతదమనాయ, సర్వలోకవశంకరాయ సర్వదుష్టోపఘాత జననాయ సర్వశత్రువిమర్దనాయ సర్వరాజ్య సమీహనాయ రాజానమిహవశమానయ హన హన పచ పచ వజ్రాంకుశేన గణేశ ఫట్ స్వాహా" ఓం గాం గీం గూం గైం గౌం గః స్వాహా నమః। అనే మూల మంత్రాన్ని వినియోగించాలి.

## గణేశ ప్రీతికర చతుర్థీ తిథులు

గణనాయకుడైన వినాయకుడికి ప్రీతిపాత్రమైన తిథిచతుర్థి. సంవత్సరం మొత్తం మీద అన్ని మాసాల్లో వచ్చే చతుర్థి తిథుల్లో ప్రత్యేకమైన చతుర్థి తిథులు మూడు. అవి 1.శివా 2.శాంతా 3.సుఖా అని

**1. శివా :**

భాద్రపద శుక్ల చవితినే 'శివా' తిథి అంటారు. ఆ రోజు స్నానం ఉపవాసం, జపం, దానం చేసే వాడికి గణపతి అనుగ్రహం శీఘ్రంగా లభిస్తుంది. ఈపవిత్ర తిథినాడు బెల్లం, ఉప్పు, నెయ్యి దానం చేస్తే మంచిది. అలాగే బెల్లంతో తయారు చేసిన పిండి వంటకాలతో విప్రులకి అన్నదానం చేస్తే చాలా మంచిది. బెల్లం ఉప్పు వివిధ రకాల పిండివంటలతో స్త్రీలు గణపతిని పూజిస్తే అత్తమామల ఆదరణ చూరగొంటారు. కన్యలు ఈ రోజు గణపతిని పూజిస్తే ఉత్తముడైన భర్త లభిస్తాడు.

**2. శాంత :**

మాఘమాసంలో వచ్చే శుక్ల పక్షచతుర్థిని శాంత అంటారు. ఆ రోజు పుణ్యనదీ స్నానం చేసి వినాయకుణ్ణి శ్రద్ధా భక్తులతో పూజించిన వారికి

సుఖశాంతులు సమృద్ధిగా లభిస్తాయి. ఆ రోజు ఉపవాసం ఉండి గణపతి హోమం చేస్తే చాలామంచిది. ఉప్పు, బెల్లంతో చేసిన పిండివంటలు, ఆకుకూరలు, కూరలు యోగ్యుడైన విప్రుడికి దానం చేస్తే అధికమైన పుణ్యం లభిస్తుంది. ముఖ్యంగా స్త్రీలు ఆ తిథి రోజు బెల్లం, ఉప్పు, నెయ్యిని దానం చేసి గురువుల్ని లేదా పెద్దల్ని పూజిస్తే సకల సౌభాగ్యాలూ వారికి కలుగుతాయి.

**3. సుఖా :**

ఇది పేరుకి తగ్గట్టే సుఖాల్ని ప్రసాదిస్తుంది. ఏ మాసంలోనైనా చతుర్థీతిథి మంగళవారం కలిసి ఒకేరోజు వస్తే ఆతిథిని అంగారక చతుర్థి లేక 'సుఖా' 'సుఖదా' అంటారు. ఆ రోజు గణపతికి అత్యంత ప్రీతికరమైనరోజు. సుఖదాతిథినాడు పార్వతీ పరమేశ్వరుల నుంచి భూమి మీదకి జారిపడ్డ రక్తబిందువు నుంచి కుజుడు జన్మించాడు. భూ దేవికి జన్మించిన ఆ కుజుడు ఎర్రని రంగుతో ప్రకాశిస్తుంటాడు. కుజుడు మానవులకు అంగవైకల్యం కలగకుండా కాపాడతాడు. అందరికీ సౌభాగ్యాల్ని ప్రసాదిస్తాడు. కనుకనే ఇతన్ని అంగారకుడని కూడా వ్యవహరిస్తారు.

ఈ అంగారక చతుర్థి (సుఖదా) తిథి నాడు శ్రద్ధా భక్తులతో రాత్రిపూట ఉపవాసం చేసి ఎర్రని పూలతో, ఎర్రని కుంకుమతో కుజుణ్ణి పూజించాలి. తరువాత వినాయకుణ్ణి ధూపదీప నైవేద్యాదులతో యధాశక్తి అర్చించాలి. తరువాత విప్రులకి బెల్లాన్ని దానం చేయాలి. అవకాశం వున్నవారు అన్న సంతర్పణ చేస్తే మంచిది. ఈ సుఖాదాతిథినాడు అంగారకుణ్ణి, వినాయకుణ్ణి కలిపి పూజచేయాలి. అలా చేస్తేనే శుభఫలితాలు కలుగుతాయి.

## అంగారక (కుజ) చతుర్థీ వ్రతం

మంగళవారం చతుర్థీవున్న రోజున ఈ వ్రతాన్ని ఆచరించాలి. ఈ వ్రతంలో కుజ-వినాయకుల్ని కలిపి పూజించటం విశేషం. ఈ చతుర్థితిథినాడు ఉదయం ఉపవాసం వుండి బంగారం లేక రాగితో కుజ-వినాయక ప్రతిమల్ని స్థాపించాలి. నూతన వస్త్రాలతో అలంకరించి ధూపదీప నైవేద్యాదులతో ఆ మూర్తుల్ని భక్తితో అర్చించాలి.

**వ్రతవిధానం :**

అంగారక చతుర్థీ వ్రతాన్ని ఆచరించేవాడు ఉదయాన్నే నది లేక చెరువు దగ్గరకి వెళ్ళాలి. అక్కడ నేలమీదున్న మట్టిని కొంత తీసుకుని -

ఇహత్వం వందితాపూర్వం కృష్ణేనోద్ధారతాకిల ।
తస్మాన్మే దహ పాప్మానం యన్మయా పూర్వసంచితమ్ ॥

*(శ్లో-24, అధ్యా-31)*

దానికి నమస్కరించి ఓ మృత్తికా! పూర్వం నీవు శ్రీహరి అవతారుడైన శ్రీకృష్ణుడి చేత ఉద్ధరించబడ్డావట! అటువంటి పవిత్రమైన నీవు నా పాపాలన్నిటినీ దహించి వేయుగాక! అని పలికి ఆ మృత్తికని (మట్టిని) సూర్యుడికి చూపించాలి.

సూర్యరశ్మిచేత ఆ మట్టి ఎంతో పవిత్రమైన దౌతుంది. అపుడా మట్టిమీద నదిలో నీటిని కొంచెం చల్లి ముందుగా తలమీద ఆ తరువాత శరీరావయవాలన్నింటి మీదా రాసుకోవాలి. తరువాత ఈ క్రింద తెలిపిన మంత్రాల్ని పఠిస్తూ-

త్వమాపోయోనిః సర్వేషాం దైత్య దానవద్యౌకసామ్ ।
స్వేదాదండజోద్భి జాం చైవ రసానాంపతయే నమః ॥

*(శ్లో॥ 27 అధ్యా-31)*

ఓ దివ్యోదకాల్లారా! మీదు దేవతలకి, దైత్యులకీ స్వేదజ, అండజ, ఉద్భిజాలకీ, అలాగే సర్వజీవకోటికీ జీవన కారకులు, రసాధిపతులు అయిన మీకు నమస్కారం.

స్నాతోహం సర్వతీర్థేషు సర్వప్రసవణేషు చ ।
తటాకేషుచ సర్వేషు మానసాది సురః సుచ ।
నదీషు దేవ ఖాతేషు సుతీర్థేషు హ్రదేషువై ॥ *(శ్లో॥ 28-30)*

నేను అన్ని పుణ్య తీర్థాల్లో సెలయేర్లలో, చెరువుల్లో, మానసాది సరోవరాల్లో, నదుల్లో, దేవతల పుష్కరిణుల్లో, స్వచ్ఛమైన నీరువున్న మడుగుల్లో స్నానం చేసినవాడినౌతున్నాను. అని ధ్యానించి (ఈ శ్లోకాల్ని పఠించి) నది లేక చెరువులో స్నానం చేయాలి. ఆవిధంగా స్నానం చేసి పవిత్రుడై ఇంటికి వచ్చి ముందుగా దుర్వాదుల్ని (గఱిక, రావిచెట్టు,జమ్మిచెట్టు) తాకాలి.

**గటిక మంత్రం :**

త్వందూర్వేఽ మృత నామాసి సర్వదేవైస్తు వందితా ।
వందితావహ సర్వస్వం దురితర యన్మయాకృతం ॥

**శమీవృక్ష మంత్రం :**

పరిత్రాణాంపవిత్రాత్వం కాశ్యపీ ప్రధితాశ్రుతే ।
శమీశమయమే పాపం నూనంవేత్సిధరాధరాన్ ॥

**అశ్వత్థం(రావి) మంత్రం :**

నేత్ర స్పందాదిజం దుః ఖందుః స్వప్నం దుర్విచింతనం ।
శక్తానాంచ సముద్యోగమశ్వత్థ త్వం క్షమస్వమే ॥

*(శ్లో-31-34 అధ్యా-31)*

గటికని తాకుతూ – 'ఓ దూర్వా! నీవు అమృతస్వరూపానివి. గఅందరు దేవతల చేత నమస్కారాలు అందుకొనేదానివి. అలాంటి పవిత్రమైన నీకు నమస్కరిస్తున్నాను అని నమస్కరించాలి. అలాగే శమీ(జమ్మి) చెట్టుని తాకుతూ –"ఓ శమీ వృక్షమా! నీవు పవిత్రమైన వాటన్నిటికన్నా పవిత్రమైన దానివి. వేదాల్లో 'కాశ్యపీ' అనే పేరుతో ప్రసిద్ధమైన దానివి. అలాంటి నీవు నా పాపాల్ని శమింపచేయి అని నమస్కరించాలి. తరువాత అశ్వత్థ (రావి) చెట్టుని తాకి "ఓ అశ్వత్థ వృక్షమా! నా కళ్ళు అదరటం వల్ల కలగబోయే దుఃఖాన్ని, నాకు వచ్చే చెడ్డకలల్ని, చెడు ఆలోచనల్ని పోగొట్టి నన్ను రక్షించు. నేను చేసే పాపాలన్నిటినీ క్షమించు" అని చెప్పి నమస్కరించాలి.

**గోమంత్రం :**

సర్వదేవమయీా దేవి! మునిభిస్తు సుపూజితా ।
తస్మాత్స్పృశామి వందేత్వాం వందితా పాపహాభవ ॥

"ఓ 'గోదేవీ! నీవు సకలదేవతా స్వరూపిణివి. మునుల చేత పూజించబడ్డ దానివి. అలాంటి పవిత్రమైన నిన్ను స్పృశిస్తున్నాను. నీకు నమస్కరిస్తున్నాను. దయచేసి నా పాపాలన్నిటినీ నాశనం చేయి" అని పఠించి గోమాతకి నమస్కరించి,

మూడుసార్లు ఆ గోవు చుట్టూ ప్రదక్షిణ చేయాలి. అక్కడ నుంచి యాగశాల దగ్గరకి వెళ్లి పాదప్రక్షాళన చేసుకుని ఆచమనం చేసి లోపలికి ప్రవేశించాలి. హోమకుండాన్ని చక్కగా అలంకరించి ఓం శర్వాయ స్వాహా, ఓం శర్వపుత్రాయ స్వాహా, ఓం క్షోణ్యుత్సంగ భవాయ స్వాహా, ఓం కుజాయస్వాహా, ఓం లలితాంగాయస్వాహా, ఓం లోహితాంగాయ స్వాహా అనే మంత్రాన్ని వరుసగా పఠిస్తూ 108 సార్లు గానీ 58 సార్లు గానీ కుజుడికి ఆహుతుల్ని సమర్పించాలి.

ఈవిధంగా కుజగ్రహ హోమాన్ని శక్త్యానుసారం తమ తమ కోరికల్ని అనుసరించి, చంద్ర సమిధలతో, నేయి, పాలు, యవలు, తిలలు, వివిధ రకాలైన భక్ష్యాలు వినియోగించి కుజుడికి ఆహుతుల్ని సమర్పించాలి.

హోమంపూర్తయిన తరువాత బంగారంతో కానీ, వెండితోకానీ దేవదారులేక మరే ఇతర కర్రతో గానీ కుజుడి ప్రతిమని బొటనవేలిలో కణుపు పరిమాణంలో వేయించాలి. ఆ ప్రతిమని ఎర్రని పూలు! ఎర్రని పళ్ళు, ఎర్రని నైవేద్యాలతో యథాశక్తి పూజించాలి. 'అగ్నిర్మూర్థా' అనే మంత్రాన్ని పఠిస్తూ శాస్త్రోక్తంగా కుజుడి పూజచేసి పూజానంతరం పళ్ళెంతో సహా ఆ కుజవిగ్రహాన్ని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి.

దరిద్రుడైన ధనవంతుడైనా తన శక్తికి తగ్గట్టు బెల్లంతో చేసిన పరమాన్నం, పాలు, గోధుమలు, శాలి బియ్యం దానం చేయాలి. ధనం ఉన్నవాడు దానానికి లోభించకూడదు. అలా చేస్తే దోషం.

**వ్రతఫలం :**

ఈవిధంగా నియమ నిష్ఠలతో అంగారక చతుర్థీవ్రతాన్ని సంవత్సరంలో వచ్చే నాలుగు తిథుల్లో ఆచరించినవారికి దివ్యరూపం లభిస్తుంది. సూర్యుడులాంటి తేజస్సు, చంద్రుడు లాంటి కాంతి, వాయువంతటి బలం, సాధకుడికి కలుగుతాయి. మరణానంతరం ఆ సాధకుడు కుజలోకానికి వెళతాడు. అతడికి గణనాయకుడి దివ్యానుగ్రహం కూడా కలుగుతుంది.

**వ్రతనియమం :**

అంగారక చతుర్ధినాడు ఉదయమంతా ఉపవాసం వుండి శక్త్యానుసారం వెండి లేదా బంగారం, రాగితో వినాయక, అంగారక ప్రతిమల్ని చేయించి వాటిని రాగి పాత్రలో స్థాపించి శాస్త్రోక్తంగా పూజించాలి. పూజానంతరం యోగ్యుడైన విప్రుడికి వస్త్రాలు దక్షిణతోపాటు పళ్ళెంతో సహా ఆ రెండు ప్రతిమల్ని దానం చేయాలి. ఇలా చేస్తే అంగారకుడితో పాటు గణపతి ఆశీస్సులు కూడా లభిస్తాయి.

## నాగపంచమీ వ్రతం

పంచమీతిథి నాగదేవతలకి ఎంతో ప్రియమైన రోజు. ఆ రోజు నాగలోకంలో గొప్ప ఉత్సవం జరుగుతుందట. పంచమినాడు నాగులని పూజిస్తే మహాసర్పాలైన 1.వాసుకి 2.తక్షకుడు 3.కాలీయుడు 4.మణిభద్రుడు 5.ఐరావతుడు 6.ధృతరాష్ట్రుడు 7.కర్కోటకుడు 8.ధనుంజయుడు అనే ఎనిమిదీ మానవులందరినీ ఆశీర్వదిస్తాయి. పంచమితిథిరోజు నాగులకి ఎవరైతే క్షీరాభిషేకం చేస్తారో అలా చేసిన వారి వంశంలో ఎవరికీ సర్పభయం వుండదు. పూర్వం సర్పాలన్నీ తమ తల్లి శాపంతో దహించుకుపోసాగాయి. ఆనాటి నుంచీ నేటివరకూ సర్పాలు శాపప్రభావంతో తాపానికి గురౌతూనే వున్నాయి. అలాంటి నాగులకి నీళ్ళు కలిపిన ఆవుపాలతో స్నానం చేయిస్తే వాటి శరీరతాపం తగ్గి తనకి క్షీరాన్ని సమర్పించిన వాడికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదిస్తాయి.

**నాగులకి తల్లిశాపం :**

పూర్వందేవతలు రాక్షసులు కలిసి సాగర మథనం చేయగా అందులోంచి ఉచ్ఛైశ్రవం అనే గుర్రం ఆవిర్భవించింది.ఆ అశ్వం ఎంతో తెల్లగా నిగనిగ లాడుతోంది. ఆ గుర్రాన్ని చూసి ముచ్చటపడ్డ నాగులతల్లి 'కద్రువ' తన సవతి వినతితో "చూసావా చెల్లీ! సముద్రం నుంచి పుట్టిన ఆ అశ్వం ఎంత తెల్లగా ధగ ధగా ప్రకాశిస్తోందో! కానీ ఒక్కటే లోపం. దాని తోక చివర వెంట్రుకలు మాత్రం కొంచెం నల్లగా వున్నాయి అన్నది. ఆమె మాటలు విన్న వినత "అక్కా! లేదు లేదు ఆ గుర్రంతోకతో సహా పూర్తిగా తెల్లగానే వుంది.

నీవేదో భ్రమపడ్డట్టున్నావు అని అంది. వినత మాటలతో కద్రువకి ఒక్కసారిగా రోషం పొడుచుకువచ్చింది. "వినతా నాకు కళ్ళు సరిగ్గా కనిపించలేదను కుంటున్నావా! గుర్రానికి తోక నల్లగానే వుంది. సరే. ఈ విషయం మీద వాదం ఎందుకు. మనిద్దరం పందెం వేసుకుందామా! అని అడిగింది. సరేనన్న వినత "అక్కా! గుర్రంతోక నల్లగా వుంటే నేను నీకు దాసినౌతాను. లేదా నీవు నాకు దాసివి కావాలి. ఇదే పందెం" అన్నది. కద్రువ అంగీకరించింది. ఇద్దరూ తిరిగి మర్నాడు వచ్చి గుర్రాన్ని చూద్దామనుకుని గృహానికి వెళ్ళిపోయారు

ఇంటికి వెళ్ళిందనేగానీ! కద్రువకి ఒక సందేహం కలిగింది. వినత చెప్పిందే నిజమేనేమో! శరీరం మొత్తం తెల్లగావున్న గుర్రానికి కేవలం తోక ఒక్కటే కొంచెం నల్లవెంట్రుకలతో ఎందుకుంటుంది? బహుశా నేనే పొరపాటు పడివుంటాను. అనవసరంగా వినతతో పందెం కాసాను. ఇప్పుడు నేను ఓడిపోతే జీవితాంతం ఆమెకి దాస్యం చేయాలి. అమ్మో! అది జరగకూడదు" అని భావించింది. వెంటనే తన కుమారులైన నాగుల్ని పిలిచి వారితో తమ మధ్య జరిగిన వృత్తాంతాన్నంతా చెప్పి "పుత్రులారా! మీరు వెళ్ళి ఆ ఉచ్చైశ్రవంతోకకి వ్రేలాడండి. అలా చేస్తే నేను నెగ్గుతాను లేకపోతే జీవితాంతం దాసీగా వినతకి సేవలు చేయాలి" అని కోరింది. తల్లి మాటలు విన్న నాగులు "అమ్మా! ఇది అధర్మం ఇందుకు మేమంగీకరించం" అని చెప్పారు. దానితో కద్రువకి కోపం వచ్చింది. "నా మాట వినని మిమ్మల్ని అగ్ని దహించి వేయుగాక! రాబోయేకాలంలో జనమేజయుడనే మహారాజు సర్పయాగం చేస్తాడు. ఆ యాగంలో పడి తీక్షణమైన అగ్నిలో మీరు దహించబడతారు. ఇదే నా శాపం" అని ఆగ్రహంగా వారిని శపించింది.

ఆవిధంగా సొంతతల్లి చేత శపించబడ్డ నాగజాతి ఎంతో బాధపడ సాగింది. వారిలో గొప్పవాడైన వాసుకి తమకి ఇంక దిక్కేది అని బ్రహ్మదేవుణ్ణి ప్రార్థించాడు. బ్రహ్మ వాసుకి దగ్గరకి వచ్చి అతన్ని ఓదార్చి" వాసుకీ! నీవు అంతగా బాధపడవద్దు. యామవార కులంలో జన్మించిన జరత్కారువు అనే

మహర్షి చాలా గొప్పవాడు. మహాతపఃసంపన్నుడు. నీ సోదరి జరత్కారువుని ఆ మహర్షికిచ్చి వివాహం చేయి. వారిద్దరికీ అస్తీకుడనే ప్రభాతపుత్రుడు మహామంత్రవేత్త జన్మిస్తాడు. ఆ పుత్రుడే జనమేజయుడి చేత సర్పయాగాన్ని ఆపించి మీ వంశం వారందరి ప్రాణాల్నీ నిలుపుతాడు"అని ప్రబోధించి వెళ్ళిపోయాడు. బ్రహ్మదేవుడు ఈ అస్తీకుడి జననవిషయాన్ని చెప్పి వాసుకికే కాక నాగలుందరి దుఃఖాన్ని పోగొట్టిన రోజు పంచమీతిథి. అందుకే ఈ తిథి అంటే నాగులకి ప్రియం.

**పాముకాటు ఫలితం :**

పాముకాటుకి గురైన మానవుడు మరణించిన తరువాత సరాసరి పాతాళ లోకానికి చేరుకుంటాడు. అక్కడికి వెళ్ళిన అతడు విషంలేని సర్పంగా మారిపోతాడు. ఈ విధంగా పాముకాటుకి గురైన వాడి అన్నగానీ కూతురు గానీ, తల్లిగానీ, కొడుకుగానీ, తండ్రిగానీ, భార్యగానీ, ఆవిధంగా మరణించిన వాడి ఆత్మ శాంతికోసం నాగపంచమీ వ్రతాన్ని శ్రద్ధగా ఆచరించాలి.

**వ్రతవిధి :**

నాగులకి అత్యంత ప్రీతిపాత్రమైన నాగపంచమినాడు ఉపవాసం వుండాలి. ఇది ప్రధాన నియమం. బాద్రపదమాసం శుక్లపక్షంలో వచ్చే పంచమి తిథినే నాగపంచమి తిథిగా గుర్తించాలి. అది ఎంతో పున్యప్రదమైన తిథి. ఆనాడు వ్రతాన్ని ప్రారంభించి సంవత్సరం పొడవునా ప్రతినెలలో వచ్చే శుక్లపక్ష పంచమీ తిథినాడు ఈ వ్రతాన్ని కొనసాగించాలి. ఈ నాగపంచమి తిథిరోజు పగలంతా ఉపవాసం వుండి రాత్రి భోజనం చేయాలి.

కర్రతోగానీ, మట్టితోగానీ, వెండి, బంగారాలతో గానీ ఐదు నాగ ప్రతిమలని తయారు చేయించి పంచమినాడు శ్రద్ధా భక్తులతో గన్నేరు, తామర, మల్లెపూలతో, గంధాది ఉపచారాలు సమర్పించి, ఆ నాగ ప్రతిమలన్నిటినీ పూజించాలి. ఆ తరువాత నేయి, పాయసం, లడ్డూలతో షడ్రసోపేతంగా విప్రులకి భోజనం పెట్టాలి. ఈ విధంగా పన్నెండు నెలల్లో వచ్చే పంచమి తిథుల్లో వరుసగా

అనంతోవాసుకిః శంఖః పద్మః కంబలఏవచ ।
తథాకర్కోటో నాగో నాగో హ్యాశ్వతరో నృపః ॥
ధార్తరాష్ట్రః శంఖ పాలః కాళియస్తక్షకస్తథా ।
పింగళశ్చ తథానాగో మాసిమాసి ప్రకీర్తితా ॥

*(శ్లో॥ 50–51 అధ్యా–32)*

1.అనంతుడు 2.వాసుకి 3.శంఖుడు 4.పద్మడు 5.కంబలుడు 6.కర్కోటకుడు 7.అశ్వతరుడు 8.ధృతరాష్ట్రుడు 9.శంఖపాలుడు 10.కాళీయుడు 11.తక్షకుడు 12.పింగళుడు అనే నాగ శ్రేష్ఠుల్ని పూజించాలి.

ఒక సంవత్సరం పాటు పంచమీవ్రతాన్ని చేసి సంవత్సరాంతంలో వ్రతాన్ని ముగించి ఆ రోజు యథాశక్తి విప్రులకి అన్న సంతర్పణ చేయాలి. యోగ్యుడైన ఒక బ్రాహ్మణుడిని పిలిచి అతడికి సువర్ణంతో చేసిన నాగపడగని దానం చేయాలి. పంచమీతిథినాడు శాస్త్రోక్తంగా వ్రతాన్ని ఆచరించిన తరువాత నాగుల్ని ఈ విధంగా ప్రార్థించాలి.

కృత్వాభోజనం పూర్వం బ్రాహ్మణానాంతుకామతః ।
విసృజ్యనాగాః ప్రీయంతాం యేకేచిత్పృథివీతలే ॥
యేచ హేలి మరీచిస్థాయేంతనే దివి సంస్థితాః ।
యేనదీఘమహానాగా యే సరస్వతిగామినః ॥
యేచవాపీ తటాకేషు సర్వేషువై నమః *(శ్లో॥33–35 అధ్యా–32)*

"భూమి మీద, సూర్యకిరణాలలో, అంతరిక్షంలో, నదుల్లో, ప్రవాహాల్లో, బావుల్లో, చెరువుల్లో వున్న మహాసర్పాలన్నిటికీ నమస్కారం. ఆ సర్పాలన్నీ నన్ను ప్రసన్నంగా చూచుగాక!"అని నమస్కరించి ముందుగా బ్రాహ్మణులకి భోజనం పెట్టి ఆ తరువాత తన బంధుమిత్ర పరివారంతో కలిపి భుజించాలి.

**వ్రతఫలం :**

శ్రద్ధా భక్తులతో నియమపూర్వకంగా ఈ నాగపంచమీ వ్రతాన్ని వరుసగా సంవత్సరంపాటుచేసిన వ్యక్తికి ఎన్నో శుభఫలితాలు కలుగుతాయి.

1. మరణానంతరం వ్రతం చేసిన వ్యక్తి అప్సరసలతో సహా నాగలోకానికి వెళ్ళి తన కిష్టమైనంత కాలం అక్కడ సురభోగాలు అనుభవిస్తాడు.

2. తరువాత జన్మలో మహారాజుగా జన్మించి వజ్ర వైఢూర్య మణి మాణిక్యాలని ధరించి ఉత్తమ వాహనయోగాన్ని కలిగి వుంటాడు.

3. వ్రతం ఆచరించిన వ్యక్తి ప్రతి ద్వాపరయుగంలో ఐదుసార్లు మాహారాజుగా జన్మిస్తాడు.

ఈ విధంగా నాగపంచమీ వ్రతాన్ని ఆచరిస్తే నాగుల అనుగ్రహంతో వారి వారి వంశంలోని వారికి అందరికీ శుభాలు జరుగుతాయి. ఈ నాగపంచమీ వ్రత వృత్తాంతాన్ని విన్న వారికి, చదివినవారికి బోధించిన వారికి సర్ప భయం ఉండదు.

## సర్ప లక్షణాలు

సర్పలక్షణాల గురించి కశ్యపమహర్షి గౌతమమునికి ఈ విధంగా చెప్పటం ప్రారంభించాడు.

ఆడమగ సర్పాలు జ్యేష్ఠ-ఆషాఢ మాసాల్లో సంగమిస్తాయి. ఆ రెండూ సంగమించిన తరువాత వర్ష ఋతువు నాలుగు నెలలు ఆడపాము గర్భాన్ని ధరిస్తుంది. కార్తీకమాసంలో గ్రుడ్లు పెడుతుంది. ఒక సర్పం సాధారణంగా 240 గ్రుడ్లు పెడుతుంది. అయితే ఆ గ్రుడ్లలో చాలావరకూ అదే ఆహారంగా స్వీకరిస్తుంది. మిగిలిన చివరిగ్రుడ్లనుంచి ముందుగా మగ పాము జన్మిస్తుంది. ఇక మొగలిపూవులా బంగారు రంగులో వుండే గ్రుడ్ల నుంచి ఆడపాము పుడుతుంది. అలాగే దిరిసిన పువ్వు రంగులో వుండే గ్రుడ్ల నుంచి నపుంసక సర్పాలు జన్మిస్తాయి.

గ్రుడ్లు పెట్టిన ఆడపాము ఆరునెలలపాటు వాటిని పొదిగిన తరువాత ఆ గ్రుడ్లనుంచి క్రమంగా పిల్లలు బైటికి వస్తాయి. ఆ పాము పిల్లలు తల్లి పాముతో ఎంతో స్నేహంగా వుంటాయి. అలా ఏడురాత్రులు గడిచాక పిల్ల పాములు నల్లరంగులోకి మారతాయి. సాధారణంగా సర్పాలు 120 సంవత్సరాలు జీవిస్తాయి.

సర్పాలకి మరణం అనేది ఎనిమిది రకాలుగా సంభవిస్తుంది. 1.నెమలి 2.మనిషి 3.చకోరపక్షి 4.ఆవు-గేదెల గిట్టలు 5.పిల్లి 6.ముంగిస 7.పంది 8.తేలు ఇవి సర్పాలు మరణించటానికి కారకాలు. సర్పాలు గనుక ఈ ఎనిమిదింటి నుంచీ తప్పించుకోగలిగితే అవి 120 సంవత్సరాలు జీవిస్తాయి.

సర్పాలకి ఒక వారం తరువాత చిన్నగా కోరలు పుడతాయి. ఆ తరువాత క్రమంగా విషం వాటిలో ఏర్పడుతుంది. అది విషాన్ని విడుదల చేసినకొద్దీ తిరిగి కొత్తగా విషం వచ్చి చేరుతుంటుంది. 21 రాత్రులకి పాము విషం కోరలు పెరుగుతాయి. ఆడపాము పక్కనే తిరిగే పాముని బాల సర్పం అంటారు. పాముకి సాధారణంగా అది పుట్టిన ఇరవై అయిదు రోజులకి కాటువేయగానే ప్రాణం తీసే సామర్థ్యం కలుగుతుంది. పాము పుట్టిన ఆరునెలలకి తొలిసారిగా కుబుసాన్ని విడిచిపెడుతుంది. పాముకి మొత్తం శరీరం మీద రెండు వందల నలభై పాదాలుంటాయి. అవి ఆవు వెంట్రుకలంతా సూక్ష్మంగా వుంటాయి. వాటి ద్వారానే పాము జరజరా పాకగలుగుతోంది. పాముకి సాధారణంగా ఒక ముఖం రెండు నాలుకలు, ముప్పై రెండు దంతాలుంటాయి. ఈ దంతాలలో కేవలం నాలుగు మాత్రమే విషపూరితమైనవి. ఆ విషపూరిత దంతాలకి 1.మకలి 2.కరాలి 3.కాలరాత్రి 4.యమదూతి అనిపేర్లు.

పాముకాటుని బట్టి అనుభవజ్ఞుడైన వైద్యుడు అది ఏ దంతం నుంచి సంభవించిందో గ్రహించగలడు. వైద్యుడు రోగికి మకరి దంతంకాటుకి గురైతే గుడాన్న (బెల్లం అన్నం), కరాలి కాటుకి కషాయాన్నం, కాలరాత్రి కాటుకి కారం అన్నం, యమదూతి కాటుకి జ్వరంవచ్చినప్పుడు పెట్టే ఆహారం పెట్టాలి. మకరి దంతం కాటు శస్త్రం గుర్తులా వుంటుంది. కరాలిదంతం కాటు కాకి పాదంలా వుంటుంది. కాలరాత్రి కాటు చేతి గుర్తులా వుంటుంది. యమదూతి దంతం కాటు గుర్తు తాబేలు ఆకారంలో వుంటుంది. పాముకోరల్లో ఎప్పుడూ విషం వుండదు. దాని కుడికన్ను సమీపంలోనే దానికి విషం వుంటుంది. బాగాకోపం వచ్చిన పాముకి కంటి పక్కనుంచి విషందాని తలకెక్కుతుంది.

అక్కడ నుంచి ఆ విషం దాని నాడుల్లోకి ప్రవేశిస్తుంది. నాడుల నుంచి సరాసరి అది కోరల్లోకి వచ్చి చేరుతుంది.

పాము మొత్తం మీద ఎనిమిది కారణాల వల్ల 1.తనని ఎవరైనా ఆక్రమించినప్పుడు 2.పూర్వం వైరం వుండటం వల్ల 3.భయపడినప్పుడు 4.అది బాగా మదించి వున్నప్పుడు 5.సర్పానికి బాగా ఆకలివేసినప్పుడు 6.విషం ఎక్కువగా లోపల తయారైనప్పుడు 7.తన సంతానాన్ని రక్షించుకోవడం కోసం ఇతరుల్ని కాటేస్తుంది.

## కార్తికేయ షష్ఠీవ్రతం

భాద్రపద మాసంలో వచ్చే షష్ఠీతిథి సుబ్రహ్మణ్య స్వామికి ఎంతో ప్రీతిపాత్రమైనది. ఆ తిథి అన్ని పాపాల్ని నశింపచేసి సుఖాన్ని శాంతిని ప్రసాదిస్తుంది. ఆ షష్ఠీతిథి రోజు శాస్త్రయుక్తంగా కుమారస్వామిని దర్శించి సేవిస్తే స్నానపానాది సుఖభోగాలు అక్షయంగా ప్రాప్తిస్తాయి. బ్రహ్మహత్యలాంటి దోషాలు కూడా నశిస్తాయి. కాబట్టి ఆ రోజు సుబ్రహ్మణ్య స్వామిని తప్పక దర్శించాలి. షోడశోపచార పూజని చేసినవాడు మరణానంతరం ఇంద్రలోకానికి చేరుకుంటాడు. కుమారస్వామికి కర్రతోగానీ, కఠినశిలతోగానీ శాశ్వతంగా ధృఢంగా వుండే మందిరం లేక ఆలయాన్ని నిర్మించినవాడు మరణానంతరం నెమలివాహనం మీద కుమారస్వామిలోకానికి చేరుకుంటాడు.

కార్తికేయుడి ఆలయంలో చిమ్మటం తుడవటంలాంటి పరిశుభ్రమైన పనుల్ని చేసేవాడు, ఆలయంలో ధ్వజస్తంభాన్ని ప్రతిష్ఠించిన వాడు రుద్రలోకాన్ని చేరుకుంటారు. చందనం, అగరు, కర్పూరం లాంటి వస్తువులతో గుహుడిని పుజించేవాడు గజఅశ్వరధాలతో కూడిన సేనాధిపతి అవుతాడు. కార్తికేయుడు రాజాధిరాజు కనుక రాజులందరూ తప్పనిసరిగా పూజించాలి. కృత్తికా పుత్రుడైన కుమార స్వామిని యుద్ధానికి వెళుతూ పూజిస్తే వాడు యుద్ధంలో శత్రువులందరినీ అవలీలగా జయిస్తాడు.

సంపెంగలతో స్వామిని పూజించేవాడు సర్వపాపాలనుంచీ విముక్తుడై మరణానంతరం కైలాసానికి చేరతాడు. షష్ఠితిథినాడు పగలు, రాత్రి, నూనెని నూనెతో చేసిన పదార్థాలని భుజించకూడదు. ఆరోజు ఉదయం ఉపవాసం ఉండి రాత్రి భోజనం చేసినవాడు కార్తికేయుడి దివ్యానుగ్రహాన్ని పొందుతాడు. భక్తి శ్రద్ధలతో దక్షిణదిశగా వెళ్ళి అక్కడ వున్న స్వామి ఆలయాన్ని చేరుకుని లోపల కొలువైన సుబ్రహ్మణ్యుడిని సేవిస్తే శాంతి సౌభాగ్యాలు లభిస్తాయి.

## శ్రీకృష్ణుడు చెప్పిన సూర్యుడి వైభవం

శ్రీకృష్ణుడు తన కుమారుడైన సాంబుడికి దేవతల ఉనికి, అస్తిత్వం గురించి ప్రబోధిస్తూ ప్రత్యక్షదైవమైన సూర్యభగవానుడి గురించి ఆయన దివ్య వైభవం గురించి ఈ విధంగా తెలియచేసాడు.

సృష్టికి కన్నులాంటి వాడైన ఈ సూర్యుడే ప్రత్యక్షదైవం. ఆయనకన్నా అధికమైన, శాశ్వతమైన దేవత మరొకడు లేడు. సూర్యుడి నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవిస్తోంది. ఆయనలోనే లయమైపోతోంది. కృతయుగం, త్రేతాయుగం లాంటి లక్షణాలున్న కాలస్వరూపం ఈ సూర్య భగవానుడే. గ్రహాలు నక్షత్రాలు, యోగాలు, కరణాలు, మేషాది ద్వాదశరాశులు, ఆదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, అశ్వినులు, వాయువు, అగ్ని, ఇంద్రుడు, బ్రహ్మ, ముల్లోకాలు, పర్వతాలు, వృక్షాలు, నదులు, సముద్రాలు, సకల ప్రాణి ప్రపంచం ఇలా వీటన్నిటికీ కారణం సూర్యుడే.

సూర్యుడి ఇచ్ఛతోనే ఈ జగత్తు ఆవిర్భవించింది. ఆయన ఇచ్ఛతోనే ఇది స్థితిని పొందింది. ఆయన ఇచ్ఛతోనే ఈ సృష్టిలో వున్న వస్తువులన్నీ తమ తమ కార్యాలని నిర్వర్తించగలుగుతున్నాయి. సూర్యుడి అనుగ్రహంతోనే లోకమంతా చైతన్యవంతంగా కనిపిస్తుంది. ఆయన ఉదయంతో సృష్టి అంతా వికసిస్తోంది.

తస్మాదతఃపరం నాస్తి నభూతే న భవిష్యతి ।
యావైవేదేషు సర్వేషు పరమాత్మేతి గీయతే ॥

ఇతిహాస పురాణేషు అంతరాత్మేతి గీయతే ।
బ్రాహ్యాత్మేతి సుషుమ్నాస్థః స్వప్నస్థోజాగ్రత స్థితః ॥

*(శ్లో॥27-28, అధ్యా-48)*

సూర్యుడికన్నా గొప్పవాడు లేడు. భవిష్యత్తులో వుండబోడు. వేదాలన్నిటిలో సూర్యుడే పరమాత్మగా కీర్తించబడ్డాడు. ఇతిహాసపురాణాలలో ఆయన అంతరాత్మగా ప్రశంసించబడ్డాడు. సూర్య భగవానుడు సుషుమ్నానాడిలో వుంటాడు. జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థలలో బాహ్యంగా కనిపిస్తాడు. ఇలా సర్వాన్నీ వహించే సూర్యుడు సృష్టిలో వున్న ప్రాణులందరికీ ప్రేరణ కలిగిస్తాడు. ఈ చరాచర భూతాలలో ఆయన ప్రసరించని వస్తువు లేదు. అటువంటి సూర్యుడి దివ్యవైభవాన్ని వర్ణించటానికి వేదాలకి గానీ, వేదవేత్తలకి గానీ వంద సంవత్సరాలైనా సాధ్యంకాదు. అందుకే ఇతడు గుణాకరుడు, దివాకరుడు అని ప్రసిద్ధి చెందాడు.

## మహాసప్తమీ ప్రాశస్త్యం

మాఘమాసంలో వచ్చే శుక్లపక్ష షష్ఠినాడు రాత్రి ఉపవాసంచేసి సప్తమినాడు ఉదయం ఎర్రచందనంతో, గన్నేరు పూలతో సూర్యుణ్ణి పూజించాలి. సకల సుఖాల్ని ప్రసాదించే భాస్కరుణ్ణి గుగ్గులు, సారెవత్తులు వంటి వివిధ రకాల భక్ష్యాలతో ఆయనకి నైవేద్యం సమర్పించాలి. ఈ విధంగా సూర్యుడి పూజని మాఘమాసం నుంచి వరుసగా నాలుగు మాసాలు అనగా జ్యేష్ఠమాసం వరకూ ప్రతినెలా శుక్లపక్ష సప్తమినాడు చేయాలి.

ఈవ్రతాన్ని ఆచరించేవాడు ఆత్మశుద్ధి కోసం కొద్దిగా గోమయాన్ని (ఆవుపేడ) ప్రాశన చేయాలి. గోమయం కలిపిన నీటితోనే స్నానం చేయాలి. తన శక్త్యానుసారం సూర్యపూజ చేసిన తరువాత బ్రాహ్మణులకి భోజనం పెట్టాలి. జ్యేష్ఠాదిమాసాలలో తెల్లచందనం, తెల్లటి పూలు సూర్యుడి పూజలో వినియోగించాలి. ఆ మాసంలో సూర్యపూజ చేసాక నల్లని అగరుతో ధూపం వేసి పాయసాన్ని నైవేద్యంగా పెట్టి ఆ నైవేద్యంతో సహా విప్రుల్ని భోజనం పెట్టి

సంతృప్తి పరచాలి. కార్తీకాదిమాసాలలో సూర్యపూజ చేసేవారు పంచగవ్య ప్రాశన చేసి, దానితోనే స్నానం ఆచరించి అగిసెపూలతో సూర్యుణ్ణి ఆరాధించాలి. బెల్లంతో చేసిన భక్ష్యాలు చెరుకురసం నైవేద్యంగా పెట్టాలి.

మహాసప్తమినాడు యధాశక్తి బ్రాహ్మణులకి అన్నసంతర్పణ చేయాలి. మాఘమాసంలో మహాసప్తమినాడు సూర్యపూజ చేసేవాడు, పూజ అయిన తరువాత ఇంతకు ముందు చెప్పిన దానికి రెండింతలు ఎక్కువగా దానం, అన్న సంతర్పణ చేయాలి. ఆ రోజు రధయాత్ర, రధ దానం చేయాలి. ఆర్థికంగా ఉన్నతస్థానంలో వున్నవారు మరింత అభివృద్ధి చెందటానికి చిన్న బంగారు రథాన్ని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. దీన్న రథసప్తమీ వ్రతం అంటారు. మహా సప్తమీ అని కూడా వ్యవహరిస్తారు. ఉపవాసదీక్షతో ఈ దివ్యవ్రతాన్ని ఆచరించిన వారు సూర్యానుగ్రహంతో అఖండమైన కీర్తిని, సంపదల్ని, ఆరోగ్యాన్ని, పొందుతాడు.

## సూర్యుడి పూజా సామాగ్రి

త్రిమూర్తులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడా సూర్యుణ్ణి ఆరాధిస్తారు.

1. **బ్రహ్మదేవుడు :** పద్మాకారంలో వున్న సూర్యభగవానుణ్ణి తామరపూలతో, గుగ్గులతో బ్రహ్మ పూజిస్తాడు.
2. **మహాదేవుడు :** వ్యోమరూపంలో వున్న సూర్యుణ్ణి జాజిపూలతో, విజయధూపంతో పూజిస్తాడు పరమేశ్వరుడు
3. **మహావిష్ణువు :** తన చక్రాయుధరూపంలో నిత్యం సూర్యుణ్ణి ఆరాధిస్తాడు శ్రీహరి. ఆయన తన పూజలో నల్లకలువ పూలని, అగరధూపాన్ని వినియోగిస్తాడు.

**సూర్యుడి పూజా ద్రవ్యాలు–ఫలితాలు :**

సూర్యభగవానుడిని 'మల్లె'పూలతో పూజించేవాడు భాగ్యవంతుడవుతాడు. 'తెల్లతామరపూల'తో అర్చించేవాడు శాశ్వతమైన సౌభాగ్యాన్ని పొందుతాడు. మంచిసువాసనగల 'కొండమల్లె' పూలతో పూజిస్తే గొప్ప సంపదల్ని పొందుతాడు.

నిత్యం పై తెలిపిన పూలన్నిటితో సూర్యుణ్ణి ఆరాధిస్తే సంపదలు అక్షయంగా వారి ఇంట్లో వుంటాయి. 'దాసానిపూలతో' సూర్యుణ్ణి పూజిస్తే సకల కుష్ఠ వ్యాధులు నయమైపోతాయి.

మారేడు దళాలతో పూలతో పూజిస్తే ధనవంతుడవుతాడు. జిల్లేడు పూలదండతో పూజిస్తే ధనం ప్రాప్తిస్తుంది. పొగడపూల దండతో పూజిస్తే అందమైన భార్య వస్తుంది. మోదుగుపూలతో పూజచేసిన వాడిని సూర్యుడు అతడి జాతకంలో దుష్టస్థానంలోవున్నా అతన్ని బాధించడు. అగిసెపూలతో పూజిస్తే సర్వకార్యానుకూలత కలుగుతుంది. గన్నేరుపూలతో సూర్యుణ్ణి శ్రద్ధగా అర్చిస్తే అతడు సూర్యుడికి అనుచరుడిగా మారిపోతాడు. 1. వెయ్యి సదాపలేక తామరపూలతో పూజచేసినవాడికి సూర్యలోకం ప్రాప్తిస్తుంది. ఒకే రకం పుష్పాలతో పూజచేసినా అదే ఫలితం లభిస్తుంది. కస్తూరి, చందనం, కుంకుమం, కర్పూరం వీటిని సమభాగాలుగా కలిపితే అది యక్షకర్దమగంధం అనబడుతుంది. ఆ గంధంతో సూర్య భగవానుణ్ణి అర్చిస్తే సూర్యుడి అనుగ్రహం సంపూర్ణంగా కలుగుతుంది. సూర్యుడి ఆలయాన్ని శుభ్రపరిచినవాడికి రోగాలు నశిస్తాయి. అంతేకాదు 18 రకాల కుష్ఠువ్యాధులు ఇంకా అసాధ్యమైన రోగాలు కూడా తగ్గిపోతాయి.

సూర్యుడికి రక్తచందనం అంటే ప్రీతి దానితో పూజ చేస్తే ఆయన సంతోషిస్తాడు. అలాగే గన్నేరుపూలు కూడా. సూర్యుడి సమక్షంలో నేతిదీపాన్ని సప్తమితిథి నాడు వెలిగించినవాడికి చక్కని దృష్టి ఏర్పడుతుంది (సూర్యదేవాలయం సమీపంలో లేకపోతే శివాలయంలోవున్న నవగ్రహాలయంలోని సూర్యుడి ముందు కూడా నేతిదీపాన్ని వెలిగించవచ్చు). నల్లావాలనూనెతో దీపం వెలిగిస్తే శత్రువిజయం నువ్వులనూనెతో దీపం వెలిగిస్తే సూర్యలోకం, విప్పపూవు నూనెతో దీపం వెలిగిస్తే సౌభాగ్యం కలుగుతుంది.

సూర్యుడికి ఇష్టమైన ద్రవ్యాలలో ప్రధానమైనవి – పూలలో జాజిపూలు, ధూపాలలో విజయధూపం (మొక్కపుచెట్టు, చిల్లమడ్డ, చందనం, అగరు, చక్కెర,

కర్పూరం, నిడుముస్తె ఇవన్నీ కలిపిచేసినది) గంధాలలో కుంకుమ, లేపనాలలో రక్తచందనం దీపారాధనకి నేయి, నైవేద్యానికి ఉండ్రాళ్ళు శ్రేష్ఠమైనవి.

## బ్రహ్మ చేసిన సూర్యస్తవం

సూర్యభగవానుడు ఏఏ నామాలతో స్తుతిస్తే సంతోషించి వరాల్ని, ప్రసాదిస్తాడో ఆ దివ్యనామాల్ని యాజ్ఞవల్క్యమహర్షికి ఈ విధంగా స్తోత్ర రూపంలో వివరించి చెప్పాడు.

నమః సూర్యాయ నిత్యాయ రవయే కార్య భానవే ।
భాస్కరాయ మతంగాయ మార్తాండాయ వివస్వతే ॥

ఆదిత్యాయ దేవాయ నమస్తే రశ్మిమాలినే ।
దివాకరాయ దీప్తాయ అగ్నయే మిహిరాయచ ॥

ప్రభాకరాయ మిత్రాయ నమస్తేఽదితి సంభవ ।
నమో గోపతయే నిత్యం దిశాంచపతయే నమః ॥

నమోధాత్రే విధాత్రే చ అర్యమ్ణే వరుణాయ చ ।
పూష్ణే భగాయ మిత్రాయ పర్జన్యాయాంశవే నమః ॥

నమోహితకృతే నిత్యం ధర్మాయ తపనాయ చ ।
హరయేహరితాశ్వాయ విశ్వస్యపతయే నమః ॥

విష్ణవే బ్రహ్మణేనిత్యం త్ర్యంబకాయ తథాత్మనే ।
నమస్తే సప్తలోకేశ నమస్తే సప్త సప్తయే ॥

ఏకస్మైహి నమస్తుభ్యమేకచక్ర రథాయ చ ।
జ్యోతిషాం పతయే నిత్యం సర్వప్రాణభృతే నమః ॥

హితాయ సర్వభూతానాం శివాయార్తి హరాయచ ।
నమః పద్మప్రబోధాయ నమోదేవాది మూర్తయే ॥

కాధిజాయ నమస్తుభ్యం నమస్తారా సుతాయచ ।
భీమజాయ నమస్తుభ్యం పావకాయ చవై నమః ॥

ధిషణాయ నమో నిత్యం నమః కృష్ణాయ నిత్యద ।
నమోస్త్వదితి పుత్రాయ నమో లక్ష్యాయ నిత్యశః ॥

**ఫలశ్రుతి :**

ఏతా న్యాదిత్యనామాని మయాప్రోక్తానివై పురా ।
ఆరాధనాయ దేవస్య సర్వకామేన సువ్రత ॥

సాయం ప్రాతః శుచిర్భూత్వాయః పఠేత్సుసమాహితః ।
నప్రాప్నోత్యఖిలాన్కామాన్యథాహం ప్రాప్తవాన్పురా ॥

ప్రసాదాత్తస్య దేవస్య భాస్కరస్య మహాత్మనః ।
శ్రీకామః శ్రియమాప్నోతి ధర్మార్థీ ధర్మమాప్నుయాత్ ॥

ఆతురోముచ్యతే రోగాద్బద్ధోముచ్యేత బంధనాత్ ।
రాజ్యార్థీరాజ్యమాప్నోతి కామార్థీ కామమవాప్నుయాత్ ॥

ఏతజ్జ ప్యం రహస్యంచ సంధ్యోపాసన మేవ చ ।
ఏతేన జపమాత్రేణ నరః పాపాత్ప్రముచ్యతే ॥

**సూర్యనామాలు :**

ఓం సూర్యాయ నమః, ఓం నిత్యాయ నమః, ఓం రవయేనమః, ఓం కార్య భానవే నమః, ఓం భాస్కరాయ నమః, ఓం మతంగాయ నమః, ఓం మార్తాండాయనమః, ఓం వివస్వతే నమః, ఓం ఆదిత్యాయ నమః, ఓం ఆదిదేవాయ నమః, ఓం రశ్మిమాలినే నమః, ఓం దివాకరాయ నమః, ఓం దీప్తాయనమః, ఓం అగ్నయే నమః, ఓం మిహిరాయనమః, ఓం ప్రభాకరాయ నమః, ఓం మిత్రాయ నమః, ఓం అదితిసంభవాయ నమః, ఓం గోపతయేనమః, ఓం దిశాంపతయేనమః, ఓం ధాత్రే నమః, ఓం విధాత్రే నమః, ఓం అర్యమ్ణే నమః, ఓం వరుణాయ నమః, ఓం పూష్ణే నమః, ఓం భగాయనమః, ఓం మిత్రాయ నమః, ఓం పర్జన్యాయ నమః, ఓం అంశవే నమః, ఓం హితకృతే నమః.

ఓం ధర్మాయ నమః, ఓం తపనాయ నమః, ఓం హరయే నమః, ఓం హరితాశ్వాయ నమః, ఓం విశ్వస్యపతయే నమః, ఓంవిష్ణవే నమః, ఓం బ్రహ్మణే నమః, ఓం త్ర్యంబకాయ నమః, ఓం ఆత్మనే నమః, ఓం సప్తలోకేశాయ నమః, ఓం సప్తసప్తయే నమః, ఓం ఏకస్మై నమః, ఓం తుభ్యం నమః, ఓం ఏకచక్ర రథాయ నమః, ఓం జ్యోతిషాపతయే నమః, ఓం సర్వప్రాణి భృతే నమః, ఓం సర్వభూత హితాయ నమః, ఓం శివాయ నమః, ఓం ఆర్తి హరాయ నమః, ఓం పద్మ ప్రబోధాయ నమః, ఓం వేదాది మూర్తయే నమః, ఓం కాథిజాయనమః, ఓం తారాసుతాయ నమః, ఓం భీమజాయనమః, ఓం పావకాయ నమః, ఓం ధిషణాయ నమః, ఓం కృష్ణాయ నమః, ఓం నిత్యదాయ నమః, ఓం ఆదిత్య పుత్రాయ నమః, ఓం లక్ష్యాయ నమః ॥

యాజ్ఞవల్క్య ఈ సూర్యనామాలు ఎంతో ప్రభావవంతమైనవి. సూర్యదేవుడి అనుగ్రహం కలగటం కోసం నేనీ నామాలని నీకు చెబుతున్నాను. ఎవరైనా ఈ దివ్యనామాలని శుచిగా ఉదయం సాయంత్రం సమయాలలో పఠిస్తే సమస్తకోరికలూ అతడికి నెరవేరతాయి. మహాత్ముడైన భాస్కరుడి అనుగ్రహంతో అతడికి సకల సంపదలు లభిస్తాయి. ధర్మం కావలసినవాడు ధర్మాన్ని పొందుతాడు. వ్యాధితో బాధపడేవాడు ఆరోగ్యవంతుడవుతాడు. బంధనాల్లో వున్నవాడు వీటి నుంచి విముక్తుడవుతాడు. రాజ్యంకోరుకునేవాడు రాజ్యాన్ని పొందుతాడు. కామార్థికామాన్ని పొందుతాడు. ఈ దివ్య నామాలని రహస్యంగా పఠించాలి. ఇది సాక్షాత్తు సంధ్యోపాసన చేసిన ఫలాన్నిస్తుంది. ఈ సూర్య నామాల్ని జపించినవాడు పాపవిముక్తుడవుతాడు.

## విజయ సప్తమీ వ్రత ప్రాశస్త్యం

సూర్యారాధనకి ప్రశస్తమైన తిథి సప్తమి. ఇది–జయ, విజయ, జయంతి, అపరాజిత, మహాజయ, నంద, భద్ర–అని ఏడు రకాల పేర్లతో వ్యవహరించబడుతుంది. వీటిలో విజయా సప్తమీతిథి చాలా శ్రేష్ఠమైనది. ఏ నెలలోనైనా శుక్లపక్ష సప్తమి ఆదివారం కలిసివస్తే ఆ తిథిని విజయా

సప్తమీ అంటారు. ఆ రోజు చేసిన దానం అనంతమైన ఫలాన్నిస్తుంది. విజయ సప్తమినాడు చేసిన స్నానం, దానం, జపం, హోమం, ఉపవాసం మహాపాపాల్ని సైతం పోగొడుతుంది.

పంచమితిథి ఏకభుక్తంచేసి, షష్ఠినాడు రాత్రిభోజనం చేసి, సప్తమినాడు ఉపవాసముండి, అష్టమినాడు పారణ చేయాలి. షష్ఠినాడు ఉపవాసదీక్ష వహించి సూర్యభగవానుణ్ణి షోడశోపచారాలతో పూజించాలి. సూర్యుణ్ణి పూజించిన తరువాత ఉపాసకుడు ఆ గదిలోనే నిద్రపోవాలి. నిద్రపోయే ముందు గాయత్రీ మంత్రాన్ని గానీ, సౌరసూక్తాన్నిగానీ పఠించాలి. మర్నాడు సప్తమి తిథిలో స్నానంచేసి పవిత్రుడై సూర్య షడక్షరీమంత్రాన్ని జపించి, యథాశక్తి హోమం చేయాలి. హోమానంతరం భక్తిగా బ్రాహ్మణులకి అన్న సంతర్పణ చేయాలి. శాల్యన్నం, భక్ష్యాలు, బూరెలు, నేయి, పాయసం వంటి పదార్థాలతో సంతర్పణ వుండాలి. తరువాత విప్రుల్ని తగిన దక్షిణ తాంబూలాలతో సత్కరించి పంపాలి.

ఈ విజయసప్తమీ వ్రతం ఎంతో మహిమాన్వితమైనది. సూర్యదేవుడికి ఈ తిథి ఎంతో ఇష్టమైనది. అందుకే ఈ రోజు చేసే పూజతో సూర్యుడు సంతృప్తి చెంది ఉపాసకుడికి ఆయురారోగ్య ఐశ్వర్యాలని ప్రసాదిస్తాడు.

## ఆదిత్యవార కల్పం

సప్తమీ తిథితో కూడిన ఆదివారం ఎంతో ప్రశస్తమైనది. దీనినే విజయసప్తమీ అంటారు. ఆ రోజు శ్రాద్ధాన్ని పెట్టేవారు ఏడుజన్మలపాటు రోగరహితులై వుంటారు. ఆ రోజు స్థిరచిత్తంతో ఉదయం ఉపవాసం వుండి రాత్రి భోజనం చేయాలి. ఉదయంపూట ఆదిత్యహృదయ పారాయణ చేయాలి. ఇలా చేసినవారు జీవితాంతం ఆరోగ్యంతో వుండి మరణానంతరం సూర్యలోకానికి చేరుకుంటారు. ఈ భాను సప్తమీ తిథినాడు సూర్యుడి షడక్షరీ మంత్రాన్ని, సూర్యస్తోత్రాల్ని జపిస్తే శుభప్రదం.

సూర్యుడికి సంబంధించిన వారాలు (పుణ్యతిథులు) మొత్తం పన్నెండు. 1.నంద 2.భద్ర 3.సౌమ్య 4.కామద 5.పుత్రద 6.జయ 7.జయంత 8.విజయ 9.ఆదిత్యాభిముఖ 10.హృదయ 11.రోగహర 12.మహాశ్వేత ప్రియ అనేవి.

**1. నందవిధి :** మాఘమాసం శుక్లపక్ష షష్ఠితిథిని నంద అంటారు. ఆ రోజు సూర్యుడిని నేతితో అభిషేకించి, అగిసెపూలతో పూజించి, గుగ్గులు ధూపాన్నిచ్చి భక్ష్యాల్ని నైవేద్యంగా సమర్పించాలి. తరువాత యోగ్యుడైన బ్రాహ్మణుడికి భక్ష్యాలు దక్షిణ తాంబూలాలు సమర్పించి గౌరవించాలి. ఈ విధానాన్నంతా నక్తదీక్షతో ఆచరించాలి.

**2. భద్రవిధి :** భాద్రపద మాస శుక్లపక్ష షష్ఠిని 'భద్ర' అంటారు. ఆ రోజు నక్త దీక్షని వహించి జాజిపూలు, తెల్ల చందనంతో స్వామిని అర్చించి, విజయ ధూపాన్నిచ్చి, పాయసాన్ని నైవేద్యంగా సమర్పించాలి. ఈ పూజని మధ్యాహ్న సమయంలోనే చేయాలి. తరువాత ఒక బ్రాహ్మణుడికి యథా శక్తి భోజన దక్షిణ తాంబూలాలతో సంతృప్తి పరిచి ఆ తరువాత తాను భుజించాలి. పాయసాన్ని నేయి బెల్లం ఉపయోగించి తయారు చేయాలి. దీనివల్ల సకలకోరికలు నెరవేరి వ్రతాన్ని ఆచరించినవాడికి సూర్యలోక ప్రాప్తి కలుగుతుంది.

**3. సౌమ్యవిధి :** రోహిణీ నక్షత్రం కలిసి వచ్చిన ఆదివారం 'సౌమ్య' అని చెప్పబడుతుంది. ఆ రోజు సూర్యుడికి చేసే పూజ, జపం, దానం, హోమం అనంతమైన ఫలితాన్నిస్తుంది. ఎర్రకలువలు, ఎర్రచందనంతో సూర్యుణ్ణి పూజించి, అగరుధూపాన్ని వేసి, పాయసాన్ని నివేదించాలి. తరువాత యథాశక్తి విప్రులకి భోజనం పెట్టి తరువాత తాను తన పరివారం భుజించాలి. ఈ వ్రతాన్ని చేసినవాడికి సూర్యుడి దివ్యతేజస్సు సంప్రాప్తిస్తుంది.

**4. కామద విధి :** మార్గశిరమాసంలో శుక్లపక్ష షష్ఠితిథిని 'కామద' అంటారు. ఇది సూర్యుడికి అత్యంత ప్రీతి పాత్రమైన తిథి. ఆ రోజు ఎర్రచందనం గన్నేరుపూలతో సూర్యప్రీత్యర్థం హోమం చేయాలి. అవి ఆహుతి అవుతుండగా వచ్చిన పొగని సూర్య పూజలో ధూపంగా వినియోగించాలి. వేడిగా పులగాన్ని తయారుచేసి నైవేద్యం పెట్టాలి. ఈ పూజావిధానాన్నంతా నక్తదీక్షతో ఆచరిస్తే చాలామంచిది. ఈ విధంగా సూర్యుణ్ణి అర్చించిన వాడి కోరికలన్నిటినీ సూర్యభగవానుడు తీరుస్తాడు. ధనం కోరేవారికి ధనం, విద్య కోరేవారికి విద్య, కీర్తి కావాలనుకునే వారికి కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి.

**5. పుత్రద విధి :** ఆదివారం నాడు –రోహిణి, పునర్వసు మఘ, హస్త, విశాఖ – ఈ అయిదు నక్షత్రాలలో ఏ ఒక్క నక్షత్రం కలిసి వున్నా దాన్ని 'పుత్రద' అంటారు. ఆరోజు ఉపవాసం వుండి పితృదేవతలకి శ్రాద్ధం పెట్టాలి. సుగంధ ద్రవ్యాలతో సూర్యుణ్ణి పూజించాలి. రక్తచందనం, గన్నేరుపూలతో కలిపిన నీళ్ళతో సూర్యుడికి అర్ఘ్యాలని ప్రదానం చేయాలి. ఆరోజు శ్రాద్ధం పెట్టేవారు భోక్తలుగా అయిదుగురు బ్రాహ్మణులని నియమించుకోవాలి. శ్రాద్ధం పూర్తయిన తరువాత మూడు పిండాలలోని మధ్యపిండాన్ని సూర్యుడి ముందు ఉంచి ఆ పిండాన్ని – ఈ క్రింది మంత్రంతో అభిమంత్రించాలి.

సఏష పిండోదేవేశ యోఽ భీష్ట స్తవసర్వదా ।
అశ్నామి పశ్యతేతుభ్యం తేనమే సంతతిర్భవేత్ ॥

*(శ్లో॥10–అధ్యా–86)*

ఓ సూర్య భగవానుడా! నీకు ఎప్పుడూ ఇష్టమైన ఈ పిండాన్ని నీ ఎదురుగా తింటున్నాను. దీనివల్ల నాకు ఉత్తమ సంతానం కలుగుగాక! నీ అనుగ్రహం నాకు లభించి నా కోరిక తీరుబోతోందని మనసుకి అనిపిస్తోంది." అని పలికి మధ్యపిండాన్ని తినాలి. ఇలా చేస్తే సూర్యభగవానుడి అనుగ్రహంతో పుత్రసంతానం కలుగుతుంది. అందుకే ఈ వారానికి 'పుత్రద' అనేపేరు సార్ధకమయ్యింది.

**6–7 జయ–జయుత విధి :** దక్షిణాయనం ప్రారంభంలో వచ్చే ఆదివారం 'జయ' అని ఉత్తరాయణంలో వచ్చే ఆదివారాన్ని 'జయంత' అని అంటారు. ఆ రోజు సూర్యుణ్ణి నేయి, పాలు, చెఱకు రసంతో స్నానం చేయించి, కుంకుమ విలేపనాన్ని చేయాలి. తరువాత గుగ్గులు ధూపాన్ని వేసి లడ్డుపాన్ని (ఉండ్రాళ్ళు) నువ్వులతో చేసిన భక్ష్యాల్ని నైవేద్యంగా సమర్పించాలి. నువ్వులతో సూర్యమంత్రాన్ని ఉచ్చరిస్తూ హోమంచేసి, హోమానంతరం మధురమైన ఆహారపదార్ధాలతో విప్రులకి సంతర్పణచేయాలి. ఇలా చేసినవాడికి సూర్యుడు వేయిరెట్లు అధికంగా శుభఫలితాలని ప్రసాదిస్తాడు.

**8. విజయవిధి :** శుక్లపక్షంలో వచ్చే రోహిణీనక్షత్రంతో కలిసిన సప్తమీతిథిని 'విజయ' అంటారు. ఇది సర్వపాపాల్నీ హరించే తిథి. ఆ రోజు చేసే స్నానం, జపం, తర్పణం, దానం, హోమం అన్నీ సూర్యుడి ప్రీత్యర్థం జరపాలి. యథావిధిగా విప్ర సంతర్పణ చేసిన వాడికి కోటిరెట్లు అధికంగా పుణ్యం ప్రాప్తిస్తుంది. అందుకే ఈ తిథినాడు సూర్యుణ్ణి ఆరాధించాలి. ఇలా సర్వేశ్వరుడు, సప్తాశ్వరథారూఢుడు, సప్త ప్రకృతి సంభవుడు అయిన సూర్యుణ్ణి పూజించిన వారికి సప్తలోకాధిపత్యం లభిస్తుంది.

**9. ఆదిత్యాభిముఖ విధి :** మాఘమాసం కృష్ణపక్ష సప్తమి ఆదివారం కలిసి వచ్చిన రోజుని 'ఆదిత్యాభిముఖి' అంటారు. ఈ తిథికి ముందురోజు ఏకభుక్తం వుండి మర్నాడు ఉదయం స్నానాదికాలు పూర్తిచేసి సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం దాకా మహాశ్వేత మంత్రాన్ని జపించాలి. ఆ తరువాత సూర్యుణ్ణి యథావిధిగా పూజించి బ్రాహ్మణులకి సంతర్పణ దక్షిణలు సమర్పించి తాను భుజించాలి. ఈవిధంగా వ్రతాన్ని ఆచరించినవాడికి ధనం, ధాన్యం, సంతానం, ఆరోగ్యం, ఐశ్వర్యం, కీర్తి మొదలైన వాటిని సూర్యుడు ప్రసాదిస్తాడు.

**10. హృదయవిధి :** సూర్యసంక్రమణం ఆదివారం కలిసి వస్తే ఆ రోజుని 'హృదయ' అంటారు. ఆ రోజు నక్తవ్రతంతో సూర్యభగవానుణ్ణి భక్తిగా పూజించాలి. ఆ తరువాత సమీపంలోవున్న సూర్యాలయానికి వెళ్ళి నూట ఎనిమిదిసార్లు శ్రద్ధగా ఆదిత్యహృదయ స్తోత్రాన్ని పారాయణ చేయాలి. తరువాత ఇంటికి వచ్చి యథాశక్తి విప్రులకి అన్నసంతర్పణ చేసి ఆ తరువాత స్వామికి నివేదించిన పాయసాన్ని తాను భుజించాలి. ఆ రోజు నేలమీదే పడుకోవాలి. ఎవడైతే భక్తి శ్రద్ధలతో ఈ వ్రతాన్ని ఆచరిస్తాడో వాడికి సూర్యుడులాంటి దివ్యతేజస్సు, కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి.

**11. రోగహర విధి :** ఆదివారం ఉత్తర ఫల్గుణీ నక్షత్రం కలిపి వచ్చిన రోజుని 'రోగహర' అంటారు. పేరుకి తగ్గట్టే ఈ తిథినాడు సూర్యుణ్ణి ఆరాధిస్తే దీర్ఘవ్యాధులన్నీ నశిస్తాయి. ఆ రోజు జిల్లేడు ఆకులతో రెండు దొప్పల్ని చేసి,

వాటిలో కొన్ని జిల్లేడు పూలని వుంచి రాత్రి సమయంలో ఆ దొప్పని సూర్యుడి సమీపంలో స్థాపించాలి. ఆ మర్నాడు ఉదయం ఆ పూలతోనే సూర్యుణ్ణి పూజించి ప్రసాదంగా ఆ జిల్లేడు పూవునే స్వీకరించాలి. యథావిధిగా బ్రాహ్మణుడికి దక్షిణ చెల్లించి అన్న సంతర్పణ చేయాలి. అలాగే ఆ రోజు రాత్రి కేవలం నేలమీదే నిద్రించాలి. ఈ విధంగా వ్రతాన్ని ఆచరించిన వాడు సకల శారీరక, మానసిక రోగాలనుంచి విముక్తుడై, మరణానంతరం సూర్యలోకానికి చేరుకుంటాడు.

**12. మహాశ్వేత విధి :** సూర్యగ్రహణం వచ్చిన రోజు ఆదివారం అయితే ఆ రోజు గొప్పతనాన్ని వర్ణించటానికి మాటలు చాలవు. ఈ రెండూ కలిసిన దివ్యమైన రోజుని 'మహాశ్వేత' అంటారు. సూర్యగ్రహణ యుక్త ఆదివారం నాడు ఉపవాసవ్రతంతో సూర్యమంత్రాన్ని గానీ, శివపంచాక్షరీ మంత్రాన్నిగానీ జపించాలి. నువ్వులు నేతితో హోమాన్ని ఆచరించి సూర్యభగవానుణ్ణి భక్తిగా పూజించాలి. తరువాత యథాశక్తి దానధర్మాలు చేసి విప్రుల్ని సంతోషపరచాలి. ఈ పవిత్రమైన రోజు ఏ మంచిపని చేసినా అది అనేక రెట్లు శుభఫలితాన్ని ప్రసాదిస్తుంది. ఎలాంటి సందేహం లేకుండా ఈ సూర్యగ్రహణం నాడు స్నాన, దాన, జప, హోమాదుల్ని ఆచరిస్తే వాంఛితఫలాలు లభిస్తాయి. ఇది ధర్మప్రదమైన వ్రతం. పుణ్యాన్ని కీర్తిని, సంపదని ఉపాసకుడికి పెంపొందించే ఈ వ్రతాన్ని అందరూ ఆచరించాలి.

ఇవి సూర్యభగవానుడికి చెందిన 12 వారాలు. వీటిలో ఏ ఒక్క వారంలో చెప్పిన వ్రతవిధిని ఆచరించినా చాలు. సమస్త సన్మంగళాలూ కలుగుతాయి. సకల పాపాలు నశిస్తాయి. ఉపాసకుడు మరణానంతరం సూర్య లేక శివలోకాలకి చేరుకుంటాడు. ఇది సూర్యభగవానుడు స్వయంగా చెప్పిన మాట.

## తిథులు - దేవతలు

ఒక నెలలో వచ్చే ఒక్కో తిథి ఒక్కో దేవతకి ప్రీతికరమైనవి. కనుక ఆయాతిథుల్లో ఆయాదేవతల్ని పూజిస్తే వారు శీఘ్రంగా ఉపాసకుణ్ణి

అనుగ్రహిస్తారు. ఏఏ తిథులు ఏఏ దేవతలకి ప్రీతి పాత్రమైనవో బ్రహ్మదేవుడు స్వయంగా విష్ణుమూర్తికి ఇలా ప్రబోధించాడు.

శుక్లపక్ష పాడ్యమితిథి అగ్ని దేవుడికి, విదియ బ్రహ్మకి, తదియతిథి కుబేరుడికి, చతుర్థి గణపతికి, పంచమి నాగేంద్రుడికి, షష్ఠి కుమారస్వామికి, సప్తమి సూర్యభగవానుడికి, అష్టమి రుద్రుడికి, నవమీతిథి దుర్గాదేవికి, దశమి యముడికి, ఏకాదశి విశ్వేదేవులకి, ద్వాదశి శ్రీహరికి, త్రయోదశి మన్మథుడికి, చతుర్దశి శంకరభగవానుడికి, పౌర్ణమి తిథి చంద్రుడికి ప్రీతికరమైనవిగా చెప్పబడ్డాయి.

ఇక కృష్ణపక్షంలో క్రమంగా ఆయా దేవతల చేత చంద్రుడి కళలు ఒక్కొక్కటిగా త్రాగబడతాయి. తిరిగి శుక్ల పక్షంలో ఆ కళలన్నీ ఒక్కొక్కటిగా పూరించబడతాయి. ఈ కళలన్నిటిలో పదహారోకళ మాత్రమే అక్షయంగా వుంటుంది. ఆ కళలో సాక్షాత్తు సూర్యుడు కొలువుంటాడు.

## తిథుల్లో దేవతల పూజ - ఫలితాలు

1. పాడ్యమిరోజు అగ్నిదేవుణ్ణి పూజించి అమృతరూపమైన నెయ్యితో హోమం చేస్తే అన్నిరకాల ధాన్యాలు అమితమైన సంపద లభిస్తుంది.
2. విదియనాడు బ్రహ్మదేవుణ్ణి పూజించి బ్రహ్మచారి బ్రాహ్మణుడికి భోజనం పెట్టి తాంబూలం దక్షిణ ఇచ్చి పంపితే సకల విద్యాపారంగుడవుతాడు.
3. తదియనాడు కుబేరుణ్ణి పూజిస్తే నిశ్చయంగా ధనవంతుడవుతాడు. వ్యాపారాల్లో అధికలాభాలు వస్తాయి.
4. చవితినాడు గణపతిని ఆరాధిస్తే సకల విఘ్నాలు తొలగిపోతాయి.
5. పంచమి తిథిలో నాగదేవతల్ని ఆరాధిస్తే విషబాధలుండవు. మంచి భార్య లభిస్తుంది. మంచి సంతానం కలుగుతుంది.
6. షష్ఠిరోజు కార్తికేయుణ్ణి అర్చిస్తే మేధావి, దీర్ఘాయుష్మంతుడు, రూపవంతుడు, కీర్తివంతుడు అవుతాడు.
7. సప్తమితిథిలో సూర్యభగవానుణ్ణి అర్చిస్తే రోగాలు నశిస్తాయి.

అష్టమినాడు శివుణ్ణి ఆరాధిస్తే జ్ఞానం, అపమృత్యు నివారణ కలుగుతాయి. నవమితిథిలో దుర్గాదేవిని పూజించిన వాడికి దుర్గతులన్నీ తొలగిపోతాయి. అంతేకాదు యుద్ధాల్లో, వాదాల్లో, వ్యవహారాల్లో విజయం లభిస్తుంది. దశమినాడు యమధర్మరాజుని పూజిస్తే ఆయన అన్ని వ్యాధుల్ని హరించి దీర్ఘాయువుని ఉపాసకుడికి ప్రసాదిస్తాడు. అంతేకాదు నరకం నుంచి ఉద్ధరిస్తాడు. ఏకాదశినాడు విశ్వేదేవల్ని పూజించాలి. వారు ప్రీతి చెందితే పశుసంపదని, ధనధాన్యాలని, భూమిని ప్రసాదిస్తారు. ద్వాదశితిథినాడు శ్రీమహావిష్ణువుని భక్తిగా పూజిస్తే సకల కార్యాలూ దిగ్విజయంగా నడుస్తాయి. ఆయన్ని పూజించినవాడు సూర్యుడిలాగా సర్వలోక పూజ్యుడవుతాడు. త్రయోదశినాడు మన్మథుణ్ణి పూజించిన వాడు సుందరమైన రూపాన్ని పొంది అందమైన భార్యతో చిరకాలం సుఖిస్తాడు.

చతుర్దశితిథినాడు మహాదేవుణ్ణి భక్తిగా పూజిస్తే సకలైశ్వర్యాలు సిద్ధిస్తాయి. పౌర్ణమినాడు చంద్రభగవానుణ్ణి శ్రద్ధగా అర్చిస్తే సుఖం:, శాంతి, కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. ఇక చివరిదైన అమావాస్యనాడు పితృదేవతల్ని ఆరాధించాలి. వారు సంతృప్తి చెందితే ఆయువుని, రక్షణని, ధనాన్ని ప్రసాదిస్తారు. ఈ తిథుల్లో గనుక శ్రద్ధగా పూజిస్తే ఆ తిథికి సంబంధించిన దేవతలు ఉపవాసదీక్ష లాంటి కఠిన నియమాలు పాటించకపోయినా సంతృప్తిచెంది కోరిన వరాలిస్తారు.

## నక్షత్రాలు - దేవతలు

బ్రహ్మదేవుడు విష్ణుమూర్తికి పదహారు తిథుల్లో ఏఏ దేవతల్ని పూజిస్తే సంతోషిస్తారో చెప్పిన తరువాత 27 నక్షత్రాలలో వ్యవస్థితులైవున్న దేవతల గురించి, వారిని పూజిస్తే వచ్చే ఫలితాల గురించి ఇలా వివరించాడు.

1.అశ్వినీ నక్షత్రం నాడు అశ్వినీ దేవతల్ని పూజిస్తే దీర్ఘాయుష్మంతు డవుతాడు. అంతేకాదు వ్యాధులతో పీడించబడేవాడికి వ్యాధి నివారణ కలిగి త్వరగా కోలుకుంటాడు. 2.భరణీ నక్షత్రం నాడు నల్లని పూలతో(నీలిరంగు) యమధర్మరాజుని పూజించాలి. తద్వారా అపమృత్యుదోషాల నుంచి మానవులకు

విముక్తి లభిస్తుంది. 3.కృత్తికా నక్షత్రం అగ్నిదేవుడికి ప్రీతికరమైనది. ఆరోజు ఎర్రని పూలని అగ్నిలో హవనం చేస్తే అగ్నిదేవుడు తేజస్సుని ప్రసాదిస్తాడు. 4.రోహిణి నక్షత్రం ప్రజాపతికి ప్రీతికరమైనది. ఆరోజు ఆయన్ని పూజిస్తే పశుసంపద వృద్ధిచెందుతుంది. 5. మృగశిరానక్షత్రం నాడు చంద్రుణ్ణి పూజించాలి. తద్వారా ఆరోగ్యం, కీర్తి ప్రతిష్ఠలు కలుగుతాయి. 6. ఆర్ద్ర నక్షత్రం పరమేశ్వరుడికి అత్యంత ప్రీతికరమైనది. ఆ రోజు దివ్యమైన పద్మాలతో, బిల్వాలతో ఆయన్ని అభిషేకించి అర్చిస్తే సమస్తసుఖాలు మానవులకి లభిస్తాయి.

7.పునర్వసు నక్షత్రం స్వర్గంలోవున్న అదితిదేవతకి ప్రీతికరమైనది. సాక్షాత్తు బృహస్పతి ఈ నక్షత్రం రోజు ఆమెని భక్తి శ్రద్ధలతో పూజిస్తాడు. మానవులు కూడా ఈ తిథినాడు ఆమెని పూజిస్తే తల్లిలా అందర్నీ కాపాడుతుంది. 8.పుష్యమీనక్షత్రంనాడు బృహస్పతిని పూజించాలి. తద్వారా జ్ఞానం వృద్ధి చెందుతుంది. 9. ఆశ్లేషానక్షత్రం నాగులకి ప్రీతికరమైనది. ఆ రోజు గంధాలతో, పాలతో నాగదేవతల్ని పూజిస్తే సత్సంతానం కలిగి సర్వదోషాలు నివారించబడతాయి. 10.మఘా నక్షత్రం నాడు పితృదేవతల్ని ఆరాధించాలి. వారు సంతృప్తి చెంది ధనధాన్యాలని, పశు సంపదని మానవులకి ప్రసాదిస్తారు. 11. పూర్వఫల్గుణీ నక్షత్రంలో 'పూషా' అనే దేవతని 12.ఉత్తర ఫల్గుణీ నక్షత్రం నాడు 'భగు'డనే దేవతని మంచి పూష్పాలతో పూజించాలి. తద్వారా వారు సంతృప్తి చెంది అన్ని కార్యాలు దిగ్విజయంగా కొనసాగేలా ఆశీర్వదిస్తారు. అంతేకాదు కోరిన కన్యతో వివాహం జరిగేలా చేసి సంపదని ఆరోగ్యాన్నీ ప్రసాదిస్తారు.

13.హస్తానక్షత్రం నాడు తేజోమూర్తి అయిన సవితృణ్ణి పూజించాలి. దానితో ఆయన సంతృప్తి చెంది ధనాన్ని, ఆయుర్దాయాన్ని ప్రసాదిస్తాడు. 14.చిత్తా నక్షత్రం నాడు 'త్వష్ట' ని పూజించాలి. ఆయన రాజయోగాన్ని కలిగిస్తాడు. 15. స్వాతీ నక్షత్రం వాయుదేవుడికి ప్రీతికరమైనది. ఆ రోజు వాయువుని పూజిస్తే గొప్ప బలాన్ని, శారీరక శక్తిని అనుగ్రహిస్తాడు. 16.విశాఖానక్షత్రంనాడు ఎర్రని పూలతో ఇంద్రుణ్ణి-అగ్నిని పూజించాలి. వారిద్దరూ సంతృప్తి చెంది

ఐశ్వర్యాన్ని తేజస్సుని ప్రసాదిస్తారు. 17.అనురాధా నక్షత్రం రోజు 'మిత్ర' అనే దేవతని ఎర్రని పూలతో అర్చించాలి. వారు సంతృప్తి చెంది సంపదల్ని దీర్ఘాయువుని అనుగ్రహిస్తారు. 18.జ్యేష్ఠా నక్షత్రం ఇంద్రుడికి ప్రీతికరమైన తిథి. ఆరోజు ఆయన్ని పూజాదులతో తృప్తి పరిస్తే పుష్టి, తుష్టి రెండూ కలుగుతాయి. 19. మూలానక్షత్రం రోజు పితృదేవతలందిరినీ భక్తితో అర్చించాలి. వారు ధనాన్ని, ఆరోగ్యాన్ని, కీర్తి ప్రతిష్ఠల్ని అనుగ్రహిస్తారు.

20.పూర్వాషాఢా నక్షత్రంరోజు జలదేవతల్ని పూజించాలి. జలదేవతలు సంతోషించి శారీరక మానసిక బాధల నుంచి విముక్తిని ప్రసాదిస్తారు. 21. ఉత్తరాషాఢా నక్షత్రం విశ్వేదేవతలకి ప్రీతికరమైనది. ఆరోజు వివిధరకాల పుష్పాలతో వీరిని అర్చిస్తే సకల సుఖాల్ని ప్రసాదిస్తారు. 22.శ్రవణానక్షత్రం నాడు విష్ణుమూర్తిని, ఎరుపు తెలుపు పసుపు పూలతో సభక్తికంగా పూజిస్తే సంపదలు ప్రాప్తిస్తాయి. సకల కార్యాలలో దిగ్విజయం లభిస్తుంది. 23.అష్టవసువులకి ప్రీతికరమైన రోజు ధనిష్ఠా నక్షత్రం. ఆ రోజు వారిని శ్రద్ధగా సేవిస్తే భయాలన్ని దూరమైపోయి నిశ్చింతతో కూడిన జీవితం లభిస్తుంది. 24.శతభిషా నక్షత్రం నాడు ఇంద్రుణ్ణి పూజించాలి. తద్వారా వ్యాధుల నుంచి విముక్తి లభిస్తుంది. ఆరోగ్యం, బలం, ఐశ్వర్యం లభిస్తాయి. 25.పూర్వాభాద్రా నక్షత్రం రోజు 'అజుణ్ణి' పూజించాలి. తద్వారా భక్తి ప్రపత్తులు వృద్ధి చెందుతాయి 26. ఉత్తరాభాద్రానక్షత్రం అహిర్బుధ్యుడికి ప్రీతిపాత్రమైనది. ఆ రోజు ఆయన్ని సేవిస్తే సుఖశాంతులు లభిస్తాయి 27.రేవతీ నక్షత్రం నాడు పూషుడనే దేవతని పూజించాలి. ఆయన సంతృప్తి చెంది శుభాల్ని సుఖాల్ని, ధైర్యాన్నీ, విజయాన్ని ప్రసాదిస్తాడు.

## త్రిమూర్తి కృత సూర్యస్తుతి

పూర్వం సూర్యభగవానుడు అత్యంత తీవ్రమైన కిరణాలతో ప్రకాశిస్తూ వుండేవాడు. ఆయన తేజస్సుకి లోకాలన్నీ ఎంతో తాపానికి గురై విలవిలలాడిపోయేవి. సూర్యతాపాన్ని భరించలేని సకలలోక వాసులంతా బ్రహ్మదేవుడికి

మొరపెట్టుకున్నారు. ఆయన వారి బాధల్ని విని తాను కూడా సూర్యుడివేడికి గురౌతున్న వాడినేనని చెప్పి "మనందరం కలిసి వెళ్ళి ఆ సూర్యుణ్ణే తన తీక్షణత్వాన్ని తగ్గించుకోమని ప్రార్థిద్దాం" అన్నాడు. సరేనని దేవతలందరూ విష్ణు శివుల్ని కూడా వెంటబెట్టుకుని సూర్యలోకానికి వెళ్ళారు. అప్పుడు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురూ ముక్తకంఠంతో సూర్యభగవానుణ్ణి ఇలా ప్రార్థించారు.

నమోనమః సురవర తిగ్మతేజసే నమోనమః ।
సురవరసుస్తుతాయవై జడాంధమూకాన్బధిరాన్సకుష్ఠాన్ ॥
సశిత్రిణోం౭ ధాన్వితవ్రణావృతాన్ కరోషి ।
తానేవపునర్నవాత్సదా అతోమహాకారుణి కాయతేనమః ॥
యదేదరం జ్యోతిరతిత్వరన్మహద్యల్ప తేజో యదపీహ చక్షుషాం ।
యదత్రయజ్ఞేష్వపనీత మాహితం త దైవ తద్రూప మనేకతఃస్థితమ్ ॥
నమస్తే రతిరూపాయ సోమరూపాయతే నమః ।
నమోయజుస్స్వరూపాయాధర్వాయాంగిరసే నమః ॥
జ్ఞానైక ధామభూతాయ నిర్ధూత తమసే నమః ।
శుద్ధ జ్యోతిస్స్వరూపాయ విస్తత్వాయామలాత్మనే ॥
నమో౭ఖిల జగద్వ్యాప్తి స్వరూపాయాత్మ మూర్తయే ।
సర్వకారణ భూతాయ నిష్ఠాయై జ్ఞాన చేతసామ్ ॥
నమో౭స్తుజ్ఞేయ రూపాయ ప్రకాశేలక్షరూపిణే ।
భాస్కరాయ నమస్తుభ్యం తథాశబ్దకృతే నమః ॥
సంసారహేతవే చైవ సంధ్యా జోత్స్నా కృతే నమః ।
త్వం సర్వమేతద్భగవాన్ జగద్వైవభ్రమతి త్వయా ॥
భ్రమత్వావిద్ధమఖిలం బ్రహ్మాండం సచరాచరమ్ ।
త్వదంశుభిరిదం సర్వం సంస్పృష్టం జాయతే శుచి ॥

క్రియతే త్వత్కరస్పర్శా జలాదీనాం పవిత్రతా ।
హోమ దానిదికో ధర్మో నోపకారాయ జాతయే ॥

తావద్యావన్న సంయోగీ జగత్యత్రభవాన్ శుచిః ।
ప్రాతర్హోమం ప్రశస్తంహి ఉదితేత్వయిజాయతే ॥

ఋచోऽథ సకలాహ్యేతా యజూషిత్వం జగత్పతే ।
సకలానిచ సామాని తపత్యేవం జగత్సదా ॥

ఋఙ్మయస్త్వం జగన్నాథ। త్వమేవచయజుర్మయః ।
తథాసామమయశ్చైవ తతోనాథ త్రయీమయః ॥

త్వమేవ బ్రహ్మణోరూపం పరం చాపరమేవచ ।
మూర్తాऽమూర్త స్థథా సూక్ష్మః స్థూలరూపతయా స్థితః ॥
నిమేషకాష్ఠాధిమయః కాలరూపః క్షయాత్మకః ।
ప్రసీదస్వేచ్ఛయా రూపం స్వతేజోమయ మాదిశ ॥

*(శ్లో॥44-75, అధ్యా-123)*

స్తుతి స్వరూపుడువి, సోమ స్వరూపుడివి, యజుః అధర్వ, అంగిరస రూపుడవైన నీకు నమస్కారం. జ్ఞానానికి నివాసస్థానమైన వాడివి, చీకటిని విడిచినవాడివి, శుద్ధజ్యోతి, శుద్ధాత్మ స్వరూపుడవైన నీకు నమస్కారం. ఆత్మమూర్తిగా సకల జగత్తులో వ్యాపించినవాడివి, సర్వానికీ కారణమైనవాడివీ. జ్ఞానాన్నీ కోరుకునేవారికి జ్ఞేయస్వరూపానివి అయిన నీకు నమస్కారం. జ్ఞేయప్రకాశ స్వరూపంతో వివిధరూపాల్ని ధరించిన నీకు నమస్కారం. భాస్కరుడవు వేదకర్తవు అయిన నీకు నమస్కారం. నీవే ఈ సంసారానికి అంతటికీ కారణ భూతుడవు. సంధ్యా రూపుడవు, వెన్నెల వెలుగువు నీవే. భగవాన్! ఈ సర్వం నీవే, నీ వల్లనే ఈ జగత్తంతా చరిస్తోంది. అలాంటి నీకు నమస్కారం. సకల చరాచర ప్రపంచమంతా నీవల్లనే చైతన్యంతో భ్రమిస్తోంది. నీ దివ్య కారణాలతోనే ఈ సర్వం సృష్టించబడింది. ఆ కారణాలవల్లనే సృష్టిలో వున్న ప్రతీదీ పవిత్రమౌతోంది.

నీ కిరణాల స్పర్శ సకల నదీనదాలలోని జలాలని పవిత్రంచేస్తోంది. నీ అనుగ్రహం లేకపోతే నీవు అన్నిటినీ పవిత్రం చేయకపోతే హోమదానాదికర్మలు సత్ఫలితాలని ఇవ్వలేవు. నీవు ఉదయిస్తేనే ఉదయకాల హోమం ప్రశస్తమయ్యేది. సూర్యదేవా! ఋగ్యజుస్సామవేదాలు నీవే. ఓ జగత్పతీ! ఈ జగత్తంతా నీవల్ల ఎంతో తపిస్తోంది. ఓ జగన్నాథా! నీవు ఋగ్వేద, యజుర్వేద, సామవేదమయుడివి. పరబ్రహ్మ, అపరబ్రహ్మ, మూర్తామూర్త స్వరూపిడివి కూడా నీవే. స్థూల, సూక్ష్మ రూపాలునీవే. నిముషం ఇత్యాదిగా కొలవబడే కాల స్వరూపానివి కూడా నీవే. స్వామీ! భరించరాని దివ్యతేజస్సుతో నీవు వెలిగిపోతున్నావు. దానివల్ల అన్నిలోకాలూ తపించిపోతున్నాయి. కనుక నీవు లోక శ్రేయస్సు దృష్ట్యా స్వచ్ఛందంగా నీ తేజస్సుని నీవే నియంత్రించుకోస్వామీ అని ప్రార్థించారు.

ఆ విధంగా దేవతల ప్రార్థన మన్నించి సూర్యుడు తన తేజస్సుని తగ్గించుకోవటానికి సమ్మతించాడు. అప్పుడు దేవతలంతా దేవశిల్పి విశ్వకర్మని పిలిపించి సూర్యుడితేజస్సుని సానపట్టే కార్యక్రమాన్ని అతనికి అప్పగించారు. విశ్వకర్మ ఎంతో నైపుణ్యంగా సూర్యుడి తేజస్సు సానబట్టగా రాలిన తేజో కిరణాలనుంచి వివిధరకాల శస్త్రాస్త్రాలు నిర్మించి దేవతలందరికీ ఇచ్చాడు. సూర్యుడి తేజస్సు పదిహేను భాగాలు తగ్గి పోవటంతో లోకాలన్నీ శాంతించాయి.

త్రిమూర్తులు స్వయంగా స్తుతించిన ఈ సూర్యస్తవాన్ని ఉదయం, సాయంత్రం పఠించేవాడి వంశం ఎంతో పవిత్రమవుతుంది. ఎలాంటి వ్యాధులూ అతన్ని పీడించవు. ధనం, ఆయుర్దాయం కలిగి సుఖ సంతోషాలతో సంపూర్ణ జీవితాన్ని ఆనందంగా గడుపుతాడు. శరీర పతనానంతరం సరాసరి సూర్యలోకానికి చేరుకుని అక్కడ కూడా ఎన్నో దివ్య భోగాలనుభవిస్తాడు.

## నవగ్రహాలు

ఆదిత్యశ్చైవ సోమశ్చలోహితాంగో బుధస్తథా ।
బృహస్పతిశ్చ శుక్రశ్చతథాహేలిసుతశ్చయం: ॥
ఉపరాగః శిఖీచోభే నవై తేను గ్రహాః స్మృతాః ।
త్రైలోక్య స్యత్విమే నిత్యం భావాభావానివేదకాః ॥ *(శ్లో-38,39, అధ్యా-125)*

సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శనైశ్చరుడు, రాహువు, కేతువు అనే వారందరూ గ్రహాలు. వీరు ముల్లోక వాసుల భావాభావాలు తెలుపుతుంటారు. వీరిలో సూర్య–చంద్రులిద్దరూ మండలగ్రహాలు. రాహువు ఛాయాగ్రహం కాగా, మిగిలిన గ్రహాలన్నీ తారాగ్రహాలు.

నక్షత్రాలకి అధిపతి చంద్రుడు. గ్రహాలకి అధిపతి సూర్యుడు. సూర్యుణ్ణి అగ్ని అని, చంద్రుణ్ణి జలం అని వ్యవహరిస్తారు. అదేవిధంగా గ్రహాలలో సూర్యుణ్ణి బ్రహ్మ అని, చంద్రుణ్ణి విష్ణువని, మిగిలిన తారాగ్రహాలనీ రుద్ర స్వరూపాలనీ చెబుతారు. సూర్యుడు కశ్యపుడి కుమారుడు కాగా చంద్రుడు ధర్ముడి పుత్రుడు. గురువు శుక్రుడు అనే ఇద్దరూ మహాగ్రహాలు. వీరిద్దరూ ప్రజాపతి పుత్రులు. సోముడి కుమారుడు బుధుడు. సూర్యపుత్రుడు శని. రాహువు సింహికాపుత్రుడు కాగా కేతువు బ్రహ్మతనయుడు.

గ్రహాలన్నిటికన్నా క్రింద భాగంలో సూర్యుడు సంచరిస్తాడు. చంద్రుడికి సంబంధించిన నక్షత్రమండలం సూర్యమండలానికి చాలాదూరంలో వుంది. ఆ నక్షత్రమండలం కన్నా దూరంలో బుధ, కుజులు, వారిద్దరికన్నా ఎక్కువ దూరంలో శుక్రుడు వున్నారు. శుక్రుడికన్నా పైన చాలాదూరంలో తారామండలం వుంది. ఆ మండలం పైన బృహస్పతి, దానికన్నాపైన శనైశ్చరుడు, శనికన్నా పైన రాహువు కేతువులుంటారు.

వీటన్నిటికన్నా పైన స్వర్గం, ధ్రువాసక్తమైవుంటుంది. సూర్యుణ్ణి ఆశ్రయించి రాహువుంటాడు. శుక్రుడి వైశాల్యం తొమ్మిది వేలయోజనాలు. దానికన్నా రెండింతలు సూర్యుడి పరిధి. సూర్యుడికన్నా శనైశ్చరుడు రెండింతలు అధికంగా వ్యాపించి వుంటాడు. చంద్రుడి విస్తీర్ణం కన్నా నక్షత్రమండలం విస్తీర్ణం మూడింతలు అధికంగా వుంటుంది. ఆ నక్షత్రమండలం కన్నా ఒకపాదం తక్కువ విస్తీర్ణం కలిగినవాడు బృహస్పతి. బృహస్పతి కన్నా పాదభాగం తక్కువ విస్తీర్ణంలో వుండేవాడు అంగారకుడు. శుక్రుడు ఈ శుక్ర–అంగారక మండలాలకన్నా తక్కువ నాలుగోభాగం వైశాల్యంతో వున్నవాడు బుధుడు.

ఇక ఆకాశంలో వుండే నక్షత్రాలన్నీ బుధుడంత వైశాల్యంతో వుంటాయి. ఈ నక్షత్రాల్లో ఏదీ అర్ధయోజనం కన్న తక్కువ విస్తీర్ణంలో వుండదు. రాహువు మాత్రం సూర్యుడి ప్రమాణంలోనే వుంటాడు. కేతువుమాత్రం ఒక స్థిరమైన ప్రమాణం లేకుండా సంచరిస్తుంటాడు.

## సూర్యుడే చెప్పిన సూర్యస్తుతి

పూర్వం ఒకానొక సందర్భంలో శ్రీకృష్ణుడికి, జాంబవతికి జన్మించిన 'సాంబుడు' తన తండ్రి అయిన శ్రీకృష్ణుడి చేత కుష్ఠువ్యాధి గ్రస్తుడుగా శపించబడ్డాడు. శాపం ద్వారా తనకి సంక్రమించిన వ్యాధిని పోగొట్టుకోవటానికి చంద్రభాగానదీ తీరానికి వెళ్ళి, సూర్యభగవానుడి గురించి కఠోరమైన తపస్సు చేశాడు. సాంబుడి తపస్సు సూర్యుడికి సంతోషాన్ని కలిగించింది. వెంటనే ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. సాంబుడు ఆయనకి భక్తిగా నమస్కరించి తనకువచ్చిన కుష్ఠువ్యాధి నశించి తిరిగి పూర్వరూపం రావాలని ప్రార్థించాడు. సాంబుడి కోరికను మన్నించిన సూర్యుడు 'తథాస్తు' అని పలికాడు. వెంటనే సాంబుడికి కుష్ఠువ్యాధి సమూలంగా తొలగిపోయి తిరిగి పూర్వరూపం సిద్ధించింది. తనకి దివ్యవరాన్ని ప్రసాదించిన సూర్యుణ్ణి కృతజ్ఞతా పూర్వకంగా ఎంతో భక్తితో

కారుణ్యాత్సర్వభూతాని పాసిత్వంచ విభావసో ।
శ్వితకుష్ఠ్యంధ బధిరాన్పంగూశ్చాపి తథావిభో ॥

*(శ్లో॥ 17, అధ్యా 127)*

"ఓ సూర్యదేవా! నీవు సకల జీవుల్ని దయతో రక్షిస్తావు. బొల్లిమచ్చలున్న వారిని, కుష్ఠువ్యాధితో పీడించబడేవారిని, గ్రుడ్డి, చెవిటి, కుంటి వారిని కూడా నీవే కాపాడుతుంటావు". అలాంటి దయామయుడవైన నీకు నమస్కారం" అని ప్రార్థించాడు.

ఈ విధంగా సూర్యుణ్ణి ఎన్నో నామాలతో కీర్తించిన సాంబుడు తిరిగి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు. ఇక ఆనాటినుంచి తనకి సుందరరూపాన్ని

ప్రసాదించిన సూర్యుణ్ణి నిత్యం ఆరాధించసాగాడు. ఒకనాటి రాత్రి సూర్య భగవానుడు సాంబుడి కలలోకి వచ్చి "సాంబా ఇప్పుడు నీకొక దివ్యస్తోత్రాన్ని చెబుతాను. ఇక నుంచి దాన్నే శ్రద్ధగా పఠించు. దీనివల్ల నీకు సకల శుభాలూ కలుగుతాయి అని తన స్తోత్రాన్ని తానే ఇలా ప్రవచించాడు.

**స్తోత్రం :** వైకర్తనో వివస్వాంశ్చ మార్తాండో భాస్కరో రవిః ।
లోకప్రకాశకః శ్రీమాన్ లోకచక్షుర్గ్రహేశ్వరః ॥
లోకసాక్షీత్రిలోకేశః కర్తాహర్తా తమిస్రహా ।
తపనస్తావనశ్చైవ శుచిః సప్తాశ్చ వాహనః ॥
గభస్తిహస్తో బ్రహ్మోచ సర్వదేవ నమస్కృతః ।

**ఫలశ్రుతి :** ఏకవింశతి రిత్యేషస్తవ ఇష్టస్సదా మమ ॥
శరీరారోగ్య దశ్చైవ ధనవృద్ధి యశస్కరః ।
స్తవరాజ ఇతిఖ్యాత త్రిషులోకేషు విశ్రుతః ॥
య ఏతతే మహాబాహో! ద్వేసంధ్యేఽ స్తమనోదయే ।
స్తౌతి మాంప్రణతో భూత్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥
మానసం వాచికం వాపి కాయికం యచ్చదుష్కృతమే ।
ఏకజాప్యేనతత్సర్వం ప్రణశ్యతి మమాస్రతః ॥
ఏషజప్యశ్చ హోమశ్చ సంధ్యోపాసనమేవ చ ।
బలిమంత్రోఽర్ఘ్య మంత్రో థ రూపమంత్రస్తథైవచ ॥
అన్నప్రదానే స్నానేచ ప్రణిపాతే ప్రదక్షిణే ।
పూజతోఽ యం మహామంత్రః సర్వపాపహరః శుభః ॥

*(శ్లో॥ 1-12, అధ్యా-128)*

సాంబా! మంగళకరమైనవి, నాకు అత్యంత ప్రీతికరమైనవి అయిన 21 నామాలని చెబుతున్నా విను. 1.వైకర్తనుడు 2.వివస్వంతుడు 3.మార్తాండుడు 4.భాస్కరుడు 5.రవి 6.లోకప్రకాశకుడు 7.శ్రీమంతుడు 8.లోకచక్షువు 9.గ్రహేశ్వరుడు 10.లోకసాక్షి 11.త్రిలోకేశుడు 12.కర్త 13.హర్త

14.తమిస్రహుడు 15.తపనుడు 16.తాపనుడు 17.శుచి 18.సప్తాశ్వ వాహనుడు 19.గభస్తిహరుడు 20.బ్రహ్మ 21.సర్వదేవనమస్కృతుడు. ఈ ఇరవై ఒక్క నామాలతో కూడిన స్తోత్రం నాకు ప్రీతిపాత్రమైనది. దీన్ని పఠిస్తే శరీరారోగ్యం, ధనవృద్ధి, కీర్తిప్రతిష్ఠలు పెంపొందుతాయి. ముల్లోకాల్లో ఇది గొప్పస్తవరాజంగా పేరొందింది. ఉదయ అస్తమాన సంధ్యలలో ఈ స్తోత్రంతో ఎవరు నన్ను స్తుతిస్తాడో! వాడి పాపాలన్నీ నశిస్తాయి. ఈ స్తోత్రమే – మంత్రజపం, హోమం, సంధ్యోపాసన, పూజామంత్రం, అర్ఘ్య మంత్రం, ధూపమంత్రం కూడా. అన్నం నివేదించేడప్పుడు నాకు అభిషేకం, అర్చన, ప్రదక్షిణ చేసేడప్పుడు ఈ స్తోత్రమంత్రాన్నే పఠించాలి. ఎందుకంటే ఇది సకలపాపహరం, శుభకరం అయిన స్తోత్రం కనుక అని ప్రబోధించాడు.

## శ్రాద్ధ భేదాలు

సూర్యభగవానుడు అరుణుడి కోరికమేరకు ఆయనకి శ్రాద్ధవిధిని, శ్రాద్ధ భేదాలని ఇలా వివరించాడు.

శ్రాద్ధాలు మొత్తం 12 రకాలుగా వుంటాయి. అవి 1. నిత్యశ్రాద్ధం 2.నైమిత్తికశ్రాద్ధం 3.కామ్యశ్రాద్ధం 4.వృద్ధిశ్రాద్ధం 5.సపిండనశ్రాద్ధం 6.పార్వణశ్రాద్ధం 7.గోష్ఠశ్రాద్ధం 8.శుద్ధిశ్రాద్ధం 9.కర్మాంగశ్రాద్ధం 10.దైవిక శ్రాద్ధం 11.ఔపచారిక శ్రాద్ధం 12.సాంవత్సరిక శ్రాద్ధం అని.

నువ్వులు, ధాన్యం, పాలు, నీళ్ళు, ఫలాలు, కూరలతో పితృదేవతల్ని సంతోషపరచటానికి నిత్యం చేసే దాన్ని నిత్యశ్రాద్ధం అంటారు. ఏదైనా నిమిత్తంగా చేసేదాన్ని నైమిత్తిక శ్రాద్ధం అంటారు. ఈ శ్రాద్ధాన్ని ఎవరో ఒకర్ని మాత్రమే ఉద్దేశించి ప్రత్యేకంగా చేస్తారు. ఈ శ్రాద్ధంలో భోక్తలుగా బేసి సంఖ్యలో (అనగా 3,5,7) విప్రుల్ని పిలిచి భోజనం పెట్టాలి. ఏదో ఒక ప్రత్యేకమైన కోరికతో చేసేదాన్ని కామ్యశ్రాద్ధం అంటారు. అలాగే వృద్ధిశ్రాద్ధాన్ని తనకి సంపదవంటివి వృద్ధిచెందటం కోసం చేస్తారు. పిండాలు ప్రధానంగా చేసేది సపిండశ్రాద్ధం. ఇందులో నాలుగు పాత్రల్ని ఉంచి వీటిలో గంధాన్ని, నీటిని, నువ్వుల్ని వదలాలి.

నాలుగోపాత్ర పితృపాత్ర. అందులో ప్రేతపాత్ర జలాల్ని వదలాలి. ఈ సందర్భంలో "యే సమానాః" అనే యజుర్వేదమంత్రాన్ని పఠించాలి.

అమావాస్యగానీ మరే తిథిలో నైనాగానీ చేసేశ్రాద్ధ కర్మని పార్వణశ్రాద్ధం అంటారు. అలాగే ఆవులనుద్దేశించి చేసే కర్మని గోష్ఠశ్రాద్ధం అంటారు. ఇక పితృదేవతల సంతృప్తి కోసం, సుఖాలు ప్రాప్తించటం కోసం, పండితుల సంతృప్తి కోసం విప్రులకి భోజనాలు పెట్టి సత్కరించి చేసే శ్రాద్ధకర్మనే శుద్ధి శ్రాద్ధం అంటారు. కర్మాంగ శ్రాద్ధం అంటే! గర్భాదానం, సీమంతం, పుంసవన వంటి సంస్కారాల్లో చేసే కర్మ యాత్రల్లో దేవతల ప్రీతి కోసం నేయిని ఉపయోగించి చేసే హవనాది కార్యక్రమాల్ని దైవిక శ్రాద్ధం అంటారు.

ఔపచారిక స్నానం అంటే! తన శరీరపుష్టికోసం, అభివృద్ధికోసం చేసేది అని. ఈ శ్రాద్ధాలన్నిటికన్నా గొప్పది సాంవత్సరిక శ్రాద్ధం. మరణించిన వ్యక్తి అతనికి సంబంధించిన వారు ప్రతి సంవత్సరం అతడు మరణించిన ప్రతి తిథి నాడు తప్పకుండా చేసే శ్రాద్ధం. ఈ విధంగా మరణించిన వ్యక్తి వారసులు సాంవత్సరిక శ్రాద్ధాన్ని నిర్వహించకపోతే వారుచేసే పూజల్ని ఏ దేవతలూ స్వీకరించరు. అంతేకాదు వారు భయంకరమైన 'ఘోర తమిస్రం' అనే నరకంలో యమబాధలు అనుభవించి తిరిగి పందిగా జన్మిస్తారు.

ఎవరైనా చనిపోయిన వారి తిథి, నక్షత్రం కనీసం మాసంకూడా తెలియకపోతే వారికి మరోవిధానం ఉంది. ఏదోఒక నెలలో వచ్చే అమావాస్య తిథిని నిర్ణయించుకుని, ప్రతి సంవత్సరం అదే అమావాస్యనాడు వారికి శ్రాద్ధాన్ని పెట్టవచ్చు. మృగశిర, మఘనక్షత్రాలున్న రోజు పితృదేవతలకి శ్రాద్ధం పెట్టి విప్రుల్ని భోజనాలతో సంతృప్తి పరిస్తే శుభం జరుగుతుంది. పితృదేవతలు, గోవులు, బ్రాహ్మణులు అంటే నాకు (సూర్యుడికి) చాలా ఇష్టం. వారిని సేవిస్తే నేను ప్రసన్నుడనౌతాను.

## దాన విధి

దైవకార్యాలలో గానీ పితృకార్యాలలో గానీ దానం చేస్తే దేవతలు అనుగ్రహిస్తారు. పితృదేవతలు శుభాశీస్సులందజేస్తారు. కనుక దాన ధర్మాలు

తప్పని సరిగా ప్రతిఒక్కరూ చేయాలి. దానం అనేది అపాత్రదానం కాకూడదు. సత్పాత్రుడినే దానం చేయాలి. అలా చేయకపోతే "పచ్చికుండలో పోసిన నీళ్ళు ఎలా పాడైపోతాయో! చవిటి నేలలో విత్తిన విత్తనం ఎలా నశించిపోతుందో, బూడిదలో వేసే హవన పదార్థాలు ఏవిధంగా నిష్ఫలమైపోతాయో! అదేవిధంగా అపాత్రదానం కూడా వ్యర్థమైపోతుంది. ఏ ప్రయోజనాన్ని ఇవ్వదు.

కరుణతో శ్రద్ధతో చేసే దానమే ఉత్తమమైనది. అంధులకి, అంగవికలురకి, బాలురకి, వృద్ధులకి, అవసరమైన వారికి చేసే దానం వల్ల ఇచ్చే వారికీ పుచ్చుకునే వారికీ స్వర్గం ప్రాప్తిస్తుంది. సాధువులు, సత్పురుషులు దానం స్వీకరించారంటే అది వారి కోసం కాదు. కనుక వారికి చేసే దానం అనంతమైన ఫలితాన్నిస్తుంది. ప్రతిరోజూ ప్రతిఇంటికీ వెళ్ళి కేవలం తన స్వార్థం కోసమే యాచించేవాడు సత్పాత్రుడు కాదు. అయితే దాత అనేవాడు వచ్చింది ఎవరైనా సరే అర్థిస్తే లేదనకుండా శక్తిమేరకు దానం చేయాలి.

యాచనకు వచ్చిన వాడిని ఏమాత్రం విసుక్కోకూడదు. అగౌరవ పరచకూడదు. ఇచ్చేదానాన్ని ప్రేమగా మనఃస్ఫూర్తిగా ఇవ్వాలి. లేకపోతే చేసిన దానానికి పుణ్యం లభించదు. కనుక శ్రద్ధగా ప్రేమతో మాత్రమే దానధర్మాలు ఆచరించాలి. ఉదారత్వం, స్వాగతం, మైత్రి, దయ, శాంతం అనే ఈ అయిదు గుణాలని తనలో నింపుకుని చేసే దానమే అత్యుత్తమమైనది. అనంతమైన శుభ ఫలితాలని ప్రసాదించేది.

## మహాపాతకులు - ఉపపాతకులు - పాతకులు

మానసికంగా, శారీరకంగా, వాచకంగా చేసే పాపాలు ఎన్నోరకాలుగా వుంటాయి. పాపాన్ని ఏవిధంగా చేసినా అది తప్పకుండా చేసిన వాడిని నరకానికి పంపిస్తుంది.

**మహాపాతకాలు :** ఆవులు నడిచేమార్గంలోకానీ, నగరంలోకానీ, గ్రామాలలోకానీ, అగ్ని దహనాలు, విస్ఫోటనాలు కలగటానికి కారకులయ్యేవారు, మద్యపానంచేసి పాపాత్ములతో సమానంగా పాపం చేసినవారు.

స్త్రీ, పురుషుల్ని, గుర్రాన్ని, గోవుని, ఏనుగుని అపహరించేవారు, పంట పొలాలకి నష్టం కలిగించేవారు, చందనం,అగరు, కస్తూరి, పట్టువస్త్రాలు, చీరలు దొంగతనం చేసేవారు, బంగారాన్ని దొంగిలించిన వారితో సమానం. కన్యల్ని అపహరించినవారు, మిత్రుడి లేదా పుత్రుడి భార్యతో గానీ, సోదరితోగానీ అక్రమసంబంధాలు పెట్టుకునేవారు, లేక అత్యాచారాలు చేసేవారు, కుమార్తెతో, ఇతర కన్యలతో ధర్మవిరుద్ధంగా ప్రవర్తించేవారు, ఒకే వర్ణం వారితో కామక్రీడలు చేసేవారు, గురువు శయ్యమీద నిద్రించేవారు మహాపాతకులని చెప్పబడతారు.

**ఉపపాతకులు :** విప్రులకి దానం ఇస్తానని చెప్పి ఆ దానాన్ని ఇవ్వనివారు, ధర్మపత్నిని విడిచిపెట్టినవారు, సత్పురుషుల్ని, బంధువుల్ని, మిత్రుల్ని, ఆపదల్లో ఆదుకోనివారు, ఆవుని, బంగారాన్ని అపహరించేవారు, భగవద్భక్తుల్ని బాధలుపెట్టేవారు, ధనధాన్యాల్ని పశువుల్ని దోచుకునేవారు, అయోగ్యుల్ని గొప్పగా పూజించేవారు, స్త్రీలని రక్షించనివారు, మహర్షుల్ని ఆదరించనివారు, దేవతల్ని, గోవుని, అగ్నిని స్త్రీలని, బ్రహ్మణుల్ని నిందించేవారు, నాస్తికులుగా వుండేవారు, అప్రియంగా మాట్లాడేవారు, బాధ్యతల్ని వదిలేసి తిరిగేవారు, వీరంతా ఉపపాతకులని చెప్పబడతారు.

**పాతకులు :** కష్టపడి పనిచేసేవారిలో దోషాలు వెతికేవారు, పర్వతాల మీద, గోశాలల్లో, నిప్పు, నీటిలో, చెట్టునీడలో, ఆలయం గోడ దగ్గర మలమూత్ర విసర్జన చేసేవారు, కామక్రోధ లోభ, మోహ, మదమాత్సర్యాలతో నిండి ఇతరుల్ని బాధలకి గురిచేసేవారు, దారిదోపిడీలుచేసేవారు, ఇతరుల రహస్య విషయాల్ని తెలుసుకుని ఆనందించేవారు, చెడుమాటల్ని వినాలనుకునేవారు, గోవుని హింసించేవారు, బలహీనమైన పశువుల్ని కాడికి కట్టి వ్యవసాయం చేసేవారు, వీరంతా పాతకులు అని చెప్పబడతారు.

## సూర్యుడికి అర్ఘ్యం

ఒకనాడు వ్యాసమహర్షి భీష్మపితామహుడి అభ్యర్థ అనుసరించి ఆయనకి సూర్యుడికి అర్ఘ్యం ఎలా ఇవ్వాలి అన్న విషయాన్ని ఇలా వివరించాడు.

సూర్యుడికి అత్యంత ప్రీతి పాత్రమైనది అర్ఘ్యం. అందుకే ఆయన్ని అర్ఘ్యప్రియుడు అంటారు. సూర్యభగవానుడి అర్ఘ్యాన్ని సమర్పించాలనుకునే వాడు ముందుగా నదీతీరం లేదా చెరువు దగ్గరనుంచి మట్టిని తీసుకువచ్చి దాన్ని శరీరమంతా పట్టించుకోవాలి. తరువాత సూర్యాభిమంత్రాన్ని పఠిస్తూ స్నానం చేసి, ఆయనకి భక్తిగా నమస్కరించాలి. 'హ్రాం హ్రీం సః' అనే మంత్రాన్ని పఠిస్తూ ఆచమనం చేయాలి.

ఆచమనం అయిన తరువాత దేవతలకీ, ఋషులకి తర్పణాలు సమర్పించి ఆపై సంధ్యావందనాన్ని ఆచరించాలి. ఆ సందర్భంలో సూర్యుడికి దోసిళ్ళతో అర్ఘ్యాన్ని ఇచ్చి రెండోసారి స్నానం చేయాలి. స్నానానంతరం 'హ్రాం హ్రీం సః' అనే మంత్రాన్ని గానీ, 'ఓం ఖ భోల్కాయస్వాహా' అనే మంత్రాన్నిగానీ యథాశక్తి జపించాలి. తరువాత సూర్యభగవానుడికి ఈవిధంగా అర్ఘ్య ప్రదానం చేయాలి.

ఒక రాగి పాత్రని తెచ్చి, ఆ పాత్ర లోపల గంధం, ఎర్రచందనంతో ఒక వృత్తాన్ని రచించాలి. తరువాత ఆ మండలంలో గన్నేరుపూలు లేదా ఎర్రని పూలు, గంధం, నీళ్ళు, రక్తచందనం, దర్భలు, నువ్వులు, బియ్యం పోసి, మోకాళ్ళమీద ఆ పాత్రముందు కూర్చుని భక్తి పూర్వకంగా 'హ్రాం హ్రీం సః రవయే తర్పయామి నమః' అనే మంత్రాన్ని చదువుతూ ఆ పాత్రలో సూర్యుడికి అర్ఘ్యాన్ని సమర్పించాలి. ఈవిధంగా సూర్యభగవానుడికి యథాశక్తి అర్ఘ్యాలు సమర్పించినవారికి, అన్ని పాపాలనుంచీ విముక్తి లభిస్తుంది. వేలకొద్దీ సంక్రాంతులు, చంద్రగ్రహణాలతో చేసిన పుణ్యఫలం, వెయ్యి ఆవుల్ని దానమిచ్చిన ఫలితం, పుష్కర కురుక్షేత్రాది దివ్యతీర్థాలలో స్నానంచేసిన ఫలం లభిస్తాయి.

## పూరాణవాచక - శ్రవణ మహిమ

పురాణాలను ఇతిహాసాలను వినటానికి ఒక విధానం వుంటుంది. పురాణ ప్రవచనం చేసేవాడికి కొన్ని ప్రత్యేక లక్షణాలుండాలి. భక్తి శ్రద్ధలతో పురాణాన్ని వింటే బ్రహ్మహత్యాది పాపాలనుంచి కూడా విన్నవాడు విముక్తి

పొందుతాడు. పురాణాన్ని వినేడప్పుడు మనస్సుని నిర్మలంగా చేసుకుని వినాలి. త్రికరణశుద్ధిగా సాయంత్రం, రాత్రి సమయాల్లో పురాణ శ్రవణం చేసేవాడిని చూసి త్రిమూర్తులు ఎంతో సంతోషిస్తారు. ఇక పురాణ ప్రవచనం చేసేవాడు ఎలా వుండాలంటే! పురాణాల్ని అమూలాగ్రం పఠించి, వాటిని సంపూర్ణంగా అవగాహన చేసుకుని, శ్రోతలకి అర్థమయ్యేలా చెప్పగలిగివుండాలి.

పురాణ ప్రవచనం చేసే పౌరాణికుడు మంచి ఆసనం మీద అందరికీ కనబడేలా కూర్చుని ప్రవచనం చెప్పాలి. ప్రవాచకుడు కూర్చునే ఆసనాన్నే వ్యాసపీఠం అంటారు. పురాణ శ్రవణం చేయటానికి వచ్చినవారు ప్రవచనం చెప్పేవాడు ఆ ఆసనానికి ముందుగా నమస్కరించాలి. పురాణ శ్రవణం చేయాలనుకునేవారు ముందుగా తమ తమ ఇళ్ళల్లో దైవపూజ చేయాలి. తరువాత అందరూ కలిసికట్టుగా బయలుదేరి పౌరాణికుడి దగ్గరకి వెళ్ళి ఆయనకి పురాణ గ్రంథాన్ని సమర్పించి ఆహ్వానించాలి. వారి ఆహ్వానాన్ని మన్నించి ఆ పౌరాణికుడు ప్రవచించే పురాణాన్ని భక్తి శ్రద్ధలతో ప్రశాంతచిత్తులై వినాలి.

పురాణగ్రంథానికి ఒకతాడు కడతారు. దాన్ని 'వాసుకి' అని వ్యవహరిస్తారు. గ్రంథంలో వుండే పత్రాలని బ్రహ్మ అని, అందులోని అక్షరాల్ని విష్ణువు అని, అన్ని పత్రాలనీ కలిపిన కుట్టుని పరమేశ్వరుడని అంటారు. పురాణ గ్రంథంలో వున్న వరుస (పంక్తులు) దేవతలు, గ్రంథాన్ని కలిపి కుట్టటానికి ఉపయోగించిన సూత్రం (తాడు)లో సూర్యుడు, అగ్ని కొలువుంటారు. ఇక ఆ గ్రంథానికి వున్న ఖాళీల్లో కద్ర, అట్టల్లో గ్రహాలు, చంద్రుడు ఆకాశం వుంటారు. కనుక పురాణ గ్రంథాన్ని కూడా సాక్షాత్తు దైవ స్వరూపంగా భావించాలి. గ్రంథాన్ని పూజా మందిరంలో వుంచి పర్వదినాల్లో ధూపదీపనైవేద్యాలు సమర్పించాలి.

పౌరాణికుడు తనుచెప్పబోయే పురాణ గ్రంథాన్ని చేతిలో వుంచుకుని వ్యాస, వాల్మీకి, విష్ణు, శివ, సూర్యాది దేవతలకి ముందుగా నమస్కరించాలి. ఆ తరువాత శ్రద్ధతో స్పష్టంగా అక్షరాల్ని ఉచ్ఛరిస్తూ, ఏడురకాల స్వరవిన్యాసాలని

భావానుగుణంగా చేస్తూ, సందర్భానికి తగినట్టుగా ముఖంలో హావ భావాల్ని ప్రదర్శిస్తూ జనరంజకంగా పురాణాన్ని చెప్పాలి. శ్రోతకూడా ఎంతో శ్రద్ధగా పౌరాణికుడికి నమస్కరించి, అతడు చెప్పే ప్రతి మాటనీ ఆసక్తిగా వినాలి.

పురాణ శ్రవణం చేసేవారు పౌరాణికుడిని సాక్షాత్తు వ్యాసస్వరూపుడుగా భావించి గౌరవించాలి. శ్రోతలు ప్రతిరోజు తమతమ శక్త్యానుసారం ప్రవచనానంతరం ఆయనకి దక్షిణలు సమర్పించాలి. పురాణం ప్రవచనం పూర్తయిన తరువాత పౌరాణికుణ్ణి ఘనంగా సత్కరించాలి. ఆయనకి బంగారం, వెండి, ఆవు, కంచుపాత్ర, నూతన వస్త్రాలు, ఇవన్నీ గానీ వీటిలో ఏదైనా గానీ సమర్పిస్తే వారికి అగ్నిష్టోమ, గోసవ, జ్యోతిష్టోమ, సౌత్రామణి, వాజపేయ, వైష్ణవ, మహేశ్వర, బ్రహ్మ, పుండరీక, ఆదిత్య, రాజసూయ, అశ్వమేధాది యజ్ఞాలు చేస్తే ఏ ఫలితం వస్తుందో అదే ఫలితం వస్తుంది. దేవతల్లో సూర్యులు ఎలా శ్రేష్ఠుడో, బ్రాహ్మణుల్లో పౌరాణికుడు కూడా అంతే శ్రేష్ఠుడు.

పౌరాణికుడి నాలుక చివర సరస్వతి తాండవిస్తుంది. ప్రవాచకుడికి భోజనం పెట్టేవాడి పితృదేవతలు వంద సంవత్సరాల పాటు సంతృప్తి చెందుతారు. సకల పురాణ ఇతిహాసాలు తెలిసి, ప్రవచనం చేయగలిగిన విప్రుడు వుండేప్రాంతం ఎంతో గొప్పది. అది దివ్యక్షేత్రాలతో సమానం. అటువంటి పౌరాణికుడికి నమస్కరించినా చాలు అనంతమైన పుణ్యం లభిస్తుంది. తీర్థాలలో కురుక్షేత్రం, పవిత్రతలో గంగానది, దేవుళ్ళలో సూర్యభగవానుడు, బ్రాహ్మణుల్లో పౌరాణికుడు  గొప్పవారు.

## గృహస్థాశ్రమ ధర్మం

గృహస్థాశ్రమం అన్ని ఆశ్రమాలకీ మూలమైనది. అన్ని ఆశ్రమాలూ ఈ ఆశ్రమాన్ని ఆధారంగా చేసుకునే జీవిస్తాయి. అందుకే ఇది అన్నిటికన్నా గొప్పది అని ప్రసిద్ధి చెందింది. అర్థం కామం మోక్షం ఈ మూడూ ధర్మం నుంచే ఉత్పన్నమయ్యాయి. ధర్మాచరణవల్లే మానవుడికి మోక్షంకలుగుతుంది. అర్థ, కామాలని కూడా ధర్మబద్ధంగానే అనుభవించాలి. ఈ ధర్మార్ధకామాలని

త్రివర్గాలంటారు. ఇవి మూడూ సత్వరజస్తమోగుణాలని, అనగా ధర్మం సత్తగుణాన్ని, అర్థం రజోగుణాన్ని,కామం తమోగుణాన్ని ఆశ్రయించి వుంటాయి. ఈ మూడు గుణాలలో సత్త, రజో గుణాలున్నవారే వృద్ధిలోకి వస్తారు.

మానవులు అర్థ, కామాల్ని తన అదుపులో వుంచుకుని, ధర్మబద్ధంగానే వాటిని వినియోగించాలి. ధర్మాన్ని ఆచరిస్తే ఇహంలో పరంలో సుఖసంతోషాలు లభిస్తాయి. స్థావరజంగ మాత్మకమైన ఈ ప్రపంచాన్ని నిలబెట్టేది కేవలం ధర్మమే. కర్మజ్ఞానం వల్ల ధర్మం ప్రాప్తిస్తుంది. కనుక మానవుడు జ్ఞాన పూర్వకంగా కర్మాచరణ చేయాలి. వైదిక కర్మలు ఉత్తమమైనవి. ఇవి ప్రవృత్తి మూలకాలు, నివృత్తి మూలకాలు అని రెండు విధాలు. కర్మత్యాగాన్నే సన్న్యాసం అంటారు. మోక్షాన్ని కోరుకునే గృహస్థుడు చివరికి కర్మ నివృత్తిని ఆశ్రయించాలి. అలా చేయకపోతే అతడు తిరిగి సంసారకూపంలో చిక్కుకుపోతాడు.

దానం, ధర్మం, శమం, దయ, అలోభం, విషయవిముఖత, కోపాన్ని వదిలిపెట్టటం, సౌమ్యంగా వుండటం, అసూయ లేకపోవటం, తీర్థయాత్రలు చేయటం,సత్యం పలకటం, సంతోషంగా వుండటం, ఆస్తికబుద్ధితో ప్రవర్తించటం, అన్ని పనుల్లో శ్రద్ధ కలిగి వుండటం, ఇంద్రియనిగ్రహాన్ని పాటించటం, దేవ గోబ్రాహ్మణ పూజలు ఆచరించటం, అహింస గుణాన్ని అలవరుచుకోవటం, ఇతరుల్ని నిందించకుండా వుండటం, శుభకర్మల్ని ఆచరించటం, పవిత్రంగా భూతదయని కలిగివుండటం, ఇలాంటి గుణాలన్నిటినీ ధర్మగుణాలంటారు. నాలుగు వర్ణాలవారూ ఈ గుణాల్ని అలవరుచుకోవాలి. ఇవి అందరూ ఆచరించతగ్గ సామాన్య కర్మలే. శ్రద్ధ చేసే కర్మాచరణనే ధర్మం అంటారు. అసలు ధర్మం అనే దాన్లోనే శ్రద్ధ వుంటుంది.

ఈవిధంగా శ్రద్ధని నిష్ఠగా, ఆ శ్రద్ధనే ప్రతిష్ఠగా, శ్రద్ధనే ధర్మంగా భావిస్తూ నియమపూర్వకంగా గృహస్థధర్మాన్ని ఆచరించే విప్రుడికి ప్రజాపతిలోకం, క్షత్రియుడికి ఇంద్రలోకం, వైశ్యుడికి అమృతలోకం, శూద్రుడికి గంధర్వలోకం ప్రాప్తిస్తాయి.

# విప్రుల మహిమ

యోగ్యులైన బ్రాహ్మణులు పుట్టుకతోనే పవిత్రులు. బ్రహ్మదేవుడు ఎంతో తపస్సుచేసి లోకంలో కవ్యహవ్యాలని (దేవతలకి-పితృదేవతలకీ ఆహారాన్ని సమకూర్చుటానికి) నిర్వర్తించటానికి బ్రాహ్మణుల్ని సృష్టించాడు. ఊర్ధ్వలోకాల్లో వున్న దేవతలకీ పితృదేవతలకీ హవ్య, కవ్యాలద్వారా ఆహారాన్ని పెట్టే బ్రాహ్మణుల కన్నా గొప్పవారు ఎవరుంటారు? అందుకే బ్రహ్మజ్ఞానం కలిగిన బ్రాహ్మణుడు జన్మతోనే పూజనీయుడౌతున్నాడు.

నిజానికి జన్మతః బ్రాహ్మణుడుగా పుట్టినా శాస్త్రంలో చెప్పిన గర్భాదానాది నలభైఎనిమిది సంస్కారలని జరిపించుకున్నవాడే నిజమైన బ్రాహ్మణుడు. అలాంటి ఉత్తముణ్ణి పూజించే దేవగణాలన్నీ స్వర్గఫలాల్ని పొందగలిగాయి. కనుక మానవులు కూడా ఉత్తముడైన విప్రుణ్ణి పూజించి సేవిస్తే దైవానుగ్రహం పొందగలరు. బ్రాహ్మణుడు ఎవరిని ప్రసన్నంగా చూస్తాడో, శ్రీహరి కూడా అతన్నే ప్రసన్నంగా చూస్తాడు. అన్ని రకాల శాస్త్ర విషయాలూ తెలిసిన బ్రాహ్మణుడే దేవకార్యం, పితృకార్యం, యజ్ఞ యాగాలు, అగ్ని కార్యం, వివాహం, శాంతి, తుష్టి, పుష్టి కర్మలు వంటివి సమర్ధవంతంగా చేయించగలడు. బ్రాహ్మణుడు లేకపోతే దేవ, పితృకార్యాలు, యజ్ఞకర్మల్లో భాగంగా చేయబడే దాన, హెూమ బలిలాంటి విధులూ సుసంపన్నం కాలేవు. కనుక బ్రాహ్మణుణ్ణి అందరూ గౌరవించాలి.

ఉత్తముడైన బ్రాహ్మణుడు కనిపిస్తే లేచి నుంచుని భక్తిగా నమస్కరించాలి. ఆ విప్రుడి నోటినుంచి 'దీర్ఘాయుర్భవ' అన్న దీవెన వస్తే చిరాయువుగా జీవిస్తారు. అలాగే దీర్ఘసుమంగళీభవ అన్న ఆశీర్వచనం వస్తే పతికి దీర్ఘాయువు లభిస్తుంది. సద్బ్రాహ్మణుణ్ణి శ్రద్ధగా పూజిస్తే, కీర్తి, విద్య, ధనం వృద్ధి చెందుతాయి. ఏ ఇంట్లోనైతే విప్రులకి కాళ్ళుకడిగి పూజ చేయరో, ఏ ఇంట్లో వేదశాస్త్రాల ఉచ్చారణ ధ్వనులు వినిపించవో, ఏ ఇంట్లో యజ్ఞయాగాది క్రతువులు ఆచరించబడవో ఆ ఇల్లు శ్మశానంతో సమానం.

# 26 మహాదోషాలు

మానవులలో వుండే దోషాలు వారిని నరకకూపంలోకి పడేస్తాయి. వివిధరకాల దోషాల్ని కలిగి వుండే మానవుల్ని ప్రధానంగా ఇరవై ఆరురకాల వారిగా విభాగించారు. వారెవరంటే 1. అధముడు 2.విషముడు 3.పశువు 4.పిశినుడు 5.కృపణుడు 6.పాపిష్ఠుడు 7.నష్టుడు 8.రుష్టుడు 9.దుష్టుడు 10.పుష్ఠుడు 11.హృష్టుడు 12.కాణుడు 13.అంధుడు 14.ఖండుడు 15.చండుడు 16.కుష్ఠుడు 17.దత్తాపహారకుడు 18.వక్త 19.కదర్యుడు 20.దండుడు 21.నీచుడు 22.ఖలుడు 23.వాచాలుడు 24.చపలుడు 25.మలీనుడు 26.స్తేయి

**1. అధముడు :** దైవసన్నిధికి, గురువుల దగ్గరకీ వెళ్ళేడప్పుడు కాళ్ళ చెప్పులు వదలకుండా, చేతిలో గొడుగు ముడవకుండా వుండేవాడు, గురువు ఎదురుగా ఎత్తైన ఆసనం మీద కూర్చునేవాడు, పల్లకీలో కూర్చుని తీర్థయాత్రలు చేసేవాడు, పుణ్యతీర్థాలలో అనాగరికమైన పనులు చేసేవాడు అధముడు.

**2. విషముడు :** పైకి ప్రేమతో మాట్లాడుతూ లోపల ద్వేషాన్ని కలిగి వుండేవాడు, చెప్పేదొకటి చేసేదొకటిగా జీవించేవాడు, విషంలాంటి క్రూరమైన గుణాలున్నవాడు విషముడు.

**3. పశువు :** ప్రాపంచిక విషయ సుఖాలే పరమార్థం అనుకుంటూ మోక్షాన్ని గురించి ఆలోచించనివాడు, శ్రీహరిని స్మరించని వాడు, ప్రత్యక్షదైవాల్ని వదిలిపెట్టి వేరెక్కడో అదృష్టాన్ని వెతుక్కుంటూ వెళ్ళేవాడు, శాస్త్రంలో చెప్పిన విషయసారాన్ని అర్థం చేసుకోకుండా ప్రవర్తించేవాడు పశువు అని చెప్పబడతాడు

**4. పిశినుడు :** మనుష్యుల్ని తన స్వలాభం కోసం, బలంతోనో వేషంతోనో కృత్రిమ ప్రేమతోనో మోసంచేసేవాడు, తన సుఖం కోసం ఇతరుల్ని కష్టాల పాలుచేసేవాడు పిశినుడు.

**5. కృపణుడు :** తగిన ఆర్థిక స్తోమత ఉన్నప్పటికీ దైవపిత్రు కార్యక్రమాల్లో లోభత్వంతో తక్కువగా, అన్నాన్ని, తదితర ఆహార పదార్థాల్ని పెట్టేవాడు,

అస్థిరమైన, కుటిలమైన మనసుతో, అశాస్త్రీయమైన వస్తువులతో అశ్రద్ధగా పూజలు చేసేవాడు, శరీరాన్ని విక్రయించుకొనేవాడు కృపణుడు అని పిలువబడతాడు.

**6. పాపిష్ఠుడు :** యజ్ఞయాగాది క్రతువుల్ని లోపభూయిష్టంగా చేసేవారు, తల్లితండ్రుల్ని, గురువుల్ని నిర్లక్ష్యం చేసేవాడు పాపిష్ఠుడు.

**7. నష్టుడు :** వేశ్యాలోలుడు, దైవధనాన్ని సొంతఅవసరాలకు వాడుకొనేవాడు, స్వంత భార్య చేత వ్యభిచారం చేయించేవాడు, కన్యల్ని విక్రయించటం ద్వారా ధనం సంపాదించేవాడు, అక్రమమార్గాలలో సంచరిస్తూ స్వధర్మాన్ని పరిత్యజించిన వాడు నష్ఠుడు అని చెప్పబడతాడు.

**8. రుష్ఠుడు :** తన బలహీనతని తల్చుకుని కోపం ప్రదర్శించేవాడు, ప్రశాంతమైన వాతావరణాన్ని సైతం తన కోపం ద్వారా ఛిన్నాభిన్నంచేసేవాడు, మనసులో ఎప్పుడు కోపం తప్ప మరో మంచిలక్షణమే లేనివాడు రుష్ఠుడు.

**9. దుష్ఠుడు :** ధర్మకార్యక్రమాల్ని సంపూర్తిగా చేయనివాడు, ఎప్పుడూ నిద్రపోయేవాడు, దుర్వ్యసనాల మీద ఆసక్తి కలిగినవాడు, మద్యపానలోలుడు, స్త్రీ సాంగత్యం కోసం ఎప్పుడూ పరితపించేవాడు, అకారణంగా అందర్నీ నిందించేవాడు దుష్టుడు అని చెప్పబడతాడు.

**10. పుష్టుడు :** వంచనచేసేవాడు, సాధువుల్ని, సత్పురుషుల్ని నిందించేవాడు, హీనమైన పనుల్ని చేసేవాడు. మంచి భోజనం లభిస్తే దాన్ని ఎవరికీ పెట్టకుండా తానొక్కడే తినేసేవాడు పుష్టుడు.

**11. హృష్టుడు :** వేదాల్ని, వేదాంగాల్ని, ఆగమాల్ని, శాస్త్రాల్ని, అధ్యయనం చేయనివాడు, కనీసం వాటిని శ్రవణం చేయటానికి కూడా వెళ్ళనివాడు హృష్టుడు.

**12. కాణుడు :** శ్రుతుల (అనగా వేదాల) పరిజ్ఞానం లేనివాడు కాణుడు.

**13. అంధుడు :** మానవజీవితంలో తప్పని సరిగా అధ్యయనం చేయవలసినవి స్మృతులు. ఆ స్మృతుల్ని ఏమాత్రం అధ్యయనం చేయనివాడు అంధుడు.

**14. ఖండుడు :** తల్లి తండ్రుల్ని పరుషమైన మాటలతో బాధపెట్టేవాడు, అన్నదమ్ములతో దురుసుగా ప్రవర్తించేవాడు ఖండుడు.

**15. చండుడు :** ఇతరుల మీద చాటుగా నిందలు వేసేవాడు, శూద్రుల్ని సేవించేవాడు, శూద్రుల భార్యలతో అక్రమ సంబంధాలు పెట్టుకొనేవాడు, శూద్ర గృహంలో వండిన అన్నాన్ని తినేవాడు, శూద్ర గృహంలో నివసించేవాడు, శాస్త్రాల్ని నిందించేవాడు చండుడని చెప్పబడతాడు.

**16. కుష్ఠుడు :** శాస్త్రాన్ని నిందించేవారితో సావాసం చేసేవాడు, ఎనిమిది లేక మూడురకాల కుష్ఠువ్యాధులతో పీడించబడేవాడు కుష్ఠుడని పిలువబడతాడు.

**17. దత్తాపహారకుడు :** నీచమైన బుద్ధితో అక్రమంగా వ్యాపారం చేసేవాడు, కీటకంలా సంచరించేవాడు దత్తాపహారకుడు.

**18. వక్త :** తాను అజ్ఞాని అయినప్పటికీ ఆ విషయాన్ని మరచి ధర్మవేత్తలా ధర్మోపదేశాలు చేసేవాడు వక్త అని వ్యవహరించబడతాడు.

**19. కదర్యుడు :** కాశీలో స్థిరనివాసి అయినప్పటికీ ఆ నగరాన్ని వదిలేసి ఎంతోకాలం ఇతర ప్రాంతాల్లో నివసించేవాడు, గురువులకి సంబంధించిన వస్తువుల్ని అపహరించేవాడు కదర్యుడు.

**20. ఉద్దండుడు :** అనవసరంగా కోపాన్ని ప్రదర్శిస్తూ ఇతరుల్ని అకారణంగా దండించేవాడు ఉద్దండుడు.

**21. నీచుడు :** అక్షర జ్ఞానం ఉన్న వాడైనప్పటికీ ఏ గ్రంథాన్నీ చదవటానికి ప్రయత్నించనివాడు, అనాచారాలు, దురాచారాలు చేసేవాడు, బ్రాహ్మణుల, రాజుల, దైవ సంబంధమైన ధనాన్ని అపహరించి, ఆ ధనాన్ని మరో బ్రాహ్మణుడికో, దేవుడికో ఖర్చు పెట్టేవాడు నీచుడు.

**22. ఖలుడు :** నిలువెల్లా విషపూరితమైన నీచగుణాన్ని కలిగిన వాడు, మంచివారిలో దోషాల్ని వెతకటమే ముఖ్య కార్యక్రమంగా పెట్టుకున్నవాడు ఖలుడు.

**23. వాచాలుడు :** చండాలురతో, నీచమైనవారితో బహిరంగంగా సరససల్లాపాలు ఆడేవాడు, ధనహీనుల్ని అపహాస్యం చేసేవాడు, అనవసరంగా ప్రలాపాలు పలికేవాడు వాచాలుడు.

**24. చపలుడు :** మాంసాన్ని తినేవాడు, ఇతరుల భార్యల్ని కోరుకునేవాడు, పక్షుల్ని పెంచి విక్రయించేవాడు, పరులద్రవ్యాల్ని అపహరించేవాడు చపలుడని చెప్పబడతాడు.

**25. మలీనుడు :** శరీరశుద్ధి పాటించనివాడు, నూనెరాసుకుని తలంటుస్నానం చేయనివాడు, నిత్యం అపరిశుభ్రమైన వస్త్రాలను ధరించేవాడు మలీనుడు.

**26. స్తేయి :** తల్లితండ్రుల్ని పోషించనివాడు, గురువుల్ని ఏమాత్రం గౌరవించని వాడు, దొంగతనాల్ని అధికంగా చేసేవాడు 'స్తేయి' అని పిలువబడతాడు.

పై తెలిపిన ఇరవై ఆరూ మహాదోషాలుగా చెప్పబడ్డాయి. ఈ దోషాలు స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తాయి. దైవానుగ్రహాన్ని, మోక్షాన్ని పొందాలనుకునేవారు ఈ దోషాలేవీ లేకుండా ధర్మబద్ధమైన ప్రవర్తన కలిగి వుండాలి.

## తల్లి - తండ్రి - గురువు

మానవులలో త్రిమూర్తులలాంటివారు తల్లి తండ్రి గురువులు. వీరే మార్గదర్శకులు. ఈ ముగ్గురిలో తల్లిస్థానం చాలాగొప్పది. తరువాత తండ్రి. ఇతడు నాలుగు వర్ణాల వారికీ ఉత్తమ సహాయకుడు. తండ్రిని మించిన బంధువు మరొకడు వుండడు. అందుకే తండ్రి స్థానం కూడా ఎంతో గొప్పదని చెప్పబడింది. అలాగే జ్ఞానాన్ని బోధించే గురువు కూడా గౌరవనీయుడే. తండ్రి తరువాత కుటుంబంలో అన్న పూజనీయుడు.

సంక్రాంతి, అమావాస్య,ద్వాదశి, పౌర్ణమి వంటి పర్వదినాల్లో వీరందరినీ పూజించి, దక్షిణ తాంబూలాలతో సంతృప్తి పరచాలి. అలాగే ఎంతో పవిత్రమైన ఉత్తరాయణ దక్షిణాయన కాలాల్లో, విషువ సంక్రాంతి, సూర్య, చంద్ర గ్రహాలు సంభవించినప్పుడు వీరికి ఆనందంగా భోజనం పెట్టాలి.

పితరోజయంతీహ పితరః పాలయంతి చ ।
పితరోఁబ్రహ్మ రూపాహితేభ్యో నిత్యం నమోనమః ॥ 1
యస్మాద్విజయతే లోక స్తస్మాద్ధర్మః ప్రవర్తతే ।
నమస్తుభ్యం పితః సాక్షాత్ బ్రహ్మరూపనమోఽస్తుతే ॥ 2

యాకుక్షి వికరేకృత్వా స్వయం రక్షతి సర్వతః ।
నమామి జననీం దేవీం పరాంప్రకృతి రూపిణీం ॥ 3

కృచ్ఛ్రేణ మహతాదేవ్యా ధారితోఽహం యథోదరే ।
త్వత్ప్రసాదాత్ జగద్దృష్టం మాతార్నిత్యం నమోఽస్తుతే ॥ 4

పృథివ్యాంయాని తీర్థాని సాగరాదీని సర్వశః ।
వసంతి మంత్ర తాంనేమి మాతరం భూతి హేతవే ॥ 5

గురుదేవ ప్రసాదేన అబ్ధా విద్యాయశస్కరీ ।
శివరూప నమస్తస్మై సంసారార్ణవ సేతవే ॥ 6

వేదవేదాంగ శాస్త్రాణాం తత్త్వం యత్ర ప్రతిష్ఠితమ్ ।
ఆధారః సర్వభూతానాం అగ్రజన్మన్ నమోఽస్తుతే ॥ 7

బ్రాహ్మణో జగతాం తీర్థం పావనం పరమం యతః ।
భూదేవ హరమేపాపం విష్ణురూపిన్ నమోఽస్తుతే ॥

*(మధ్యమఖండం-అధ్యా 16, శ్లో 6-13)*

ఈ విధంగా పై స్తోత్రాన్ని భక్తిగా పఠించి తల్లి, తండ్రి, గురువు, అన్నల్ని పూజించాలి. వీరికి శ్రద్ధగా నమస్కరిస్తే సర్వతీర్థాలనీ సేవించిన ఫలం లభిస్తుంది. వీరితోపాటు అందరికీ ఆచార్యుడైన బ్రహ్మనీ, తండ్రి సమానుడైన ప్రజాపతిని, తల్లి సమానురాలైన భూమాతనీ పూజించి నమస్కరించాలి.

తండ్రి మేరుపర్వతంలాంటివాడు, ధర్మస్వరూపుడు, ప్రత్యక్షదైవం. ఆయన ఆజ్ఞని యోగ్యులైనవారు పాటించాలి. అదే ధర్మం. వీరితోపాటు పితామహుల్ని, ప్రపితామహుల్ని (తాత-ముత్తాతల్ని) కూడా గౌరవించాలి. వారు జీవించి లేకపోతే మనసులో భక్తిగా స్మరించాలి. ఇలా వీరందరిని పూజిస్తే, గౌరవిస్తే వచ్చే పుణ్యం ఎంతదో చెప్పలేము.

## హోమకుండాలు

దేవతల్ని సంతృప్తి పరచటానికి హోమాలు యజ్ఞయాగాలు చేయాలి. వీటికి కుండాలు అవసరం. హోమకుండాలు 1.చతురస్ర 2.వృత్త 3.పద్మ

4.అర్ధచంద్ర 5.యోని 6.చంద్రాకార 7.పంచకోణ8.సప్త(ఏడు)కోణ 9.అష్టకోణ 10.నవకోణా అని పదిరకాలుగా వుంటాయి. కామ్యాన్ని అనుసరించి వీటిలో ఆ కామ్యానికి తగిన హోమకుండాన్ని నిర్మించుకోవాలి.

హోమకుండం నిర్మించే స్థలంలో ముందుగా అక్కడున్న గడ్డి, తల వెంట్రుకలు ఇంకా ఏమైనా అపరిశుభ్రవస్తువులుంటే వాటిని శుభ్రపరచాలి. తరువాత ఆ నేలమీద భస్మాన్ని చల్లి నిప్పుల్ని చుట్టూ తిప్పి పవిత్రం చేయాలి. తరువాత ఆ నేలని కొంచెం త్రవ్వి అందులో నవధాన్యాల్ని వేసి పూడ్చాలి. ఒకవారం రోజుల తర్వాత కుండం నిర్మించటానికి తగిన కొలతలతో గోయిని త్రవ్వాలి. కొలతల కోసం పసుపుకుంకుమతో పవిత్రం చేసిన దారాన్ని ఉపయోగించాలి. సాధకుల కామ్యాన్ని అనుసరించి కుండాలున్నట్టుగానే వాటి మేఖలలు, హోమంలో వేసే ఆహుతుల సంఖ్య కూడా విభిన్నంగానే వుంటాయి.

ఈ కుండాలకి కొన్ని సంస్కారాలు చెప్పారు. శాస్త్రంలో చెప్పిన విధంగా ఆ సంస్కారాల్ని పూర్తి చేసిన తరువాతే కుండంలో హోమం చేయాలి. కామ్య హోమాలు కాక శాంతి హోమాలు కూడా వుంటాయి. వీటిని భయంకరమైన ఉత్పాతాలు నేలమీద, అంతరిక్షంలో జరిగినప్పుడు చేయాలి. అసలు ఉత్పాతాలనేవి ఏ లోకంలో ఎక్కడ జరిగినా దానికి కారణం గ్రహాలే కనుక ఉప్పాతాల నివారణ కోసం గ్రహాలకు శాంతిపూజ శాంతిహోమాలు జరిపించాలి.

## ఆహుతులు

సాధారణంగా ఏ హోమాన్ని చేసినా యాభై ఆహుతుల్ని సమర్పించటం సామాన్యం. చేసే హోమాన్ని, యాగాన్ని బట్టి వంద వేయి, పదివేలు, లక్ష, కోటి ఇలా ఆహుతుల సంఖ్య మారిపోతూవుంటుంది. హోమం చేసేవాడు అగ్ని ఆహరణాది 18సంస్కారాలని చేసి హోమకుండాన్ని స్థాపించాలి. స్త్రీ, శూద్రుడు కాకుండా, పవిత్రమైన వ్యక్తి చేత మాత్రమే అగ్నిని తెప్పించాలి. ఆ తరువాత తెచ్చిన అగ్ని కూడాకి సంస్కారాలు చేయాలి. ఆ అగ్నిని ఎదురుగా వుంచుకుని 'రం' అనే అగ్ని బీజాన్ని 'శం' అనే శివబీజాన్ని ఉచ్చరించి అగ్నిని ప్రోక్షించాలి. ఇలా చేసాక శివుణ్ణి, శక్తిని ధ్యానించాలి. ఇలా చేయటం వల్ల

ఇష్టసిద్ధి కలుగుతుంది. తరువాత గాలిని వీయింపచేస్తూ (విసనకర్రద్వారా) అగ్నిని ప్రజ్వలింపచేయాలి. అగ్నిని షోడశోపచారాలతో పూజించాలి. "చిత్పింగళ దహ దహ పచ పచ సర్వజ్ఞా ఆజ్ఞాపయ స్వాహా' అనే మంత్రాన్ని ఉచ్చరించాలి.

అగ్నిదేవుడికి పూర్వం మూడు జిహ్వా వుండేవి. 1.హిరణా 2.కనకా 3.కృష్ణా అని. వీటిని యజ్ఞదత్తుడనే ఋషి పేర్కొన్నాడు. తదనంతరకాలంలో అగ్నికి 1.విశ్వమూర్తి 2.స్ఫులంగిని 3.ధూమ్రవర్ణా 4.మనోజవా 5.లోహితాస్యా 6.కరాలాస్యా 7.కాళీ అని ఏడు జిహ్వాలు చెప్పబడ్డాయి. ఈ రకంగా మొత్తం అగ్ని జిహ్వాలు పది అవుతున్నాయి.

ఆజ్యంతో హోమం చేసేడప్పుడు హోమకుండంలో త్రిమధురాలు (పాలు, పంచదార, తేనె) హవనం చేస్తే కర్ణికా అనే అగ్ని జిహ్వా ఆవిర్భవిస్తుంది. అలాగే పాలని హవనం చేస్తే 'రక్తజిహ్వా', నేయి హోమం చేస్తే 'ప్రభా', పూలని హవనం చేస్తే 'బహురూపా', అన్నం పాయసం హవనం చేస్తే 'కష్ణా' చెఱుకు రసంతో హెూమం చేస్తే 'పద్మరాగా', పద్మాలతో హోమం చేస్తే 'సువర్ణలోహితా', బిల్వపత్రాల్ని హవనం చేస్తే 'శ్వేతా', నువ్వులతో హోమం చేస్తే 'ధూమినీ', కాష్ఠహోమం చేస్తే 'కరాళికా', పితృహోమం ద్వారా 'లోహితాస్యా' దేవహోమం నుంచి 'మనోజవా' అనే అగ్నిజిహ్వాలు ఆవిర్భవిస్తాయి. ఏ యాగంలోనైనా సమిధల్ని ఆహుతులు ఇచ్చేడప్పుడు ఆ సమిధుల్లో 'వైశ్వానర' అనే పేరుతో అగ్నిదేవుడు కొలువుంటాడు.

స్పష్టంగా మంత్రాన్ని ఉచ్చరిస్తూ అగ్నికి ఆహుతుల్ని సమర్పించాలి. కుండం మధ్యలోనే సరిగా ఆహుతులు పడాలి. జ్వాలలు ఎగసి పడుతున్నాయనో వేడి బాగావుందనో ఆహుతుల్ని కుండ మూలల్లో వేయకూడదు. ఇలా శాస్త్రబద్ధంగా చేసే హవనం ద్వారా హోమకుండం నుంచి పవిత్రమైన ధూమం వెలువడుతుంది. ఆ ధూమమే పర్యావరణానికి ఎంతో మేలు చేస్తుంది.

అగ్నిజిహ్వాలు ముక్కలు ముక్కలుగా ఛిన్నాభిన్నంగా వుండకూడదు. దానివల్ల యజమానికి అరిష్టం ప్రాప్తిస్తుంది. అలాగే అగ్నికుండంలో ఆరిపోయినా, పొగ విపరీతంగా వస్తున్నా అరిష్టంగా భావించాలి. ఈ విధంగా

జరిగినప్పుడు ప్రధానహోమాన్ని ఆపేసి, 18 ఆహుతుల్ని నేతితో ప్రాయశ్చిత్తంగా సమర్పించాలి. తరువాత విప్రులకి భోజనం పెట్టాలి. తిరిగి 50 ఆహుతుల్ని నేతితో మూల మంత్రాన్ని పఠిస్తూ సమర్పించాలి. ఆ తరువాతే ప్రధాన హోమాన్ని చేయటం ప్రారంభించాలి.

## వాస్తుపూజ

**వాస్తుపురుషుడు :** పూర్వం అంధకాసురుణ్ణి సంహరించిన తరువాత పరమేశ్వరుడి శరీరం నుంచి చెమట బిందువొకటి రాలిపడింది. ఆ బిందువు నుంచి మహాభీకర స్వరూపంతో ఒక రాక్షసుడు ఆవిర్భవించాడు. వచ్చినవాడు వచ్చినట్టే ముల్లోకాలనీ భక్షించటానికి బయలు దేరాడు. దాంతో కంగారుపడ్డ దేవతలంతా శంకరుడి దగ్గరకి బయలుదేరారు. శంకరుడు ఆ దేవతలందరితో కలిసి ఆ భీకరాకారుణ్ణి బుజ్జగించి శాంతపరిచారు. అతన్ని కూడా పూజలందుకునే ఒక దేవతగా మారుస్తామని మాటిచ్చారు. దానితో అతడు శాంతించాడు. కొంతకాలానికి ఇచ్చినమాట ప్రకారం దేవతలందరూ తమ తమ అంశలతో అతడి శరీరంలో ప్రవేశించి అక్కడే నివసించసాగారు. అంతేకాదు. తమ అంశలు అతడి శరీరంలో వున్న కారణంగా ఆనాటి నుంచి ఆ భీకరాకారుడు 'వాస్తుపురుషుడు' అనే పేరుతో విఖ్యాతి చెంది సకలజనుల పూజలందుకుంటాడు అనే వరాన్ని కూడా ప్రసాదించారు.

**వాస్తుపూజ :** వాస్తుపూజలో భాగంగా ముందు వాస్తుమండలాన్ని లిఖించాలి. భూమిలో కొన్ని అంకురాల్ని నాటి అవి మొలకెత్తే విధానాన్ని పరిశీలించాలి. అది ఉత్తమ భూమి అని అనిపించాక దాని మధ్యలో వాస్తు మండలాన్ని నిర్మించాలి. ఈ వాస్తు మండలంలో 1.శిఖి 2.పర్జన్య 3.జయంత 4.కులిశాయుధ 5.సూర్య 6.సత్య 7.వృష 8.ఆకాశ 9.వాయు 10.పుష్ప 11.వితథ 12.గుహ 13.యమ 14.గంధర్వ 15.మృగరాజ 16.మృగ 17.పితృగణ 18.దౌవారిక 19.సుగ్రీవ 20.పుష్పదంత 21.వరుణ 22.అసుర 23.పశు 24.పాశ 25.రోగ 26.అహి 27.మోక్ష 28.భల్లాట 29.సోమ 30.సర్ప 31.అదితి 32.దితి 33.అప్ 34.సావిత్ర 35.జయ 36.రుద్ర 37.అర్యమ

38.సవిత 39.వివస్వాన్ 40.విబుధాధిప 41.మిత్ర 42.రాజయక్ష్మ 43.పృధ్వీధర 44.ఆపవత్స 45.బ్రహ్మ అనే దేవతల్ని స్థాపించి పూజించాలి.

ఈ దేవతలతోపాటు వాస్తు మండలానికి బైట ఈశాన్యభాగంలో చరుడిని, ఆగ్నేయదిశలో విదారిని, నైరృతి దిశలో పూతనని, వాయువ్యదిశలో పాపరాక్షసిని స్థాపించాలి. అదేవిధంగా వాస్తుమండలానికి తూర్పు దిశలో స్కందుణ్ణి, దక్షిణ దిశలో అర్యముడిని, పశ్చిమదిశలో జృంభకని, ఉత్తరాన పిలిపిచ్ఛని స్థాపించాలి. ఈ విధంగా మొత్తం వాస్తుమండలంలో 53 మంది దేవీదేవతలు స్థాపించబడి వుంటారు. వీరందరినీ వేరు వేరు మంత్రాలతో అర్చించాలి.

వాస్తుమండలానికి బైట తూర్పునించి వరుసగా పది దిక్కుల్లో ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్రృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, బ్రహ్మదేవుడు, అనంతుడిని స్థాపించి వారికి పూజలు చేసి విధి విధానంగా నైవేద్యాల్ని సమర్పించాలి. ఈ విధంగా శాస్త్రపద్ధతిలో పురోహితుడి ద్వారా వాస్తుమండలాన్ని నిర్మించి పూజాదికాలు నిర్వహించాలి. తరువాత విధిగా వాస్తుహోమాన్ని చేయాలి. వాస్తు హోమంలో భాగంగా హోమకుండాన్ని, ఒక వాస్తు వేదికను ఏర్పాటుచేయాలి. వాస్తు మండలానికి ఈశాన్యభాగంలో ఒక కలశాన్ని స్థాపించాలి.

వాస్తు కలశం చాలా పవిత్రమైనది. ఆ కలశంలో – పర్వత శిఖరం, ఏనుగుశాల, పుట్ట, నదీసంగమం, రాజద్వారం, నాలుగు దారుల కూడలి, దర్భల మూలప్రదేశం అనే ఏడుచోట్ల నుంచి తెచ్చిన మట్టిని వేయాలి. ఆ తరువాత ఆ కలశంలో ఇంద్రవల్లి, విష్ణుక్రాంత, అమృతి, త్రపుష, మాలతి, చంపక, ఉర్వారుక(దోస)అనే ద్రవ్యాలని, వనస్పతుల్ని వేయాలి. వేపాకులతో ఆ కలశ కంఠాన్ని చుట్టు కలశ ముఖభాగాన్ని పంచపల్లవాలతో సర్పాకారంలో కప్పాలి. ఆ కలశం మీద మారేడు కాయ, జామకాయ, కొబ్బరికాయ, దానిమ్మ, ఉసిరి, నేరేడు ఫలాలని ఉంచాలి. కలశంలో బంగారాన్ని, ఐదురకాల రత్నాలని వేయాలి.

ఈవిధంగా అలంకరించిన కలశంలోకి పవిత్రమైన జలాన్ని పోసి కలశంలోకి వరుణ దేవుణ్ణి ఆవాహనచేయాలి. కలశాన్ని తాకి సప్తసముద్రాలని, గంగా యమున వంటి పవిత్రనదుల్ని ఆ కలశంలోకి ఆవాహన చేయాలి.

ఇలా కలశాన్ని స్థాపించిన తరువాత వాస్తుహోమం కోసం ఏర్పాటు చేసిన కుండలో నువ్వులు, బియ్యం, నెయ్యి తేనె కలిపిన అన్నం, పాలు, పెరుగు వంటి ద్రవ్యాలతో యథావిధిగా వాస్తు హోమాన్ని నిర్వర్తించాలి. వాస్తు హోమం జరిగే సమయంలో అదే ప్రాంగణంలో వాస్తు దేవతా మంత్రాన్ని జపం చేయాలి. వాస్తుహోమానంతరం వాస్తు మండలం స్థాపించిన దేవతలందరికీ పాయసాన్నంతో విడివిడిగా నైవేద్యం పెట్టాలి. వాస్తుపురుషుడు సంతృప్తి చెంది సకల శుభాలనీ యజమానికి ప్రసాదించాలంటే పరమేశ్వరుడు విష్ణువుని గురించి చేసిన ఈ దివ్య స్తుతిని భక్తిగా పఠించాలి.

## శివకృత విష్ణు స్తుతి

విష్ణుర్విష్ణుర్విభుర్యజ్ఞో యజ్ఞియో యజ్ఞపాలకః ।
నారాయణో నరోహంసో విష్వక్సేనో హుతాశనః ॥ 1

యజ్ఞేశః పుండరీకాక్షః, కృష్ణః సూర్యః సురార్చితః ।
ఆదిదేవో జగత్కర్తా మండలేశో మహీధరః ॥ 2

పద్మనాభోహృషీకేశో దౌతాదామోదరో హరిః ।
త్రివిక్రమ స్త్రిలోకేశో బ్రహ్మణః ప్రీతివర్ధనః ॥ 3

భక్తప్రియోఽచ్యుతః సత్యః సత్యవాక్యోధ్రువః శుచిః ।
సన్యాసీశాస్త్ర తత్త్వజ్ఞః త్రిపంచాశద్గుణాత్మకః ॥ 4

విదారీ వినయః శాంతః తపస్వీవైద్యుతః ప్రభః ।
యజ్ఞస్త్వంహి వషట్కారః త్వమోంకార స్త్వమగ్నయః ॥ 5

త్వం స్వధా త్వంహిస్వాహా! త్వంసుధాచ పురుషోత్తమ ।
నమోదేవాది దేవాయ విష్ణవేశాశ్వతాయ చ ।
అనంతాయాప్రమేయాయ నమస్తే గరుడ ధ్వజ ॥ 6

*(మధ్యమ-అధ్యా 13)*

సాక్షాత్తు పరమేశ్వరుడు చేసిన ఈ విష్ణుస్తుతి మహిమాన్వితమైనది. దీన్ని కేవలం వాస్తుపూజప్పుడే కాదు. ఇతర సమయాల్లో చదివినా నారాయణానుగ్రహంతో సకల శుభాలూ కలుగుతాయి.

వాస్తుహోమం పూర్తయిన తరువాత యజమాని హోమాన్ని, పూజని నిర్వర్తించిన ఆచార్యుడికి మంచి ఆవుని బంగారంతో కూడిన దక్షిణని ఇవ్వాలి. ఆయనతో పాటు సహాయకులుగా వచ్చిన పరివారానికి కూడా దక్షిణ తాంబూల వస్త్రాలని సమర్పించాలి. దక్షిణ స్వీకరించిన విప్రులు వాస్తు కలశంలోని పవిత్రజలంతో యజమానిని అభిషేకించాలి. తరువాత హోమానికి పూర్ణాహుతి చేసి, సూర్యుడికి అర్ఘ్యాలు సమర్పించాలి. మొత్తం కార్యక్రమం పూర్తయిన తరువాత బ్రాహ్మణులకి సంతృప్తిగా భోజనాలు ఏర్పాటు చేయాలి. యథా శక్తి బీదలకి కూడా అన్నదానం చేసి చివరగా తను తన పరివారం భుజించాలి. ఆరోజు భోజనంలో నిషిద్ధ పదార్థాలని (వేపుడు కూరలు–ఉల్లిపాయ) వాడకూడదు.

## దివ్య అంతరిక్ష, భౌమ ఉత్పాతాలు - శాంతులు

ఉత్పాతాలు అనేవి మూడు రకాలుగా సంభవిస్తాయి. అవి ఎప్పుడు ఎందుకు కలుగుతాయో ఎవరికీ తెలియదు. గ్రహాల సమతుల్యత దెబ్బతిన్నప్పుడు ఈ ఉత్పాతాలు సాధారణంగా ఏర్పడతాయి. ఇవి 1. దివ్య ఉత్పాతాలు–గ్రహాల వల్ల, నక్షత్రాల అసమతుల్యత వల్ల, పరస్పరం వ్యతిరేకదిశలో అవి పయనించటం వల్ల ఏర్పడేవి. 2. అంతరిక్ష ఉత్పాతాలు–ఉల్కాపాతాలు ఆకాశంలో దివ్యదృశ్యాలు, భయానక దృశ్యాలు కనబడటం, సూర్యచంద్రుల చుట్టూ మంటలు వ్యాపించినట్టు కనిపించటం,అతివృష్టి, అనావృష్టి, లాంటివి అంతరిక్షం ద్వారా ఏర్పడే ఉత్పాతాలు. 3. భౌమ ఉత్పాతాలు – అకస్మాత్తుగా భూమి కంపించటం, జలాశయాలు, సముద్రాలు ఒక్కసారిగా ఉప్పొంగటం వంటివి భౌమ ఉత్పాతాలని చెప్పబడతాయి. ఈ ఉత్పాతాల ప్రభావం సాధారణంగా ఒకవారం రోజుల పాటు వుంటుంది. వాటికి గనక తగిన శాంతి చేయకపోతే ఎంతో అశాంతి అలజడి సంభవిస్తుంది.

దేవతల విగ్రహాలు నవ్వటం, రక్తం వాటినుంచి కారటం, మబ్బులు లేకుండా అకస్మాత్తుగా ఉరుములు, పిడుగులతో వానకురవటం, పాములన్నీ పైకి పాకుతుండటం ఇలాంటివన్నీ దివ్య ఉత్పాతాలు. మేఘాలనుంచి కురిసేవాన ఒక వారం రోజుల పాటు కేవలం కొండలమీదే వర్షించి నేలమీద ఏ కొంచెం కూడా వర్షించకపోవటం లాంటివి సంభవిస్తాయి.

**1. సూర్యగ్రహ జన్య ఉత్పాతాలు :** ఒకేరాశి మీద, శని, కుజ సూర్యగ్రహాలు నిలబడితే ఆ సమయంలో భూమిలోంచి సెగలు బైటికి వచ్చి అత్యధికంగా జననష్టం కలుగుతుంది. బృహస్పతి తనరాశి నుంచి అత్యంత వేగంగా ముందుకు వెళ్ళిపోతే రాజ్యనష్టం జరుగుతుంది. పట్టపగలు సూర్యుడు కనిపించకుండా, తోకచుక్కలు దర్శనమిస్తే పెద్ద అరిష్టం. దీనివల్ల ఎన్నో ఉపద్రవాలు సంభవిస్తాయి. తీవ్రమైన కరువుకాటకాలు ఏర్పడతాయి. ఇవన్నీ నివారించబడటానికి "ఆకృష్ణేనరజసా" అనే సూర్యగ్రహ మంత్రంతో హవనం చేయాలి. పండేభూమి ఒక్కసారిగా నిస్సారమైపోవటం, నూతుల్లో నీరు ఉన్నట్టుండి ఎండిపోవటం లాంటివన్నీ సూర్యజనిత ఉత్పాతాలు. ఆ సమయంలో శాంతికోసం వేయి కలువ పూలతో సూర్యుడికి ఆహుతుల్ని సమర్పించాలి.

వికృతంగా వున్న పక్షి, పాలిపోయినట్టున్న పావురం, తెల్లని గుడ్లగూబ, బాగా నల్లగా వున్న కాకి వంటివి ఇంట్లోకి వచ్చి చనిపోతే ఆ ఇంటికేదో అరిష్టం జరగబోతోందని సూచన. మెడలో ధరించిన హారాలు, మాలలు వాటంతట అవే కదిలిపోతూ చిక్కుకపోతున్నా అప్పుడే పుట్టిన బాలుడుకి దంతాలు మొలిచినా, దేవతా విగ్రహాలు నవ్వుతున్నట్టు కనిపించినా, ఆ విగ్రహాలకి చెమట పట్టినట్టు అనిపించినా, ఇంట్లోగానీ, గొడ్లచావిడిలోగానీ పాములేక కప్ప ప్రసవించినా ఆ ఇంటి ఇల్లాలికి ఆరునెలల్లో మరణ గండం సంభవించవచ్చు. అలాగే ఇంటిముందున్న పచ్చటి చెట్టుమీద పిడుగుపడితే కూడా అరిష్టమే. వీటి శాంతికోసం నువ్వులు, పాయసంతో సూర్యభగవానుడికి వెయ్యి ఆహుతుల్ని హోమంలో సమర్పించాలి. గోదానం చెయ్యాలి.

**2. సోమగ్రహ జన్య ఉత్పాతాలు :** ఒక చెట్టుకి మరో చెట్టుకి సంబంధించిన పూలు పూసినా, కాయలు కాసినా, అది సోమగ్రహం వల్ల సంభవించిన ఉత్పాతం అని తెలుసుకోవాలి. అలాగే తాటిచెట్టు పోకచెట్టు ఒకేసారి ఇంటి ఆవరణలో మొలిచినా వారికి అరిష్టమే. ఈ ఉత్పాతాల శాంతికోసం సోమవారంనాడు పెరుగు, తేనె, నెయ్యి, ఫలాలతో, ఆకులతో "ఇమందేవా" అనే మంత్రాన్ని పఠిస్తూ, వెయ్యిసార్లు హోమం చేయాలి. హోమంలో చరువుని కూడా వినియోగించాలి.

**3. కుజగ్రహ జన్య ఉత్పాతాలు :** అకస్మాత్తుగా ఇంట్లో మంటలు వ్యాపించినా, మబ్బులు లేకుండా ఆకాశంలో మెరుపులు కనిపించినా, ఇంట్లోవారు పశువులతో సహా అనారోగ్యం పాలైనా, పాలు, పెరుగు, నెయ్యి, వండిన పదార్థాలలో రక్తం కనిపించినా, అవి కుజగ్రహం ద్వారా సంభవించిన ఉత్పాతాలని తెలుసుకోవాలి. వీటి శాంతికోసం పెరుగు, తేనె, నెయ్యిలను ఉపయోగించి, 'అగ్నిర్మూర్ధా' అనే యజుర్వేద మంత్రంతో పదివేలసార్లు కుజుడి అనుగ్రహంకోసం ఆహుతులివ్వాలి. తరువాత ముగ్గురు బ్రాహ్మణులకి భోజనం పెట్టి, తాంబూలం దక్షిణ, ఎర్రని వస్త్రాలు సమర్పించాలి. అలాగే బంగారం లేక రాగితో చేసిన కుజుడి ప్రతిమను వారికే దానమివ్వాలి. దీనివల్ల ఉత్పాతాలు శమిస్తాయి.

**4. బుధగ్రహజన్య ఉత్పాతాలు :** ఇంట్లో వున్న స్త్రీలు అకారణంగా భయాలతో కృంగిపోతున్నా, ఉన్నట్టుండి ఇంటి యజమాని విరాగిగామారిపోయినా, ఇంట్లోని పశువులు ఊరికే గొంతెత్తి అరుస్తున్నా, ఎవరూ తోలకుండానే ఆవులు, గేదెలూ తోకెత్తి పరుగులు తీస్తున్నా, కుక్కలు, పందులూ ఇళ్ళపైకి ఎక్కుతున్నా, ఇవన్నీ బుధగ్రహం ద్వారా సంభవించిన ఉత్పాతాలని గ్రహించాలి. వీటిశాంతి కోసం బుధవారంనాడు బుధగ్రహాన్ని ఉద్దేశించి పెరుగు, తేనె, నెయ్యి ఉపయోగించి అపామార్గం (ఉత్తరేణి) సమిధలతో హోమం చేయాలి. హోమంలో 'ఉద్బుధ్యస్వ' అనే యజుర్వేద మంత్రాన్ని పఠిస్తూ చరువుతో పదివేల సార్లు హోమం చేయాలి. హోమానంతరం బంగారంతో చేసిన బుధుడి ప్రతిమను, ఒక పాలిచ్చే ఆవుని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. తద్వారా ఉత్పాతాలు శమిస్తాయి.

**5. గురుగ్రహ జన్యఉత్పాతాలు :** పిల్లులు, కప్పలు ఇంట్లోని నేలను గోళ్ళతో గీకటం, అవి ఇంటిపైకి ఎక్కటానికి ప్రయత్నించటం, కాలం కాని కాలంలో పశువులు సంగమించటం, అకస్మాత్తుగా ధాన్యరాశి తరిగిపోవం, బిల్వవృక్షంమీద ఆడగ్రద్ధ, మగగ్రద్ధ ఒకేసారి వాలి కనిపించటం వంటి దోషాలన్నీ అరిష్ట సూచకాలే. ఇవి కనిపించిన ఇల్లు నాశనమైపోతుంది. కుటుంబంలో అకాలమరణాలు సంభవిస్తాయి. ఇవన్నీ బృహస్పతి గ్రహదోషం వల్ల సంభవించే ఉత్పాతాలు. ఇవి శాంతించాలంటే విధి విధానంగా "బృహస్పతే అతియ" అనే మంత్రంతో శాంతిహోమాన్ని జరిపించాలి. తరువాత విప్రులకి భోజనదక్షిణ తాంబూలాలనిచ్చి, వాటితోపాటు బంగారంతో చేసిన బృహస్పతి ప్రతిమని కూడా దానమివ్వాలి.

**6. శుక్రగ్రహజన్య ఉత్పాతాలు :** రాగి, కంచు, ఇనుము, గాజు వంటి వస్తువులు ఇంట్లో లేకపోయినప్పటికీ ఉన్నట్టుగా కనిపించినా, కుండల్లో బిందెల్లో ఉన్న నీళ్ళని రాక్షసులు త్రాగేస్తున్నట్టుగా కనిపించినా, పళ్ళమీద పళ్ళు మొలిచినా, పూలకుండీలలోనించీ, పాత్రలలోనించీ మేఘ గర్జనలు వినిపించినా ఇంటి యజమానికి వ్యాధులు కలుగుతాయి. ఆ ఇంట్లో వారందరికీ అశాంతి పెరిగిపోతుంది. ఇవన్నీ శుక్రగ్రహం ద్వారా సంభవించే ఉత్పాతాలు. వీటిని శాంతి పరచాలంటే శుక్రవారం నాడు పెరుగు, తేనెలో జమ్మిఆకుల్ని ముంచి వాటితో యథాశక్తి హనవం చేయాలి. హోమం చేసేడప్పుడు 'శుక్రంతేఅన్యత్' అనే యజుర్వేద మంత్రాన్ని పఠించాలి. హోమానంతరం విప్రుడికి తెల్లని వస్త్రాలతో పాటు, తెల్లని ఆవుని బంగారంతో చేసిన శుక్రుడి ప్రతిమని దానం చేయాలి. తద్వారా ఉత్పాతాలు శమిస్తాయి.

**7. శనిగ్రహజన్య ఉత్పాతాలు :** పశువులు, గుర్రాలు ఊరికే నగరంలో పరుగులు పెడుతున్నా, ఆలయంలోని భూమి ఎర్రనిరంగులో కనపడినా, ఉన్నట్టుండి అక్కడి నేలలోంచి పుష్పాలు పుట్టినా, ప్రేతాత్మలు, పిశాచాలు వంటివి నగరాల్లో సంచరిస్తూ బీభత్సం సృష్టిస్తున్నా, ప్రజలంతా ఎంతో ఆందోళనకు గురౌతున్నా ఎన్నో అశుభాలు జరుగుతాయి. రాజుకి గండం వుంటుంది. ధననష్టం విపరీతంగా జరుగుతుంది. ఇలా జరిగే ఉత్పాతాలన్నీ శనిగ్రహం కారణంగా సంభవిస్తాయి. ఇవి శాంతించాలంటే శనివారం నాడు శనైశ్చరుడిని ఉద్దేశించి 'శమగ్నిరగ్నిభి' అనే మంత్రంతో హోమం చేయాలి. నువ్వుల్ని చరువుని ఉపయోగించి పదివేల ఆహుతుల్ని ఇవ్వాలి. హోమానంతరం నల్లని దూడతో వున్న ఆవును రెండు నల్లని వస్త్రాలను బంగారం వెండితో సహా విప్రుడికి దానమివ్వాలి. అలాగే ఇనుముతో చేయించిన శని ప్రతిమని కూడా అతడికే సమర్పించాలి.

**8. రాహుగ్రహజన్య ఉత్పాతాలు :** ఇంద్రధనుస్సు నేలమీద పడిపోయినట్టు కనిపించినా, పగలు నక్కలు, రాత్రిపూట గుడ్లగూబలు రోదిస్తున్నట్టు వినిపించినా, గాలి లేకుండానే చెట్లు ఊగినట్టు అనిపించినా, మేఘాలు లేకుండా ఆకాశంనుంచి ఎర్రని పచ్చని శిలలు వర్షంగా కురిసినా, నీళ్ళలో మంటలు

లేచినట్లు కనిపించినా, ఆకాశంలో పొగలు వ్యాపించినా, కాలంకాని కాలంలో చెట్లకి పళ్ళు పూలు కాసినా, దేశంలో ఎన్నో అరిష్టాలు సంభవిస్తాయి. ప్రజల్లో సుఖశాంతులు నశిస్తాయి. భయం, ఆందోళన పెరిగిపోతాయి. వాహనాలు వాటంతటవే ధ్వంసమైపోతాయి. ఇవన్నీ రాహుగ్రహ దోషం వల్ల కలిగే ఉత్పాతాలు. ఇవి శాంతించాలంటే పెరుగు, తేనె, నెయ్యి, గరిక, అక్షతలతో ఆదివారం నాడు రాహువునుద్దేశించి హోమం చేయాలి. 'కయానశ్చిత' అనే మంత్రాన్ని పఠిస్తూ పదివేల ఆహుతుల్ని సమర్పించాలి. హోమానంతరం పాలిస్తున్న నల్లని ఆవుని నువ్వుల్ని, శంఖాన్ని రెండు వస్త్రాల్ని విప్రుడికి దానమివ్వాలి. ఇలా చేస్తే ఉపద్రవాలు శమిస్తాయి.

**9. కేతుగ్రహ జన్యఉత్పాతాలు :** అకస్మాత్తుగా తాటిచెట్టు సాలవృక్షం, ఖదిర, అక్ష, కమలాది వృక్షాలు ఇంట్లో మొలిస్తే ఆ ఇంటికి ఎంతో అరిష్టం. ఇంటి యజమానికి ప్రాణ గండం. ఇది కేతుగ్రహం వల్ల సంభవించే ఉత్పాతం. దీని శాంతి కోసం 'త్ర్యంబకం యజామహే' అను మంత్రాన్ని పఠిస్తూ పెరుగు తేనె నెయ్యిలతో వెయ్యి ఆహుతుల్ని సమర్పించాలి. హోమానంతరం నల్లని దూడతో వున్న ఆవును, రెండు వస్త్రాలను, కేతుగ్రహ ప్రతిమనీ విప్రుడికి దానం చేయాలి.

**10. ఇంద్ర-సూర్య జన్యఉత్పాతాలు :** అగ్నిజ్వాలలు వెదజల్లుతూ ఆకాశంలో తోకచుక్కలు కనిపిస్తే, నేలబీటలు వారి పోతుంటే, రాజ్యంలో కరువు కాటకాలు సంభవిస్తే కాకులు, గ్రద్దలు, నక్కలు, కుక్కలు భయంకరంగా అరుస్తుంటే, ప్రజలందరికీ ఉన్నట్టుండి మృత్యుభయం కలుగుతుంటే ఇవన్నీ సూర్య-ఇంద్రుల వల్ల సంభవించిన ఉత్పాతాలు అని గ్రహించాలి. వారిద్దరూ శాంతించటం కోసం బంగారు గొడుగుతో ఏడు గుర్రాలతో కూడిన సూర్యుడి స్వర్ణప్రతిమని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. తరువాత సూర్య ఇంద్రమంత్రాలతో హోమం చేయాలి.

**11. ఇతర ఉత్పాతాలు :** నడుస్తున్నప్పుడు దక్షిణ దిక్కులో మన నీడ మన పాదాల దగ్గరికి వచ్చినా, మన నీడలో మనకి రెండు లేక అయిదు తలలు కనిపించినా, ఒకే తల ముక్కలైనట్టు కనిపించినా, ఒకవారంలోనే ప్రాణగండం సంభవించవచ్చు. ఈ ఉత్పాతం శమించటానికి శనిగ్రహ శాంతి చేయాలి.

కళ్ళు చేతులు కాళ్ళు అదిరిపోతూవుంటే చంద్రగ్రహానికి శాంతి చేయాలి. జంధ్యానికీ, పుస్తకాలకీ, చరువుకీ, ఇంద్ర ధ్వజానికీ నిప్పంటుకుంటే సూర్యుడి ప్రీత్యర్థం శాంతి జరిపించాలి. ఇక్కడ చెప్పిన శాంతి కర్మలన్నిటినీ శాస్త్రబద్ధంగా ఆచరిస్తేనే సత్ఫలితాలుంటాయి.

## సత్యయుగం రాజులు

సత్యయుగంలో మొదట జన్మించినవాడు వైవస్వత మనువు. ఆయన సరయూనదీ తీరంలో వంద దివ్య సంవత్సరాలు తపస్సుచేసాడు. అప్పుడు ఆయన నాసిక నుంచి ఇక్ష్వాకుడనే మహారాజు ఆవిర్భవించాడు. ఆ తరువాత బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై మనువుకి దివ్యజ్ఞానాన్ని ఉపదేశించాడు. ఇక్ష్వాకు మహారాజు అరవైమూడువేల సంవత్సరాలు పాలించాడు. ఇతిడి పుత్రుడు 'వికుక్షి'. ఈయన తండ్రికన్నా ఒక వందసంవత్సరాలు తక్కువ కాలం రాజ్య పాలన చేసాడు. వికుక్షికుమారుడు 'కుకుత్థ్సుడు'. ఆయన తరువాత అతడి పుత్రుడు అనేనుడు, అనేనుడి కుమారుడు పృథువు, అతడి పుత్రుడు విష్వగశ్వుడు, అతడి సుతుడు ఆర్ద్రి అతడి కొడుకు భద్రాశ్వుడు, భద్రాశ్వుడి పుత్రుడు యవనాశ్వుడు క్రమంగా భరత ఖండాన్ని పాలించారు.

యవనాశ్వుడి కుమారుడు శ్రావస్తుడు. ఇతడే చరిత్ర ప్రసిద్ధమైన శ్రావస్తి నగరాన్ని నిర్మించాడు. ఆ కాలంలో భారతవర్షంలో ధర్మం నాలుగు పాదాలమీద నడిచేది. ఇలా ఇక్ష్వాకువంశంలో జన్మించిన రాజులందరూ ఈ సమస్త భూమండలాన్నీ ఎంతో ధర్మబద్ధంగా పరిపాలించారు. శ్రావస్తిమహారాజు మొత్తం 35వేల సంవత్సరాలు రాజ్యాన్ని పాలించగా అతడి కుమారుడు బృహదశ్వుడు ఒక వంద సంవత్సరాలు తక్కువగా రాజ్యాన్ని పాలించాడు. బృహదశ్వుడి కుమారుడైన 'కువలయాశ్వుడు' మరో వంద సంవత్సరాలు తండ్రికన్నా తక్కువగా పాలించాడు. కువలయాశ్వుడి సుతుడు 'దృఢాశ్వుడు'. ఇతడు తన తండ్రికన్నా వెయ్యి సంవత్సరాలు తక్కువగా రాజ్యాన్ని పాలించాడు. ఇలా ఎంతోమంది సత్యవంశ రాజులు ధర్మబద్ధంగా అఖండ భూమండలాన్ని పాలించి ధర్మపురుషులుగా కీర్తిగాంచారు.

## సత్యయుగరాజుల వరుస క్రమం

సత్యయుగంలో భూమండలాన్ని పాలించిన రాజులు (తండ్రీకుమారుల) పరంపరని ఈ పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

1.వైవస్వతమనువు 2.ఇక్ష్వాకుమహారాజు 3.వికుక్షి 4.కకుత్థ్సమహారాజు 5.పృధుచక్రవర్తి 6.విష్వగశ్వుడు 7.ఆద్రి 8.భద్రాశ్వుడు 9.యవనాశ్వుడు 10. శ్రావస్తుడు 11.బృహదశ్వుడు 12.కువలయాశ్వుడు 13.దృఢాశ్వుడు 14.నికుంభుడు 15.సంకలాశ్వుడు 16.ప్రసేనజిత్తు 17.రవణాశ్వుడు 18.మాంధాత చక్రవర్తి 19. పురుకుత్సుడు 20.త్రింశదశ్వుడు 21.అనరణ్యుడు 22.పృషదశ్వుడు 23.హర్యశ్వుడు 24.త్రిధన్వుడు 25.త్రయ్యారుణి 26.త్రిశంకు 27.హరిశ్చంద్రుడు 28.రోహితుడు 29.విజయుడు 30.రురూకుడు 31.సగరుడు 32.అసమంజుసుడు 33.అంశుమంతుడు 34.దిలీపుడు 35.భగీరధుడు 36.శ్రుతసేనుడు 37.నాభాగుడు 38.అంబరీషుడు 39.సింధుద్వీపుడు 40.అయుతాశ్వుడు 41.ఋతుపర్ణుడు 42.సర్వకాముడు 43.కల్మాషపాదుడు 44.సుదాసుడు 45.అశ్మకుడు 46.హరివర్మ 47.దశరధుడు 48.దిలీపుడు 49.విశ్వాసహుడు 50.ఖట్వాంగుడు 51.దీర్ఘబాహువు 52.సుదర్శనుడు

సత్యయుగంలో భూమండలాన్ని పాలించిన రాజులలో విష్ణు, శివ, శక్తి భక్తులున్నారు. ఇక్ష్వాకు మహారాజునుంచి రురూకుడి వరకూ 29 మంది చక్రవర్తులు విష్ణుభక్తులు. సగరుడి నుంచి శ్రుతసేన మహారాజువరకూ 6గురు చక్రవర్తులూ శివభక్తులే. అలాగే రురూకుడి నుంచి సౌదాసుడి వరకూ వున్న ఏడుమంది చక్రవర్తులు శ్రీవైష్ణవాన్ని అభిమానించారు. ఈ వంశంలో చివరి రాజైన 'సుదర్శనుడు' శాక్తేయ మతావలంబకుడు.

సత్యయుగంలో సుప్రసిద్ధమైన రాజులు ఇక్షావకుమహారాజు, పృధుచక్రవర్తి, కువలయాశ్వుడు, మంధాతచక్రవర్తి, త్రిశంకుడు, హరిశ్చంద్రుడు, సగరుడు, దిలీపుడు, భగీరధుడు, అంబరీషుడు, కల్మాషపాదుడు, సుదర్శనుడు.

**సత్యయుగాంతం :** సత్యయుగం రాజులలో సుదర్శనుడు చివరివాడు. ఈయన కాశీరాజ కుమారిని వివాహం చేసుకున్నాడు. తరువాత అమ్మవారి అనుగ్రహంతో శత్రురాజులందర్నీ జయించి, ఈ భూమండలాన్నంతా ఏకఛత్రాధిపత్యంగా ఏలాడు. ఇలా ఐదు వేల సంవత్సరాలు ఆయన పాలించాడు.

ఒకనాడు సుదర్శనుడికి అమ్మవారు కలలో కనిపించింది. అతడితో "కుమారా! అతి త్వరలో ప్రళయం సంభవించబోతోంది. నీవు నీ భార్య, వశిష్ఠాది మహర్షులు, మరికొంతమందిని తీసుకుని సరాసరి హిమాలయాలకి వెళ్ళి అక్కడే నివసించు" అని ఆదేశించింది. దేవి ఆజ్ఞప్రకారం సుదర్శనుడు అందర్నీ వెంటబెట్టుకుని హిమాలయాలకి వెళ్ళిపోయాడు. కొద్దికాలం తరువాత బ్రహ్మాండమైన ప్రళయం సంభవించి భూమండలమంతా జలమయమై పోయింది. తిరిగి కొన్నాళ్ళకి సముద్రమంతా వెనక్కి వెళ్ళిపోయి భూమండలం కనిపించింది. త్రేతాయుగం ప్రారంభమై జీవకోటి మొత్తం పునఃసృష్టించబడింది.

## త్రేతాయుగం - సూర్యవంశ రాజులు

వైశాఖ శుక్లతదియనాడు త్రేతాయుగపు మొదటి చక్రవర్తిగా సుదర్శనుడు రాజ్యాభిషేకం చేసుకున్నాడు. అయోధ్య రాజధానిగా ఆయన పదివేల సంవత్సరాలు ధర్మబద్ధమైన పరిపాలన కొనసాగించాడు. సుదర్శనుడు స్వర్గస్థుడైన తరువాత అతడి కుమారుడు దిలీపచక్రవర్తి రాజ్యానికి వచ్చాడు. ఆయనకి ఎంతకాలానికీ సంతానం కలగలేదు. నందినీ ధేనువుని సేవించిన తరువాత ఆ ధేనువు అనుగ్రహంతో 'రఘువు' అనే కుమారుణ్ణి పొందాడు. దిలీపుడు మొత్తం మీద పదివేల సంవత్సరాలు రాజ్యాన్ని పాలించాడు. దిలీపుడి పుత్రుడైన రఘుమహారాజు తండ్రికన్నా ఎక్కువగా పేరు సంపాదించాడు. ఎంతగానంటే! ఆయన తరువాత తరాలవారందరూ రఘువంశుజులు అని చెప్పుకునేంత గొప్పగా పాలించాడు.

రఘువంశరాజుకి జన్మించిన వాడు అజుడు. ఈయన కూడా తండ్రి తాతలలాగా పదివేల సంవత్సరాలు రాజ్యపాలన చేసాడు. అజమహారాజు

రెండో కుమారుడే దశరథుడు. దశరథ మహారాజు దేవతలకి కూడా యుద్ధాల్లో సహాయం చేసేంత మహావీరుడు. ఆయన అరవైవేల సంవత్సరాలు అయోధ్యని పాలించాడు. దశరథుడికి జన్మించిన ధర్మపురుషుడు శ్రీరాముడు. విష్ణు అవతారస్వరూపుడుగా కీర్తిగాంచిన శ్రీరాముడు రఘువంశానికి ఎంతో ప్రాశస్త్యాన్ని కలిగించాడు. సత్యవాక్యపరిపాలకుడిగా ప్రసిద్ధిచెందిన శ్రీరాముడు పదకొండువేల సంవత్సరాలు రాజ్యం పాలనచేసి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

శ్రీరామచంద్రుడి కుమారులు కుశలవులు వీరిలో అగ్రజుడైన కుశమహారాజు పదివేలసంవత్సరాలు అయోధ్యని పాలించాడు. ఈయన తరువాత పరంపరగా అతిథి, నిషధ,నల, సభ, పుండరీక, క్షేమధన్వ, దేవానీక, అహీనగ, కురు అనే మహారాజులు అయోధ్య పాలకులుగా వున్నారు.

## సూర్యవంశ రాజుల క్రమం

1.సుదర్శనుడు 2.దిలీపుడు 3.రఘుమహారాజు 4.అజుడు 5.దశరథుడు 6.శ్రీరాముడు 7.కుశుడు 8.అతిథి 9.నిషధ 10.నలుడు 11.సభుడు 12.పుండరీకుడు 13.క్షేమధన్వుడు 14.దేవానీకుడు 15.అహీనగుడు 16.కురు 17.పారియాత్ర 18.బలస్థలుడు 19.ఉక్థ 20.వజ్రనాభుడు 21.పుష్పసేనుడు 22.ధ్రువసంధి 23.అపవర్మ 24.శీఘ్రగంతుడు 25.మరుపాలుడు 26.ప్రసుశ్రుతుడు 27.సుగంధి 28.అమర్షణుడు 29.మహాశ్వుడు 30.బృహద్బలుడు 31.బృహద్దైశానుడు 32.మురుక్షేపుడు 33.వత్సపాలుడు 34.వత్సవ్యూహుడు 35.ప్రతివ్యోముడు 36.దేవకరుడు 37.సహదేవుడు 38.బృహదశ్వుడు 39.భానురత్న 40.సుప్రతీకుడు 41.మరుదేవుడు 42.సునక్షత్రుడు

43.కేశీనరుడు 44.అంతరిక్షుడు 45.సువర్ణాంగుడు 46.అమిత్రజిత్తు 47.బృహద్రాజు 48.ధర్మరాజు 50.కృతంజయుడు 51.రణంజయుడు 52.సంజయుడు 53.శాక్యవర్ధనుడు 54.క్రోధదానుడు 55.అతులవిక్రముడు 56.ప్రసేనజిత్తు 57.శూద్రకుడు 58.సురధుడు

పై తెలిపిన రాజులందరూ సూర్యవంశరాజులు. వీరంతా తమ ధర్మబద్ధమైన పరిపాలనతో భూమండలాన్ని ఎంతో సుసంపన్నం చేసారు. వీరిలో ప్రముఖులు దిలీపచక్రవర్తి, రఘుమహారాజు, దశరథుడు, శ్రీరామచంద్రుడు.

**త్రేతాయుగం చంద్రవంశ రాజులు :**

త్రేతాయుగం మూడో పాదంలో చంద్రవంశం ఏర్పడింది. దేవేంద్రుడు ఒకనాడు చంద్రుణ్ణి పిలిచి భూలోకంలో ఒక వంశాన్ని నూతనంగా ఆవిర్భవింపచేయమని పంపించాడు. ఇంద్రుడి ఆజ్ఞతో భూలోకానికి వచ్చిన చంద్రుడు ప్రయాగక్షేత్రాన్ని రాజధానిగా చేసుకు చంద్రమహారాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. చంద్రమహారాజు పరమేశ్వరుణ్ణి మహావిష్ణువుని ఎంతో భక్తితో ఆరాధించాడు. అదేవిధంగా పరాశక్తి అనుగ్రహం కోసం వందయజ్ఞాలు చేసాడు. పరమభాగవతోత్తముడుగా, ఉత్తమ ప్రభువుగా కీర్తిపొందిన చంద్రుడు 18 వేల సంవత్సరాలు ప్రజల్ని పాలించి తిరిగి తన లోకానికి వెళ్ళిపోయాడు.

చంద్రుడి కుమారుడు బుధుడు. ఈయన ఇలా దేవిని పెళ్ళి చేసుకోగా, ఆ దంపతులకి పురూరవుడు జన్మించాడు. ఆయన 14వేల సంవత్సరాలు భూమిని పాలించాడు. పురూరవుడి పుత్రుడు ఆయువు. ఈయన ధర్మబద్ధంగా 36వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసి చివరికి గంధర్వలోక నివాసాన్ని పొందాడు. ఈ ఆయువు కుమారుడే సుప్రసిద్ధుడైన 'నహుష చక్రవర్తి' ఎన్నో యజ్ఞయాగాలుచేసి అమోఘమైన శక్తులు సాధించి తద్వారా సాక్షాత్తు ఇంద్రపదవినే పొందాడు. అయితే నహుషుడికి అహంకారం ఎక్కువ. మదంతో యుక్తాయుక్తాలు మర్చిపోయి దుర్వాసమహర్షిని అవమానించాడు. ఆయన శపించగా స్వర్గం నుంచి సరాసరి భూలోకంలో ఒక పర్వతం మీదపడి కొండచిలువలా మారిపోయాడు. తిరిగి ద్వాపరయుగంలో భీమసేనుడి ద్వారా అతడికి శాపవిమోచనం జరిగింది.

నహుషుడి కుమారుడు యయాతి. యయాతికి అయిదుగురు సంతానం. వీరిలో ముగ్గురు కుమారులు మ్లేచ్ఛదేశాలకి రాజులుకాగా, ఇద్దరు కుమారులు ఆర్యావర్తాన్ని పాలించారు. ఈ ఇద్దరిలో అగ్రజుడు యదుమహారాజు కాగా,

చిన్నవాడు 'పురు' మహారాజు. వీరిద్దరూ విష్ణు వరప్రసాదులు. ఆయన అనుగ్రహంతో లక్ష సంవత్సరాలు రాజ్యాన్ని పాలించి చివరికి వైకుంఠధామానికి చేరుకున్నారు. యదుమహారాజు కుమారుడైన క్రోష్టువు అరవైవేల సంవత్సరాలు రాజ్యపాలన చేయగా అతడి పుత్రుడు వృజినఘ్నుడు ఇరవై వేల సంవత్సరాలు పాలించాడు. తరువాత వంశపారంపర్యక్రమంగా ఎందరో చంద్రవంశీయులు పృథివిని పాలించారు.

## చంద్రవంశ రాజుల క్రమం

1.చంద్రమహారాజు 2.బుధుడు 3.ఆయువు 4.పురూరవుడు 5.ఆయువు 6.నహుషుడు 7.యయాతి 8.యదువు 9.క్రోష్టువు 10.స్వాహార్చనుడు 11.చిత్రరథుడు 12.అరవిందుడు 13.శ్రవసుడు 14.తామసుడు 15.ఉశనుడు 16.శీతాంశుకుడు 17.కమలాంశుడు 18.పారావతుడు 19.జ్యామఘుడు 20.విదర్భుడు 21.క్రథభోజుడు 22.కుంతిభోజుడు 23.మాయావిద్యుడు 24.జనమేజయుడు 25.ప్రచిన్వంతుడు 26.ప్రవీరుడు 27.నభస్యుడు 28.భవదుడు 29.సుద్యుమ్నుడు 30.బాహుగరుడు 31.సంయాతి 32.ధనయాతి 33.ఇంద్రాశ్వుడు 34.రంతీవరుడు 35.సుతపుడు 36.సంవరణుడు

వీరంతా చంద్రవంశానికి చెందిన రాజులు. వంశపారంపర్యంగా తమ ధర్మపాలనతో ప్రజల్ని సంతుష్టుల్ని చేసారు. వీరిలో పురూరవుడు, నహుషుడు, యయాతి,యదుమహారాజు, చిత్రరథుడు, సంవరుణుడు ప్రముఖులు.

**త్రేతాయుగాంతం :** చంద్రవంశరాజులలో చివరివాడైన సంవరణుడు పాలించే కాలంలోనే త్రేతాయుగానికి చివరి రోజులు సమీపించాయి. సంవరణ మహారాజు సూర్యుడి అనుగ్రహం కోసం వందసంవత్సరాలు కఠోరమైన తపస్సుచేసాడు. ఆయన ప్రత్యక్షమై తన కుమార్తె తపతిని సంవరణుడికిచ్చి వివాహం చేసాడు. సంవరణుడు చివరికి సూర్యలోకానికి చేరుకోగా కాలప్రభావంతో భూమిని నలువైపులనుంచీ సముద్రం ఉప్పొంగి ముంచేసింది. పర్వతాలతో సహా భూమండలమంతా రెండు సంవత్సరాలు సముద్ర గర్భంలోనే వుండిపోయింది.

తరువాత భీకరంగా పెనుగాలులు వీచాయి. దానితో సముద్రం మొత్తం వెనక్కి వెళ్ళిపోయి యధాస్థానానికి చేరుకుంది. అప్పుడు భూమి పర్వతాలు బైటికి వచ్చాయి. ఆ సమయంలో మహాతపస్సంపన్నుడైన అగస్త్యమహర్షి భూమినంతా తన తపోశక్తితో సారవంతం చేసాడు. అయిదు సంవత్సరాలు గడిచే సరికల్లా భూమండలమంతా ఫల వృక్షాలు చిగురించి, వాసయోగ్యంగా మారింది. ఆవిధంగా భూమి మానవ నివాసయోగ్యంగా మారగానే సూర్యలోకంలో నివసిస్తున్న సంవరణ మహారాజు తన భార్య తపతిని, మూడు వర్ణాల వారికి చెందిన మానవుల్ని, తమకుల గురువు వశిష్ఠ మహర్షిని వెంటబెట్టుకుని తిరిగి భూలోకానికి వచ్చాడు.

## ద్వాపరయుగం - చంద్రవంశ రాజులు

భాద్రపదమాసం కృష్ణపక్ష త్రయోదశి, శుక్రవారం నాడు సంవరణ మహారాజు మునుల్ని వెంటబెట్టుకుని పూర్వం ప్రతిష్ఠానపురం వున్న ప్రాంతానికి వచ్చాడు. అక్కడ నూతనంగా అరక్రోసు విస్తీర్ణంలో మహాప్రాసాదాన్ని నిర్మించాడు. తరువాత మొత్తం అయిదు యోజనాల విస్తీర్ణంలో ప్రతిష్ఠానపురాన్ని పునర్నిర్మించాడు. కొంతకాలం తరువాత బుధుడి వంశానికి చెందిన ప్రసేనుడు, యదువంశానికి చెందిన సాత్వత శూరసేనుడు మధుర ప్రాంతానికి రాజులయ్యారు. తరువాత మ్లేచ్ఛవంశానికి చెందిన శ్మశ్రుపాలుడు మరుదేశానికి (నేటి ఇరాన్ ఇరాక్ ప్రాంతాలు) పాలకుడయ్యాడు. ద్వాపరయుగ ప్రారంభానికి నాంది పలికిన సంవరణ మహారాజు పదివేల సంవత్సరాలు భూమిని పాలించాడు. సంవరణుడి తరువాత వంశ పారంపర్యంగా ఎందరో చంద్రవంశ రాజులు తమ పరిపాలన కొనసాగించారు.

## ద్వాపర - చంద్రవంశ రాజుల క్రమం

1.సంవరణుడు 2.సూర్యజూపి 3.అర్చాజ్ఞుడు 4.సూర్యయజ్ఞుడు 5.ఆదిత్యవర్ధనుడు 6.ద్వాదశాత్ముడు 7.దివాకరుడు 8.ప్రభాకరమహారాజు 9.భాస్వదాత్ముడు 10.వివస్వదజ్ఞుడు 11.హరిదశ్వార్చనుడు 12.వైకర్తనుడు 13.అర్కేష్టి మంతనుడు 14.మార్తాండ వత్సలుడు 15.మిహిరార్ధుడు

16.అరుణపోషణుడు 17.ద్యుమణి 18.తరుణియజ్ఞుడు 19.మైత్రేష్ఠివర్ధనుడు 20.చిత్రభానూర్జకుడు 21.వైరోచనుడు 22.హంసన్యాయి 23.వేదప్రవర్ధనుడు 24.సావిత్రుడు 25.ధనపాలుడు 26.మ్లేచ్ఛహంత 27.ఆనంధవర్ధనుడు 28.ధర్మపాలుడు 29.బ్రహ్మభక్తుడు 30.బ్రహ్మేష్టివర్ధనుడు 31.ఆత్మప్రపూజకుడు 32.పరమేష్టి 33.హైరణ్యవర్ధనుడు 34.ధాతృయాజి 35.విధాతృప్తపూజకుడు 36.ద్రుహిణక్రతువు 37.వైరంచ్యుడు 38.కమలాసనుడు 39.శమవర్తి 40.శ్రాద్ధదేవుడు

41.పితృవర్ధనుడు 42.సోమదత్తుడు 43.సోమదత్తి 44.సోమవర్ధనుడు 45.అవతంసుడు 46.ప్రతంసుడు 47.పరాంతసుడు 48.అమతుసుడు 49.అభితంసుడు 50.సముత్తంసుడు 51.తంసుడు

ఈ రాజులందరూ చంద్రవంశ పాలకులే. వీరిలో తంసుడి కుమారుడే దుష్యంతమహారాజు. ఈయన మేనకావిశ్వామిత్రులకి జన్మించిన శకుంతలని వివాహం చేసుకున్నాడు. వీరిద్దరికీ జన్మించినవాడు భరతుడు. ఈ భరతుడి పేరు మీదగానే భారతదేశం అనే పేరు వచ్చింది. భరత చక్రవర్తి 36వేల సంవత్సరాలు పరిపాలించి ధర్మప్రభువుగా కీర్తిగాంచాడు.

భరతుడి పరంపరగా ఎందరో రాజులు భూమండలాన్ని ఏలారు. వీరిలో ప్రసిద్ధులు ఘృతాచీ శుక్రహోత్రుల పుత్రుడైన హస్తి మహారాజు హస్తినాపురాన్ని నిర్మించగా, ద్వాపరయుగం మూడోపాదంలో రాజ్యానికి వచ్చిన కురుమహారాజు ఇరవైయోజనాల విస్తీర్ణంతో కురుక్షేత్రాన్ని నిర్మించాడు.

చంద్రవంశానికి అత్యంత కీర్తి ప్రతిష్ఠలు, అప్రతిష్ఠలు తెచ్చినవారు కౌరవ - పాండవులు. పాండవుల తండ్రి పాండురాజు అయిదు వందల సంవత్సరాలు పాలించగా, తరువాత దుర్యోధన-ధర్మరాజులు 50, 60 సంవత్సరాలు పాలించారు. అప్పటికి వారిద్దరి మధ్య వైషమ్యం పెరిగి కురుక్షేత్ర మహాసంగ్రామం జరిగింది. అసుర అంశతో జన్మించిన ఎందరో రాజులు మరణించారు. తరువాత పాండవుల వంశీయుడైన పరిక్షిన్మహారాజు రాజ్యానికి

వచ్చాడు. ఆయన కుమారుడు జనమేజయుడు, పరిక్షిత్తు తరవాత అధికారంలోకి వచ్చాడు. ఆయన తరువాత వంశ పారంపర్యంగా ప్రద్యోతన మహారాజు వరకూ ఎంతోమంది హస్తినాపురాన్ని పాలించారు. చంద్రవంశజుడైన ఈ ప్రద్యోతన మహారాజే కురుక్షేత్రంలో మహాయాగాన్ని చేసి మ్లేచ్ఛుల్ని ఆహుతిచ్చాడు.

## విక్రమాదిత్యుడు

కలియుగంలో మూడువేల ఏడువందల పది సంవత్సరాల క్రితం ప్రమరుడనే మహారాజు పాలకుడిగా వున్నాడు. ఆయనకి 'మహామదుడు' అనే కుమారుడు జన్మించాడు. ప్రమరుడి తరువాత అతడే రాజ్యాధికారాన్ని చేపట్టాడు. మహామదుడి తదనంతరం వరుసగా దేవాపి, దేవదూత, గంధర్వసేన, శంఖుడు అనే రాజులు పాలించారు. వీరిలో చివరివాడైన శంఖుడు రాజ్యాన్ని పాలిస్తున్న సమయంలో దేవేంద్రుడు 'వీరమతి' అనే అప్సరసని భూలోకానికి పంపించాడు. ఆమెని శంఖుడు వివాహం చేసుకున్నాడు. ఒక శుభముహూర్తంలో ఆ దంపతులకి ఒక కుమారుడుదయించాడు. ఆ బాలుడు పుట్టగానే దేవతలు పైనుంచి పూలవాన కురిపించారు. అన్నీ శుభశకునాలే కనిపించాయి. అతడికి గంధర్వసేనుడు అని నామకరణం చేశారు. ఆకాలంలోనే 'శివదృష్టి' అనే విప్రుడు ఘోరమైన తపస్సుచేసి శివుడి అనుగ్రహంతో తానే శివస్వరూపుడయ్యాడు.

ప్రమురుడి నుంచి గంధర్వసేనుడి వరకూ అధికారంలోకి వచ్చిన రాజుల పాలనలో మూడువేల సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పుడు దేశంలో శకులు అనే దుష్టులు పాలకులుగావున్నారు. వారిని రూపుమాపి ధర్మాన్ని పరిరక్షించటంకోసం, ఆనాడు శివానుగ్రహం పొందిన శివదృష్టి అనే విప్రుడే గంధర్వసేనుడికి కుమారుడుగా జన్మించాడు. అతడే విక్రమాదిత్యుడు. బాల్యం నుంచే విక్రమాదిత్యుడు బుద్ధికుశలుడుగా వుండేవాడు. అయిదుసంవత్సరాల వయసులోనే తపస్సుచేసుకోవటానికి అడవులకి వెళ్ళిపోయాడు. 12సంవత్సరాల పాటు శివుడి గురించి కఠోరమైన తపస్సు చేసాడు. శివుడు ఆయన్ని అనుగ్రహించాడు. శివుడి సూచన మేరకు, భూమిలోపల అంబావతి అనే

నగరంలో వున్న దివ్య సింహాసనాన్ని బైటికి తెచ్చాడు. అదే సింహాసనం మీద కూర్చుని రాజ్యపాలన కొనసాగించాడు. నాటి నుంచి అది విక్రమార్క సింహాసనంగా విఖ్యాతి చెందింది.

విక్రమార్క సింహాసనానికి 32 మెట్లున్నాయి. ఆ మెట్ల మీద వరుసగా 32 సాలభంజికలుంటాయి. పార్వతీదేవి ఆ దివ్య సింహాసనాన్ని పరిరక్షించటానికి 'వైతాళుడు' అనేవాణ్ణి పంపించింది. వచ్చిన వైతాళుడు సింహాసనాన్ని దానిమీద కూర్చునే విక్రమాదిత్యుణ్ణీ సదా రక్షిస్తూవుంటాడు. ఈ వైతాళుడినే భేతాళుడని పిలుస్తారు.

విక్రమాదిత్యుడు ఉజ్జయినిలోవున్న మహాకాళుణ్ణి ఎంతోకాలం భక్తిగా సేవించాడు. ఆయన అనుగ్రహంతో వివిధ రకాల వ్యూహాల్ని అనుసరించి దివ్యమైన ఒక ధర్మసభని నిర్మించాడు. ఆ సభామండపాన్ని రక రకాల మణిమాణిక్యాలు పొదిగిన స్తంభాలతో నిలిపాడు. మహాద్భుతంగా శిల్పకళా చాతుర్యంతో విలసిల్లే ఆ సభాభవనంలోనే తన సింహాసనాన్ని ప్రతిష్ఠించాడు. విక్రమార్కుడు ఆ సింహాసనాన్ని అధిష్ఠించేముందే వేదవేదాంగాలు తెలిసిన పండితుల్ని రప్పించి వారిద్వారా వేదధర్మాల్ని తెలుసుకున్నాడు. అలాగే స్మృతి ధర్మాల్ని కూడా సాంగోపాంగంగా ఆకళింపు చేసుకున్నాడు.

ఆ సమయంలోనే పార్వతీదేవి సింహాసన సంరక్షణకి పంపించిన బేతాళుడు ఒక విప్రుడి రూపం ధరించి, ఆ సభలోకి వచ్చి విక్రమార్కుణ్ణి 'జయీభవ! దిగ్విజయీభవ! అని ఆశీర్వదించాడు. విక్రమాదిత్యుడు ఆయన్ని సాదరంగా స్వాగతించి సత్కరించి ఉచితాసనంమీద ఆసీనుణ్ణి చేసాడు. ఆసీనుడైన విప్రుడి రూపంలోని భేతాళుడు విక్రమార్కుడి కుశాగ్రబుద్ధిని పరీక్షించాలని ఆయనతో "మహారాజా మీకు ఒక కథని చెబుతాను విని మీరు నాకు జవాబు చెప్పాలి" అని కోరాడు. సరేనన్నాడు విక్రమార్కుడు. బేతాళుడు ఇలా చెప్పడం ప్రారంభించాడు.

# రూపసేన - వీరవరుడు కథ

విక్రమార్కా! పూర్వం సకల సౌభాగ్యాలతో వర్ధిల్లే 'వర్ధమానపురి' అనే నగరం వుంది. రూపసేనుడనేవాడు ఆ నగరానికి అధిపతి. ఆయన భార్యపేరు విద్వన్మాల. ఆమె గొప్ప పతివ్రత. ఒకనాడు రూపసేనుడు కొలువుదీరిన సభకు వీరవరుడనే క్షత్రియుడు తన భార్య కుమారుడు, కుమార్తెలతో కలిసి వచ్చాడు. తనకుటుంబాన్ని పోషించుకోవటానికి తగిన పని కల్పించమని రాజుని ప్రాధేయపడ్డాడు. రూపసేనుడిని, ఆ క్షత్రియుడి మాటల్లో వున్న వినయం, నీతి, నిజాయితీ కదిలించాయి. వెంటనే వీరవరుణ్ణి ఆ రోజు నుంచి తన సింహద్వారానికి రక్షకుడుగా నియమించాడు. అంతేకాదు వేతనంగా రోజుకి వెయ్యి సువర్ణనాణాలని ప్రకటించాడు.

వీరవరుడు రాజుకి కృతజ్ఞతలు తెలిపి తన విధిని తాను నిర్వర్తించసాగాడు. కొద్దిరోజుల తరువాత రూపసేనుడు చారుల్ని పిలిచి తాను ఇచ్చే సువర్ణనాణాలని వీరవరుడు ఎలా ఖర్చుచేస్తున్నాడో గమనించమని చెప్పి పపాడు. చారులు వచ్చి వీరవరుడు ఖర్చు చేసే వైనాన్ని సవివరంగా రాజుకి చెప్పారు. వారి మాటలు విన్న రూపసేనుడుకి ఎంతో ఆనందం కలిగింది ఎందుకంటే? వీరవరుడు తనకి ఇచ్చిన వేతనాన్ని కొంచెం మాత్రమే జీవితావసరాలకి ఉంచుకుని మిగిలిన ధనాన్ని యజ్ఞయాగాది క్రతువులకి, శివవిష్ణు మందిరాలలో పూజలు,కైంకర్యాలు చేయటానికి, బ్రాహ్మణులకి, అనాథలకి దానధర్మాలు చేయటానికి వినియోగిస్తూ తాను మాత్రం సాధారణ జీవితాన్ని గడుపుతున్నాడు. ఇక ఆనాటి నుంచీ వీరవరుణ్ణి శాశ్వతంగా ఆ కొలువులోనే ఉంచేసాడు రూపసేన మహారాజు.

ఒకరోజు అర్ధరాత్రి భయంకరంగా వానకురిసింది. అంతఃపురంలో నిద్రిస్తున్న రాజుకి దగ్గర్లో ఉన్న శ్మశానం నుంచి ఒక స్త్రీ ఏడుస్తున్నట్టుగా వినిపించింది. దిగ్గునలేచిన రూపసేనుడు సింహద్వారం దగ్గరకి వచ్చి విధి నిర్వహణలోవున్న వీరవరుడితో "శ్మశానంలో ఎవరో స్త్రీ ఏడుస్తోంది ఎందుకో? ఓమిటో?" కనుక్కొని రమ్మని పంపాడు. వెంటనే వీరవరుడు శ్మశానానికి బయలుదేరాడు. అతను వెళ్ళిన కొద్దిసేపటికి అనుసరిస్తూ వెళ్ళాడు రూపసేన మహారాజు.

వీరవరుడికి శ్మశానంలో ఏడుస్తున్న స్త్రీ కనిపించింది. ఆమెని సమీపించి అమ్మా! ఎవరునీవు? ఎందుకిలా విలపిస్తున్నావు? అని ప్రశ్నించాడు వీరవరుడు. అందుకామె “నాయనా! నేను ఈ రాజ్యానికి లక్ష్మిని, ఈ రాజ్యవైభోగానికి ప్రజల సుఖాలకీ, ఆనందానికీ కారకురాలిని. ఈ మాసం చివరిలో రూపసేన మహారాజుకి మరణగండం వుంది. ఆయన లేకపోతే నేను అనాథనైపోతాను కదా! అందుకే బాధతో విలపిస్తున్నా” అంది. రాజ్యలక్ష్మి మాటలువిన్న వీరవరుడికి కూడా ఎంతో ఆందోళన కలిగింది. ‘ఆమెతో“అమ్మా! భూత భవిష్యత్తులు తెలిసిన దానివి. మా మహారాజు ధర్మాత్ముడు. ఆయన్ని కాపాడు కోవటానికి ఏదైనా మార్గం ఉంటే తెలియచేయి” అని కోరాడు.

అందుకు సమాధానంగా రాజ్యలక్ష్మి అతడితో ఇలా అంది “నాయనా నీ మహారాజు శాశ్వతంగా జీవించివుండాలంటే ఒక ఉపాయం వుంది. అది నీ కుమారుణ్ణి చండీదేవికి బలివ్వటమే. అలా చేస్తే రూపసేనుడికి దీర్ఘాయువు లభిస్తుంది. వెంటనే అందుకు అంగీకరించాడు వీరవరుడు. అక్కడ నుంచి సరాసరి ఇంటికివచ్చి భార్యకి కుమారుడికి విషయం చెప్పాడు. తమ రాజ్యాధినేతకి ఆయుర్ధాయం కలగటం కన్నా సంతోషం ఏముందని భార్య అతడి కుమారుడు రాజ్యలక్ష్మి చెప్పిన మాటలకి తమ అంగీకారాన్ని తెలిపారు. అందరూ కలిసి ఆనాటి రాత్రి చండికా దేవి ఆలయానికి వెళ్ళారు. రూపసేనుడు వీరికి తెలియకుండా ఏం జరుగుతుందో తెలుసుకుందామని వెంబడిస్తూనే వున్నాడు.

సకుటుంబంగా చండీ ఆలయానికి వెళ్ళిన వీరవరుడు ఆలయంలోని దేవిని స్తుతించి “అమ్మా! ఇదిగో నా ప్రియమైన పుత్రుణ్ణి నీకు బలిస్తున్నాను. దీన్ని స్వీకరించి నా మహారాజుకి దీర్ఘాయుర్ధాయాన్ని ప్రసాదించు” అని కోరి వెంటనే తన పుత్రుడి తనని ఒక్కేవేటుకి నరికేసాడు. రక్తధారతో తడిసి ముద్దయిన ఆ తలని చూసి వీరవరుడి కుమార్తె గుండె ఆగి చనిపోయింది. ఆ దృశ్యాన్ని చూసి తట్టుకోలేక కొద్ది క్షణాల్లోనే వీరవరుడి భార్య కూడా ప్రాణాలు కోల్పోయింది. గుండెదిటవు చేసుకున్న వీరవరుడు తిరిగి దేవి దగ్గరకి వచ్చి తన తలను కూడా నరుక్కుని అమ్మవారికి సమర్పించాడు.

జరుగుతున్న సంఘటనలన్నీ చూసిన మహారాజు రూపసేనుడు మనసు చలించిపోయింది. వెంటనే ఆలయంలోకి వచ్చి 'అమ్మా! ఇంతటి విశ్వాసపాత్రుడు నాకోసం ప్రాణాలర్పించాడే. వీరందరి ప్రాణదానంతో సకుటుంబంగా పెరిగే ఆయుర్ధాయం నాకెందుకు? నన్ను కూడా నీవే బలితీసుకో" అని తన తలని ఖండించుకోబోయాడు రూపసేనుడు. వెంటనే చండీదేవి ప్రత్యక్షమై రాజా! ఆగు! నీకు ఇంతకు ముందే దీర్ఘాయువుని ప్రసాదించేశాను. ఇంకేం వరం కావాలో కోరుకో అన్నది. అమ్మా! నాకోసం ప్రాణాలర్పించిన ఈ వీరవరుడి కుటుంబాన్ని బ్రతికించు. ఈ కోరిక నేను కోరానన్న విషయం అతడికి తెలియకూడదు అని కోరాడు. 'తథాస్తు' అని ఆశీర్వదించింది చండీదేవి.

వెంటనే రూపసేన మహారాజు అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. ఆశ్చర్యంగా కొద్ది క్షణాల్లోనే వీరవరుడు అతడి భార్య కుమారులు నిద్రనుంచి లేచినట్టు ప్రాణాలతో పైకి లేచారు. ఇదంతా చండీదేవి అనుగ్రహమేనని భావించి ఆమెకి మరోసారి నమస్కరించాడు వీరవరుడు. తిరిగి యథావిధిగా తన బాధ్యతల్ని నిర్వహించటానికి సింహద్వారం దగ్గరకి వెళ్ళిపోయాడు.

మర్నాడు మహారాజు వీరవరుణ్ణి పిలిచి రాత్రి రోదించిన స్త్రీ విషయం ఏమన్నా తెలుసుకున్నావా! అని ప్రశ్నించాడు. అందకు వీరవరుడు ప్రభూ! నేను వెళ్ళి చూసాను అక్కడ ఏడుస్తోంది ఒక ప్రేతాత్మ. నన్ను చూడగానే అది మాయమయ్యింది. ఇక వెంటనే నేను తిరిగి వచ్చేశాను. మీరేం ఆదుర్ధా పడవలసిన విషయమేమీలేదు" అని సావధానంగా సమాధానం చెప్పాడు. సరేవెళ్ళు అని పంపించేశాడు.

రూపసేనుడికి ఆశ్చర్యం వేసింది. మహారాజునైన నాకోసం ప్రాణత్యాగాన్ని చేసి కూడా ఆ విషయాన్ని ఏమాత్రం ప్రచారం చేసుకోకుండా వినయంగా విశ్వాసాన్ని ప్రకటించిన అతడి ప్రభుభక్తికి సంతోషం కలిగింది. కొద్ది రోజుల తరువాత రూపసేనుడు తన కోసం ప్రాణత్యాగం చేసి తనకి పునర్జన్మని ప్రసాదించిన వీరవరుడు కుమారుడికి, తన కుమార్తెనిచ్చి వివాహం చేసాడు. ఆనాటి నుంచి వీరవరుణ్ణి ఒక సేవకుడుగా కాక ప్రియమిత్రుడుగా సంభావించాడు.

**భేతాళప్రశ్న :** ఈ కథని ఇంతవరకూ చెప్పిన భేతాళుడు 'మహారాజా! మీరు విన్న ఈ కథలో రూపసేనుడు-వీర వరుడూ ఇద్దరూ ఒకరికోసం ఒకరు ప్రాణత్యాగం చేసారుకదా! నీకు వీరిద్దరిలో ఎవరు చేసిన త్యాగం గొప్పదనిపిస్తోంది? అని ప్రశ్నించాడు.

**విక్రమార్కుడి సమాధానం :** విప్రవరా! పైకి చూస్తే ఈ కథలోని సంఘటనల ప్రకారం ఇద్దరూ ఆదర్శవంతమైన త్యాగాల్నేచేసారు. అయితే రూపసేనుడు చేసిన ప్రాణత్యాగమే వీరవరుడు చేసిన ప్రాణత్యాగం కన్నా గొప్పదని నాకనిపిస్తోంది. ఎందుకంటే! వీరవరుడు రాజుకి సేవకుడు. సేవకుడి ధర్మం రాజుని రక్షించటం. ఆ ధర్మాన్నే అతడు త్రికరణ శుద్ధిగా నిర్వర్తించాడు. ఇది చాలా గొప్ప విషయం. ఇందుకు సందేహమే లేదు. అయితే రూపసేన మహారాజు చేయబోయిన ప్రాణత్యాగం ఇంకా గొప్పది. మహారాజుకి ఒక సేవకుడి కోసం తన ప్రాణాన్ని త్యాగం చేయాల్సిన అవసరం లేదు. అయినా ఆయన ఆ పని చేయబోయాడు. కనుక రాజు చేసిన త్యాగమే గొప్పది" అని సమాధానం చెప్పాడు.

## త్రిలోక సుందరి కథ

విప్రుడి రూపంలో ఉన్న భేతాళుడు విక్రమార్కుడికి మరోకథని ఇలా చెప్పటం ప్రారంభించాడు. "మహారాజా! మీరు చాలా వివేకంతో ఆలోచించి సరైన సమాధానం చెబుతున్నారు. మీకు మరో కథ చెబుతాను-

మహాబలవంతుడు, ధనుర్విద్యాపారంగతుడైన చంపకేశమహారాజు చంపాపురిని పరిపాలిస్తున్నాడు. ఆయనకి ఒక కుమార్తె వుంది. పేరు త్రిలోక సుందరి. పేరుకి తగ్గట్టే ఆమె అతిలోక సౌందర్యవతి. చంద్రబింబంలాంటి ముఖం, లేడిలాంటి కళ్ళు, కోకిలలాంటి కంఠం, ఈ విధంగా సకల శుభలక్షణాలతో ఆమె ప్రకాశిస్తోంది. యుక్తవయసుకి వచ్చిన త్రిలోకసుందరికి వివాహం చేయాలని స్వయంవరం చాటించాడు చంపకేశుడు. జగదేక సౌందర్యవతి అయిన ఆమెని ఎలాగైనా దక్కించుకోవాలని భూలోకంలో వున్న యువరాజులే కాకుండా,స్వర్గం నించి కూడా అందమైన దేవతలు దిగి వచ్చారు.

వచ్చిన వారందరినీ పరిశీలించి నలుగురు యువకుల్ని ఎన్నిక చేసాడు చంపకేశుడు. వారు నలుగురూ సమానమైన అర్హతలున్న వారే. వారంతా తమ తమ అర్హతల్ని మహారాజుకి ఇలా విన్నవించారు.

**1. ఇంద్రకేతుడు :** మహారాజా నా పేరు ఇంద్రకేతుడు. నేను సకల వేదాలనీ వేదార్థాలని అధ్యయనం చేశాను. వేదాలేకాదు శాస్త్రాలని సకల విద్యల్నీ నేర్చుకున్నాను. కనుక నీ కుమార్తెకి తగిన వరుణ్ణి అన్నాడు.

**2. ధనపాలుడు :** మహారాజా! నాపేరు ధనపాలుడు. నేను ధనధాన్యాలని ఎంతో సంపాదించాను. నాకు అన్ని జీవుల భాషలూ తెలుసు. అంతేకాదు నేను సకల సద్గుణాలు కలిగినవాణ్ణి, పైగా రూపవంతుణ్ణి కూడా, కనుక నాకే తమ కుమార్తెనిచ్చి మీరు వివాహం చేయండి అన్నాడు.

**3. ధర్మదత్తుడు :** మహాప్రభూ! నా పేరు ధర్మదత్తుడు. నేను ధనుర్విద్యలో అత్యంతనైపుణ్యం కలిగినవాణ్ణి. అన్ని రకాల యుద్ధ విద్యలూ నాకు తెలుసు. కనుక నేనే అన్ని విధాలా మీ కుమార్తెను చేపట్టటానికి అర్హుడను అన్నాడు.

**4. కళావిదుడు :** చంపకేశమహారాజా ! నాపేరు కళావిదుడు. పేరుకి తగ్గట్టే నేను అన్ని కళల్లో ఎంతో ప్రావీణ్యం కలిగినవాణ్ణి. రోజుకి నేను అయిదు రత్నాల్ని సంపాదిస్తాను. అవి చాలా విలువైనవి. వాటిలో ఒక రత్నాన్ని పుణ్య కర్మల కోసం, మరో రత్నాన్ని యజ్ఞయాగాది క్రతువులు చేయటానికి, మూడోదాన్ని నాకోసం, నాలుగోదాన్ని నా భార్య కోసం వినియోగిస్తాను. చివరిగా అయిదో రత్నాన్ని భోజనం కోసం వెచ్చిస్తాను. పైగా నేను గుణవంతుణ్ణి, రూపవంతుణ్ణి కూడా అందుకే మీరు తమ కుమార్తెను నాకిచ్చి వివాహం చేయటం ధర్మం అన్నాడు.

స్వయంగా ఆ నలుగురూ చెప్పిన తమ తమ అర్హతల్ని విన్న చంపకేశుడికి నలుగురూ తగిన వారే అనిపించారు. ఎవర్ని ఎన్నుకున్నావు అని కుమార్తె వైపు చూసాడు. త్రిలోకసుందరికూడా వారి అర్హతల్ని విన్నది. ఏ సమాధానం తండ్రికి చెప్పకుండా సిగ్గుతో తలవంచుకుని నిలబడింది.

**భేతాళప్రశ్న :** విక్రమార్కమహారాజా! మీరు విన్న ఈ కథలో, నలుగురు యువకులలో త్రిలోక సుందరికి అర్హుడైన వరుడు ఎవరు? అని ప్రశ్నించాడు.

**విక్రమార్కుడి సమాధానం :** విప్రవరా! మొదటగా తన అర్హతల్ని వివరించి చెప్పిన ఇంద్రదత్తుడనేవాడు వేదాధ్యయనం చేసానని చెప్పాడు కాబట్టి బ్రాహ్మణుడైవుంటాడు. ఇక ధనపాలుడనేవాడు ధనధాన్యాలను అధికంగా కలిగి వున్నానని, బహుభాషలు తెలిసినవాడినని చెప్పాడు కనుక అతడు వైశ్యుడైవుంటాడు. సకల కళాకోవిదుడినని, రత్నాలని సంపాదిస్తానని చెప్పినవాడు శూద్రవర్ణానికి చెందినవాడు. ధర్మదత్తుడనేవాడు ధనుర్విద్యలోనేగాక వివిధ శస్త్రాస్త్రాలను ప్రయోగించగల సామర్థ్యం, యుద్ధవిద్యలో నైపుణ్యం అపారంగా తనకున్నాయని చెప్పాడు కనుక అతడు క్షత్రియుడు.

ఈ నలుగురిలో క్షత్రియుడైన ధర్మదత్తుడే త్రిలోకసుందరికి తగిన వరుడు. ఎందుకంటే త్రిలోక సుందరి క్షత్రియకన్య కనుక ఆమెని క్షత్రియుడికే ఇచ్చి వివాహం చేయటం ధర్మం. ఏ యుగంలోనైనా ఈ ధర్మాన్ని పాటించాలి అని సమాధానం చెప్పాడు విక్రమార్కుడు.

## హరిస్వామి కథ

భేతాళుడు విక్రమార్క మహారాజుకి మరోకథని చెప్పటం ప్రారంభించాడు. మహారాజా! పూర్వం చూడామణి అనే మహారాజు చూడాపురం అనే రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన భార్యపేరు విశాలాక్షి. గొప్ప పతివ్రత, భక్తురాలు. ఎంతకాలానికీ వారికి సంతానం కలుగలేదు. విశాలాక్షి పుత్రసంతానం కోసం పరమేశ్వరుణ్ణి దీక్షగా ఆరాధించింది. కొంతకాలానికి శివుడి అనుగ్రహంతో ఆమెకి అందమైన రూపంతో ఒక కుమారుడు జన్మించాడు. లేక లేక పుట్టిన కుమారుడికి 'హరిస్వామి' అనే పేరు పెట్టారు ఆ దంపతులు.

సకల సంపదలకీఅధిపతి అయిన హరిస్వామి ఇంద్రవైభవంతో జీవించసాగాడు. ఆ సమయంలో దేవలుడు అనే ముని ద్వారా శపించబడ్డ ఒక దేవకాంత మానవ జన్మ ఎత్తింది. ఆ దేవకాంతకి రూపలావణ్యిక అనే

కుమార్తె జన్మించింది. క్రమంగా పెరిగి యుక్త వయసుకి వచ్చిన రూపలావణ్యిక అందచందాలు విని హరిస్వామి ఆమెని వివాహం చేసుకున్నాడు. వారిద్దరూ ఎంతో అన్యోన్యంగా సంసారం చేస్తున్నారు. ఒకనాటి అర్ధరాత్రి 'సుకలుడు' అనే గంధర్వుడు నిద్రలో వున్న రూపలావణ్యికని అపహరించుకు పోయాడు.

ఉదయం నిద్రలేచేసరికి హరిస్వామికి తన భార్య కనిపించలేదు. ఆమెకోసం ఎన్నో ప్రాంతాలు, దేశాలు వెతికించాడు. ఎక్కడా ఆమెజాడ కనిపించలేదు. ఇక విసిగిపోయి సంసారం మీద విముఖత పెంచుకుని సన్యాసిగా మారిపోయాడు. తన మనసంతా నారాయణుడి మీదే లగ్నంచేసి తపస్సు చేసుకోసాగాడు. ఎప్పుడో ఒకరోజు ఆకలి అనిపించినప్పుడు భిక్షాటనకి బయలుదేరేవాడు.

ఒకరోజు హరిస్వామి ఒక బ్రాహ్మణుడి ఇంటికి బిక్షకోసం వెళ్ళాధు. ఆ ఇంటి యజమాని మంచి మనసుతో బిక్షపాత్ర నిండా పాయసాన్ని పోసాడు. హరిస్వామి ఆ పాత్రని తీసుకుని ఒక నదీతీరానికి వెళ్ళాడు. అక్కడున్న చెట్టుతొర్రలో పాయసపాత్రని ఉంచి స్నానం కోసం నదిలోకి వెళ్ళాడు. అంతలోనే ఒక విషసర్పం చెట్టుతొర్రలోకి ప్రవేశించి అక్కడున్న పాయసపాత్రలోకి కొంచెం విషాన్ని చిమ్మింది.

ఈ విషయం తెలియని హరిస్వామి స్నానం చేసివచ్చి పాయసాన్ని త్రాగాడు. నెమ్మదిగా అతడికి కళ్ళు తిరగటం ప్రారంభమైంది. కొద్ది సేపటికి పాయసంలో విషం కలిసిందన్న విషయం అతడికి తెలిసింది. వెంటనే ఎంతో ఓపిక చేసుకుని అక్కణ్ణుంచి సరాసరి తనకి పాయసాన్ని ఇచ్చిన విప్రుడి ఇంటికి వెళ్ళాడు – అతడితో "ఓ బ్రాహ్మణుడా! నీవు నాకిచ్చిన పాయసంలో విషం కలిసింది. మరికొద్ది సేపట్లో నేను మరణించబోతున్నాను. నీకు బహుశా బ్రహ్మహత్యా పాపం చుట్టుకుంటుందేమో! దానికి తగిన పరిహారం ఏమైనా చేసుకో!" అని చెప్పి కొద్ది క్షణాల్లో మరణించాడు హరిదాసు. శివుడి వరప్రసాదంగా జన్మించిన ఆ హరిదాసు శివలోకానికి చేరుకున్నాడు.

**బేతాళుడి ప్రశ్న :** మహారాజా! కథవిన్నారు కదా! ఇందులో విషాన్ని చిమ్మిన పాముకి బ్రహ్మహత్యా పాపం చుట్టుకుంటుందా? లేక పాయసం దానమిచ్చిన విప్రుడికి చుట్టుకుంటుందా? అని ప్రశ్నించాడు.

**విక్రమార్కుడి సమాధానం :** పాముకి సహజంగానే విషం వుంటుంది. అది కావాలని విషాన్ని చిమ్మివుండదు.పాయసం తినే పదార్థం కనుక దాంట్లో నోరు పెట్టింది. ఆ ప్రభావంతో పాయసం విషపూరితమయ్యింది. అది దైవనిర్ణయం కనుక పాముకి బ్రహ్మ హత్యాదోషం అంటదు.

హరిస్వామి ఒక సన్యాసిగా విప్రుడి ఇంటికి భిక్షకోసం వచ్చాడు. అతిథిని సత్కరించటం గృహస్థుడి ధర్మం గనుక ఆ విప్రుడు హరిస్వామికి పాయసాన్ని భిక్షగా ఇచ్చాడు. ఒకవేళ అతడు పాయసంలో విషం కలిపివుంటే అతడిదే దోషమయ్యేది. అతడలా చేయలేదు కనుక విప్రుడికి కూడా బ్రహ్మహత్యా దోషం అంటదు. కనుక ఈ కథలో బ్రహ్మహత్యాపాతకం ఎవరికీ చుట్టుకోదు. అసలు మనిషి జనన మరణాలు రెండూ కర్మ ప్రారబ్ధం వల్లే సంభవిస్తుంటాయి. హరిదాసు ఒక కర్మ కారణంగా జన్మించాడు. ఆయువు తీరింది మరణించాడు. అంతే అని సమాధానం చెప్పాడు విక్రమార్కుడు.

## గుణాకరుడి కథ

భేతాళుడు విక్రమార్క మహారాజుతో గుణాకరుడు అనే ఒక నిరర్థక నామధేయుడి కథని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

విక్రమాదిత్యమహారాజా! పూర్వం ఉజ్జయినీ నగరంలో దేవశర్మ అనే బ్రాహ్మణుండేవాడు. అతడి కుమారుడు గుణాకరుడు. ఆ గుణాకరుడు పేరుకి తగ్గట్టు సుగుణవంతుడు. దుర్గుణాలకి నిధి. అన్ని రకాల వ్యసనాలూ అతడికున్నాయి. దుర్వ్యసనాలు, దుష్టసావాసాల కారణంగా పిత్రార్జితాన్ని చాలావరకూ నాశనం చేసేశాడు. అతడి ప్రవర్తన చూసీ చూసీ విసుగు పుట్టిన బంధుగణమంతా తమ పరువుపోతోందని భావించి అతన్ని ఇంటినుంచి తరిమేశారు.

గుణాకరుడు ఇంటినుంచి బైటపడి ఒక గమ్యం అనేది లేకుండా ఎక్కడెక్కడో సంచరించాడు. విధివశాత్తు అలా సంచరిస్తున్న గుణాకరుడు ఒక సిద్ధాశ్రమానికి చేరుకున్నాడు. ఆ ఆశ్రమంలో 'కపర్ధి' అనే సిద్ధ పురుషుడున్నాడు. గుణాకరుణ్ణి చూసి అతడు ఆకలితో వున్నాడని గ్రహించి కొంత ఆహారాన్ని అందించాడు. అయితే గుణాకరుడు దాన్ని స్వీకరించలేదు. అప్పుడు కపర్ధిముని ఒక యక్షిణీ స్త్రీని పిలిచి అతడికి భోజనం పెట్టమని చెప్పాడు.

కపర్ధిముని పిలిచిన యక్షిణి గుణాకరుడి దగ్గరకి వచ్చి సాదరంగా తన కుటీరంలోకి ఆహ్వానించింది. ఆమె అందానికి ముగ్ధుడై పోయిన గుణాకరుడు మారు మాట్లాడకుండా ఆమె వెంట లోపలికి వెళ్ళాడు. లోపల ఆ యక్షిణి అతడికి భోజనాన్ని వడ్డించి తిరిగి తన లోకానికి వెళ్ళిపోయింది. భోజనం ముగించి చూసేసరికి గుణాకరుడికి యక్షిణి కనిపించలేదు. వెంటనే కపర్ధిముని దగ్గరకి వచ్చి యక్షిణిని కలిసే మార్గం చెప్పమని ప్రాథేయపడ్డాడు. ఆమె లేకపోతే తాను జీవించలేనన్నాడు.

గుణాకరుడి ప్రార్ధన విని కపర్ధిముని మనసు కరిగిపోయింది. ఆయన ఒక మంత్రాన్ని గుణాకరుడికి ఉపదేశించి "కుమారా! నీవీ మంత్రాన్ని నలభైరోజులు పాటు దీక్షగా, అర్ధరాత్రి పూట నీళ్ళల్లో నిలబడి ఉదయందాకా పఠించు నీకు మంత్రసిద్ధి కలిగితే నీవు కోరిన యక్షిణీ నీ దగ్గరకి వస్తుంది" అని చెప్పాడు.

కపర్ధిముని చెప్పినట్టే గుణాకరుడు ఏకాగ్రంగా యక్షిణీ మంత్రాన్ని సాధన చేసాడు.అయితే అతడికి మంత్రం సిద్ధించలేదు. ఇక చేసేదేమీలేక తిరిగి కపర్ధిముని దగ్గరకి వచ్చి విషయం చెప్పాడు. ఆయన గుణాకరుడికి మరో మార్గం సూచించాడు. ఆయన మాట ప్రకారం గూణాకరుడు తిరిగి ఇంటికి చేరాడు. తల్లి తండ్రులకి నమస్కరించి వారిని క్షమించమని ప్రార్థించాడు. ఆ మర్నాడే ఒక సన్యాసి మఠానికి వెళ్ళి దీక్షని స్వీకరించి పవిత్రుడయ్యాడు. కొంతకాలం తర్వాత పంచాగ్నుల మధ్యలో నిలబడి తిరిగి పూర్వం తాను చేసిన యక్షిణీ మంత్రాన్ని నలభైరోజులు సాధన చేసాడు. అయినా అతడికి మంత్రసిద్ధి కలుగలేదు.

**బేతాళుడి ప్రశ్న :** విక్రమార్క మహారాజా! గుణాకరుడు సిద్ధపురుషుడైన కపర్థిమునిచెప్పిన విధంగానే సాధన చేసాడు. అయినా అతడికి మంత్రసిద్ధి ఎందుకు కలగలేదు? అని ప్రశ్నించాడు.

**విక్రమార్కుడి సమాధానం :** విప్రవరా! సాధకుడన్న వాడికి మంత్రసిద్ధి కలగాలంటే మూడు ప్రధానమైన సుగుణాలుండాలి. అవి 1.మనసు, 2.వాక్కు 3.శరీరం ఈ మూడింటి ఏకాత్మ్యం. మనసు వాక్కు కలిపిచేసిన సాధన పరలోక సుఖాల కోసం పనికి వస్తుంది. ఇక మనసు శరీరం కలిపి చేసే సాధన వల్ల అందమైన ఫలితాలు వస్తాయి. ఇక్కడ అందమైన ఫలితాలు అంటే! ఇహలోకంలో తక్కువ, పరలోకంలో ఎక్కువ ఫలితాలు లభించటం. ఇలా మనసు – శరీరం ఏకం చేసి చేసే సాధనాఫలాలు మరో జన్మలోనే సిద్ధిస్తాయి. అదే సాధకుడు తన మనస్సుని, మాటని, శరీరాన్ని ఏకం చేసి గనుక సాధన చేస్తే అది ఈ జన్మలోనే శీఘ్రంగా ఫలితాన్నిస్తుంది. అంతే కాదు మరణానంతరం మోక్షాన్ని కూడా ప్రసాదిస్తుంది.

ఈ కథలో గుణాకరుడు ఎంతోకష్టపడి మంత్రాన్ని జపించాడు. కానీ రెండుసార్లు సాధన చేసినప్పుడూ అతడికి మనోయోగం సరిపోలేదు. అలాగే పంచాగ్నుల్లో నిలబడి మంత్రజపం చేసినప్పుడు కూడా అతడి శరీరం మాట (మంత్రం) ఏకమైనాయేగానీ, మనసుమాత్రం మంత్రమీదకాక యక్షిణీ అందంమీదే లగ్నమైవుంది. ఇందువల్ల అతడికి మంత్రసిద్ధి లభించలేదు. అయితే అతడి సాధన ఏమాత్రం వృధాకాదు. ఇప్పుడు చేసిన సాధన వల్ల మరోజన్మలో యక్షుడిగా జన్మించి ఆయక్షిణిని తప్పకుండా పొందుతాడు అని చెప్పాడు విక్రమార్కుడు. ఆ సమాధానం విని ఎంతో ఆనందించాడు భేతాళుడు.

## నలుగురు మూర్ఖుల కథ

విక్రమార్క మహారాజు ఎంతో తెలివిగా ఆలోచించి చెప్పిన సమాధానాలు భేతాళుడికి ఎంతో ఆనందాన్ని కలిగించాయి. అందుకే విక్రమార్కుడి సమయస్ఫూర్తిని మరింతగా పరీక్షించాలని మరోకథని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

ఓ విక్రమార్క మహారాజా! జయపురం అనే నగరాన్ని జయవర్ధనుడు అనేరాజు పాలిస్తున్నాడు. ఆ రాజ్యంలోవున్న ఒక అగ్రహారంలో విష్ణుస్వామి అనే వేదపండితుడున్నాడు. ఆయన రాధాకృష్ణుల భక్తుడు. ఆ పండితుడికి నలుగురు కొడుకులున్నారు. ఆ నలుగురూ రకరకాల వ్యసనాలకి అలవాటు పడ్డారు. నిత్యం దుర్వ్యసనాల వల్ల ఎన్నో అనర్థమైన పనులు చేస్తూ తండ్రి పేరుని చెడగొడుతున్నారు. ఆ నలుగురిలో మొదటివాడు ధూర్తుడు. రెండోవాడు వ్యభిచారి, మూడోవాడు విషయలోలుడు, నాలుగోవాడు పరమనాస్తికుడు. వారంతా తండ్రి ఆస్తినంతా నాశనం చేసి చివరికి దరిద్రులైపోయారు.

ఒకనాడు కొంత జ్ఞానోదయంకలిగిన ఆ నలుగురూ తండ్రి దగ్గరకి వచ్చి నాన్నగారూ! మేము ఎంత ప్రయత్నం చేసినా మా దగ్గర ధనం నిలవటం లేదు. ఎందుకో చెప్పండి అని ప్రార్థించారు. విష్ణుస్వామి తన కొడుకులడిగిన ప్రశ్నకి ఇలా సమాధానం చెప్పటం ప్రారంబించాడు.

**మొదట కుమారుడితో** నాయనా నీవుధూర్త కర్మల్ని ఆచరించావు. ఆ కర్మల్లో ప్రమాదకరమైనది జూదం. అది మొదట్లో లాభాలు ఇచ్చినట్టే ఇచ్చి క్రమంగా మొత్తం నీదగ్గరున్న ధనాన్నంతా హరిస్తుంది. నీ ధూర్త బుద్ధే నిన్ను జూదగాణ్ణి చేసింది. అందుకే నీ దగ్గర ధనం నిలువలేదు. అని చెప్పాడు. అది విన్న మొదటి పుత్రుడు తండ్రీ! మరి నాకు లక్ష్మీ అనుగ్రహం ఎలా కలుగుతుంది? అని ప్రశ్నించాడు.

కుమారా! పుణ్యతీర్థాలు, వ్రతాలు ఆచరించటం వల్ల ముందుగా పాపం నశిస్తుంది. నీవు తల్లితండ్రుల మాట జవదాటకూడదు. అప్పుడే నీ దగ్గర లక్ష్మి స్థిరంగా నిలుస్తుంది అని ప్రబోధించాడు.

**రెండవ కుమారుడుడితో** కుమారా! వ్యభిచారం మహాపాపకర్మ. నీవు అదే ఆచరిస్తున్నావు. వ్యభిచారం వల్ల ఆరోగ్యం నశిస్తుంది. ఆయుర్ధాయం తగ్గి పోతుంది. ఆర్థిక నష్టంకూడా సంభవిస్తుంది. నీకు ఈ దోషం పోవాలంటే బ్రహ్మచర్యాన్ని పాటించాలి. అలా చేస్తేనే నీకు సకలశుభాలు కలుగుతాయి అని ప్రబోధించాడు.

**మూడవ కుమారుడితో** కుమారా! నీవు విషయలోలుడివైపోయావు. మాంసం భుజించటం, మద్యం తాగటం లాంటి వ్యసనాలు అనారోగ్యానికి హేతువులు. అవి ఎన్నో పాపాల్ని మన చేత చేయిస్తాయి. దొంగతనం లాంటి ఘోరమైన పనులకి కూడా ఈ వ్యసనాలే కారణం. కనుక నీకున్న పాపాలన్నీ తొలగిపోవాలంటే సర్వోత్తముడైన శ్రీమన్నారాయణుడిని వ్రతపూర్వకంగా ఆరాధించి, నీ దగ్గర మిగిలిన ద్రవ్యాన్ని ఆయన పూజలకే వినియోగించు అని చెప్పాడు.

**నాలుగో కుమారుడితో** నాయనా! నువ్వు ఘోరమైన పాపం చేస్తున్నావు. పరమనాస్తికుడిగా మారి దైవం ఉనికినే ప్రశ్నిస్తున్నావు. ముందు నువ్వు దైవాన్ని నిందించటం మానుకో. నాస్తిక భావాల్ని పోగొట్టుకో. నీపాపాలు పోవాలంటే ఆస్తికమార్గాన్ని అవలంబించు. ఆత్మశుద్ధి చేసుకుని సకల ప్రాణుల్లో ఆ దైవం నిండి వుందని గ్రహించు అని ప్రబోధించాడు.

విక్రమార్కమహారాజా! విష్ణుస్వామి చెప్పిన విధంగానే అతడి కుమారులంతా నడుచుకున్నారు ఆయన ప్రబోధించిన మార్గాన్ని అనుసరించారు. వారి సత్ప్రవర్తనకి మెచ్చుకున్న పరమేశ్వరుడు ప్రత్యక్షమై వారికి మృత సంజీవనీ విద్యని ప్రసాదించాడు. ఆ నలుగురూ సంతోషంగా ఆ విద్యని గ్రహించి తిరిగివస్తున్నారు. దారిలో వారికి ఒకపులి కళేబరం కనిపించింది.

ఆ నలుగుర్లో ఒకడు దాని ఎముకలన్నిటినీ ఒకచోటకి చేర్చి మంత్రాన్ని చదివి నీళ్ళు చల్లాడు. వెంటనే ఆ పులిని అస్థిపంజరం ఏర్పడింది. రెండోవాడు మంత్రించి ఆ అస్థిపంజరం మీద తాను నీళ్ళు చల్లాడు. వెంటనే దానికి మాంసం చేకూరింది. మూడో వాడు మంత్రజలం చల్లగానే రక్తం, చర్మం పుట్టాయి. చివరిగా నాలుగోవాడు మంత్ర జలం చల్లగానే ఆ పులికి ప్రాణం వచ్చి లేచి నుంచుంది. వెంటనే కళ్ళ ముందున్న నలుగుర్నీ చంపి తినేసింది. ఆ విధంగా వారి ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

**బేతాళుడి ప్రశ్న :** మహారాజా! కథ విన్నారుగా. ఇందులో ఆ నలుగురు అన్నదమ్ముల్లో పెద్దమూర్ఖుడు ఎవరు? అని ప్రశ్నించాడు

**విక్రమార్కుడి సమాధానం :** విప్రుడా! ఆనలుగురూ మూర్ఖులే. అయితే చివరగా ముందూ వెనకా ఆలోచించకుండా, అది క్రూర జంతువని తమ ప్రాణాల్ని తీస్తుందని గ్రహించక, దానికి ప్రాణం పోసిన ఆఖరివాడే అందరికన్నా మూర్ఖుడు అని సమాధానం చెప్పాడు విక్రమార్కుడు.

## పితృశర్మ వృత్తాంతం

పూర్వం విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. వేద వేదాంగాలను అభ్యసించిన మహాపండితుడు పితృశర్మ. అంతేకాదు ఎంతో పాపభీతి కలవాడు కూడా. ఈ కలియుగంలో ఎన్ని అనర్థాలు జరుగుతున్నాయో! ఎంతగా పాపం పెరిగిపోతుందో తలచుకుని నిత్యం చింతించేవాడు. ఏ ఆశ్రమధర్మాన్ని ఆచరిస్తే శుభాలు చేకురుతాయి అని ఆలోచించండి.

ఈ కలికాలంలో సన్యాస ఆశ్రమం స్వీకరిద్దామా అంటే! అది దంభుల చేతిలో పాషండుల చేతిలో ఖండితమైపోయింది. ఇక వానప్రస్థం అనేది ఎవరూ ఆచరించటంలేదు. ఈ కాలంలో అది సాధ్యంకాదు. కేవలం బ్రహ్మచర్యం మాత్రమే అక్కడక్కడా కనిపిస్తోంది. ఇక గృహస్థాశ్రమమే అన్నిటికన్నా గొప్పదిగా కనిపిస్తోంది. కనుక దీన్ని స్వీకరించటమే మేలు అని భావించాడు పితృశర్మ.

తనకి ఉత్తమమైన భార్య లభించాలని అలాంటి కన్య లభిస్తేనే తన జీవితం సార్థకమౌతుందని అనుకున్నాడు. ఆకోరిక తీరటం కోసం జగన్మాతని షోడశోపచారాలతో పూజించి దివ్యస్తోత్రాలతో ఘనంగా స్తుతించాడు. పితృశర్మ పూజలకి స్తుతులకి సంతోషించిన జగన్మాత అతడికి ప్రత్యక్షమైంది. అతడితో “నాయనా! నీకు తగిన కన్య విష్ణుయశుడనే విప్రుడి కూతురు. నీవు ఆమెనే వివాహం చేసుకో. నీకు శుభం జరుగుతుంది” అని చెప్పి అదృశ్యమయ్యింది.

అమ్మవారు చెప్పిన విధంగా విష్ణుశర్మ వివాహం చేసుకుని మధురా నగరంలో తన భార్యతో సహా నివసించసాగాడు. కొంతకాలానికి పితృశర్మకి వరుసగా నలుగురు కుమారులు జన్మించారు. ఆ నలుగురికీ 1.ఋక్కు 2.యజుషుడు 3.సాముడు 4.అథర్వుడు అనే పేర్లు పెట్టుకున్నాడు. ఈ నలుగురు మహాపండితులయ్యారు.

ఈ నలుగురు కుమారుల్లో బుక్కు అనేవాడికి, వ్యాడి అనేపుత్రుడు జన్మించాడు. వ్యాడి న్యాయశాస్త్ర విశారదుడయ్యాడు. రెండో పుత్రుడైన యజుషుడికి మీమాంసాశాస్త్ర కారుడైన కుమారుడు జన్మించాడు. మూడో పుత్రుడు సాముడికి పాణిని అనే మహా భాష్యకర్త, నాలుగో పుత్రుడైన అధర్వుడికి వరరుచి అనే వార్తికకారుడు జన్మించాడు.

ఒకరోజు వ్యాడి, మీమాంసుడు, పాణిని, వరరుచి తమతాతగారైన పితృశర్మతో కలిసి చంద్రగుప్తుడి ఆస్థానానికి వెళ్ళారు. చంద్రగుప్తుడు వీరిని చూసి వెంటనే లేచి వచ్చి స్వాగతం పలికాడు. వారిని చూసి విప్రులారా మీలో ఎవరిని గొప్ప బ్రహ్మచారిగా గౌరవించాలి అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా నలుగురూ కలిసి ఇలా చెప్పారు.

**1.వ్యాడి :** మహారాజా ఆ పరమాత్మని న్యాయ సూత్రాల పరంగా ఆరాధించేవాడే శ్రేష్ఠమైన బ్రహ్మచారి అన్నాడు వ్యాడి.

**2.మీమాంసుడు :** మహాప్రభూ! యజ్ఞయాగాలద్వారా బ్రహ్మాది దేవతలందరినీ నిత్యం సంతృప్తి పరుస్తూ రోచనాదులతో వారిని పూజిస్తూ వారికి తర్పణాలు చేసేవాడే నిజమైన గొప్ప బ్రహ్మచారి అన్నాడు మీమాంసుడు.

**3.పాణిని :** చంద్రగుప్తమహారాజా! ఉదాత్త అనుదాత్త స్వరిత స్వరాల ద్వారా గానీ, పరాపశ్యంతి మధ్యమావైఖరులతో కూడిన వాక్కు ద్వారాగానీ, శబ్ద బ్రహ్మని ఆరాధిస్తూ లింగ, ధాతు గుణాలతో కూడుకున్న స్తోత్రాలతో ఆ శబ్దబ్రహ్మని సంతృప్తి పరచగలిగినవాడే గొప్ప బ్రహ్మచారి అన్నాడు పాణిని.

**4.వరరుచి :** మహారాజా! శాస్త్రోక్తంగా ఉపనయనం చేసుకుని, గురుకులంలో నివసిస్తూ, దండాన్ని శిఖని ధరించి, వేదాధ్యయనం చేస్తూ, భిక్ష ద్వారా ఆహారాన్ని స్వీకరిస్తూ గురువు ఆజ్ఞానుసారం జీవించేవాడే శ్రేష్ఠుడైన బ్రహ్మచారి అన్నాడు వరరుచి.

**5.పితృశర్మ :** వీరందరి మాటలూవిన్న పితృశర్మపైకి లేచి రాజా! బ్రహ్మచర్యం అంటే కేవలం వివాహం చేసుకోకపోవటం కాదు. గృహస్థధర్మాన్ని ఆచరిస్తూనే దేవతల్ని, పితృదేవతల్ని, అతిథుల్ని తృప్తి పరుస్తూ తన ఇంద్రియాలని పూర్తిగా

తన అదుపులోనే ఉంచుకునేవాడు, కేవలం సంతానం కోసం మాత్రమే భార్యతో సంగమం చేసేవాడు మాత్రమే అందరికన్నా గొప్ప బ్రహ్మచారి అని చెప్పాడు.

పితృశర్మమాటలు వినగానే చంద్రగుప్తుడు ఆయన పాదాలకి నమస్కరించి మహాపండితా! ఈ కలియుగానికి సరిపడే ధర్మాన్ని చెప్పారు. దయచేసి నన్ను మీ శిష్యుడుగా స్వీకరించండి అని ప్రార్థించాడు.

## పాణిని చరిత్ర

పితృశర్మ మనమడు పాణిని. ఈయన సాముడి కుమారుడు. ఒకనాడు పాణిని కణాదుడి శిష్యులతో శాస్త్రవాదం చేసాడు. ఆ వాదంలో పాణిని వారి చేతిలో పరాజయం పొందాడు. దానితో అతడికి ఆ ఊరిలో ఉండటానికి అవమానం అనిపించింది. వెంటనే తీర్థయాత్ర చేయాలనే నెపంతో ఊరువిడిచి బయలుదేరాడు. దారిలో అన్ని తీర్థాలూ, క్షేత్రాలు దర్శిస్తూ చివరికి కేదారధామానికి చేరుకున్నాడు.

కేదరాభూమి పాణినికి నచ్చింది. అక్కడే స్థిరంగా ఏకాగ్రచిత్తంతో పరమేశ్వరుడి గురించి కఠోరమైన తపస్సు చేయటం ప్రారంభించాడు. ఆకలి అనిపిస్తే కేవలం ఆకుల్ని తింటూ కొంతకాలం కేవలం నీళ్ళని తీసుకుంటూ కొంతకాలం, నీరుకూడా స్వీకరించకుండా మరికొంత కాలం సాధన చేసాడు. అలా ఇరవైఎనిమిది రోజులు గడిచిపోయాయి. చివరిరోజు పరమేశ్వరుడు సాక్షాత్కరించాడు. వరం కోరుకోమన్నాడు.

శివుడి మాట వినగానే పాణిని శరీరం ఒక్కసారిగా ఆనందంతో జలదరించింది. కళ్ళు తెరిచాడు. ఎదురుగా పార్వతీపతి. ఆయన్ని చూసే సరికి ఆనందం పెల్లుబికింది పాణినిలో. ఆ తన్మయత్వంలో పరిపరివిధాలుగా పరమేశ్వరుణ్ణి స్తుతించాడు. 'పరమేశ్వరా! నాకు ఆదివిద్యని, అక్షరమాలని, వ్యాకరణశాస్త్రాన్ని రచించే శక్తిని ప్రసాదించండి" అని కోరాడు. దయాసముద్రుడైన పరమేశ్వరుడు తన ఢమరుక నాదం ద్వారా అక్షరాల్ని వినిపించి వాటిని 'ఐఉణ్' అనే సూత్రాల రూపంలో పాణినికి అందించాడు. అవే మాహేశ్వర సూత్రాలు. వీటి ద్వారానే పాణిని మహర్షి అష్టాధ్యాయి అనే మహావ్యాకరణ

గ్రంథాన్ని రచించాడు. వరాన్నిచ్చిన తరువాత పరమేశ్వరుడు పాణినితో నాయనా! మానవుడు జ్ఞానం అనే సరోవరంలోకి దిగితే రాగం, ద్వేషం అనే మలినాలు తొలగిపోతాయి. ఈ మానస తీర్థం గురించి అవగాహన చేసుకున్నవాడే అన్ని తీర్థాల స్నానాలను, విద్యావిధానాలను అర్థంచేసుకోగలడు. విద్య ఉన్నవాడికి బ్రహ్మ సాక్షాత్కారం పొందే శక్తి లభిస్తుంది. కనుక నీకు మానసజ్ఞానం అనే ఉత్తమమైన తీర్థాన్ని ప్రసాదిస్తున్నాను" అని వరాన్నిచ్చి అదృశ్యమయ్యాడు శివుడు.

ఆవిధంగా పరమేశ్వరుడి అనుగ్రహాన్ని పొందిన పాణిని ఆనందంగా ఇంటికి చేరుకున్నాడు. వెంటనే సంస్కృత భాషకి పరమప్రామాణికమైన మహాగ్రంథాన్ని అష్టాధ్యాయి అనే పేరుతో రచించాడు. తరువాత ఆ గ్రంథానికి పతంజలి మహాభాష్యాన్ని రచించగా వరరుచి వార్తికాలని రచించాడు.

## పిప్పలాద మహర్షి వృత్తాంతం

**పిప్పలాదుడి వృత్తాంతం :** పూర్వం త్రేతాయుగంలో ఒకసారి భయంకరమైన అనావృష్టి ఏర్పడి కరువుకాటకాలు సంభవించాయి. ఆ బాధలు తట్టుకోలేక కౌశికుడనే ముని తన భార్యాపుత్రులతో మరో ప్రాంతానికి బయలుదేరాడు. వారు వెళుతుండగా దారిలో ఒక కుమారుడు తప్పిపోయాడు. అది గమనించకుండా వారంతా ముందుకువెళ్ళి పోయారు.

తప్పిపోయిన బాలుడు ఏడుస్తూ అక్కడే ఉన్న ఒక చెట్టు క్రిందకి చేరాడు. అది ఒక రావిచెట్టు నిత్యం ఆ చెట్టు పళ్ళనే తింటూ పక్కనే ఉన్న చెరువులో నీళ్ళని తాగుతూ ఆ చెట్టుకిందే ధ్యానం చేసుకోసాగాడు ఆ బాలుడు. కొన్నాళ్ళకి నారదమహర్షి ఆ ప్రాంతానికి వచ్చాడు. ఆ బాలుడి వినయ విధేయతలని, భక్తి తత్పరతని గమనించి అతడికి అన్ని సంస్కారాలూ చేసి వేదాల్ని అధ్యయనం చేయించాడు. తరువాత ఆ బాలుడు శ్రీమహావిష్ణువు ద్వాదశాక్షర మహామంత్రాన్ని "ఓం నమో భగవతే వాసుదేవాయ" ఉపదేశించాడు.

నారదుడు ఉపదేశించిన మంత్రాన్ని ఆ బాలుడు ఎంతో శ్రద్ధగా జపించసాగాడు. నారదుడు అక్కడే వుండి అతడి పట్టుదలని, దీక్షని శ్రద్ధని,

గమనిస్తున్నాడు. కొన్నాళ్ళకి శ్రీమహావిష్ణువు స్వయంగా గరుత్మంతుడినెక్కి అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఆ బాలకుడి తపస్సుకి మెచ్చుకుని జ్ఞానాన్ని యోగాన్ని ప్రసాదించాడు. క్రమంగా ఆ బాలుడు పెరిగి పెద్దవాడై మహర్షిగా రూపుదిద్దుకున్నాడు.

ఒకనాడు మహర్షి అయిన ఆ బాలకుడు నారదుడితో స్వామీ! నేను నా చిన్నతనంలో ఎన్నో కష్టాలుపడ్డాను. దీనికి కారణం ఏమిటి? ఏవో గ్రహాలు నన్ను పట్టి పీడించటం వల్లనే కదా నా తల్లితండ్రుల నుంచి నాకు వియోగం సంభవించింది. అసలు ఏ గ్రహ ప్రభావం వల్ల నాకీ దుర్గతి కలిగింది? అని ప్రశ్నించాడు.

నాయనా! నీ దుఃఖస్థితికి కారణం శనైశ్చర గ్రహం. ఆ గ్రహ ప్రభావంతోనే నీకీ దురవస్థ ప్రాప్తించింది. అదిగో చూడు పైన ఆ శనిగ్రహం తనకి ఎదురేలేదని ఎలా గర్వంగా నిలిచివుందో సరిగ్గా చూడు అన్నాడు నారదుడు. నారదుడిమాటలు వినగానే మహర్షి అయిన బాలకుడిలో ఒక్కసారిగా ఆగ్రహం పెల్లుబికింది. తన తపఃశక్తి అగ్ని జ్వాలల్లా మారి ఆయన కంట్లోకి ప్రవేశించాయి. ఒక్కసారి ఆకాశంలో వున్న శనిగ్రహం వైపు ఆయన తేరిపార చూసాడు. అంతే పైనున్న శనైశ్చరుడు సరాసరి ఒక కొండమీద కొచ్చి పడిపోయాడు. ఆ దెబ్బకి ఆయన కాలు ఒకటి విరిగిపోయింది.

ఆదృశ్యాన్ని చూసి శనైశ్చరుడికి గర్వభంగమైందని ఆనందించిన నారదుడు అందరు దేవతల్ని స్మరించాడు. వెంటనే వారంతా ఆయన దగ్గరకొచ్చారు. వారితో "ఇదుగో ఇతనే నా అభిమాన పుత్రుడు. ఈ పిప్పలాదుడి తపోబలంతోనే శనైశ్చరుడు క్రిందపడ్డాడు అని వారికి పరిచయం చేసాడు.

మహర్షిగా మారిన ఆబాలకుడు అక్కడికి వచ్చిన బ్రహ్మదేవుడికి భక్తిగా నమస్కరించాడు. ఆయన అతన్ని ఆశీర్వదించి "నాయనా నీకు నారదుడు పెట్టిన పేరు సార్థకంగా వుంది. నీవు పీపల ఫలాలు తిని పెరిగావు కాబట్టి నిన్ను పిప్పలాదుడు అన్నాడు. నేటి నుంచి నీవు పిప్పలాద మహర్షిగా లోకంలో విఖ్యాతి చెందుతావు. ఈరోజు నుంచి ప్రతి శనివారం ఏ దేవుడినైనా పూజించిన

తరువాత పిప్పలాదా! అని నీ దివ్య నామాన్ని ఒక్కసారి స్మరిస్తే చాలు వారికి శనిగ్రహ బాధలుండవు అని పలికాడు. తరువాత పిప్పలాదుణ్ణి దగ్గరకి పిలిచి "నాయనా! మానవుల మీద ప్రభావాన్ని చూపి కష్టాలకి గురిచేయటంలో శనైశ్చరుడి ప్రత్యక్షప్రమేయం ఉండదు. వారి వారి కర్మానుసారం ఆయన వారికి బాధల్ని కలుగచేస్తాడు. ఈ శనైశ్చరుడు లేకపోతే గ్రహగతులు అల్లకల్లోలమౌతాయి. కనుక నీవు శనైశ్చరుడిని యథాస్థానంలో ప్రవేశపెట్టు" అని కోరాడు. బ్రహ్మమాటలు విని పిప్పలాదుడు తన తపోశక్తితో శనైశ్చరుణ్ణి తిరిగి గ్రహమండలంలోకి పంపించాడు.

## శనైశ్చర వ్రతం

శనిగ్రహదోషనివారణ కోరేవారు శనివారం రోజు స్వయంగా నూనెతో అభ్యంగనం చేసుకుని, బ్రాహ్మణులకి కూడా అభ్యంగనం చేసుకోవటానికి నువ్వుల నూనెని దానం ఇవ్వాలి. ఇనుముతో శని భగవానుడి ప్రతిమని తయారుచేయించి, దాన్ని నువ్వుల నూనెని నింపిన పాత్రలో ఉంచాలి. ఆ పాత్రని ఒక సంవత్సరం పాటు ప్రతి శనివారం పూజించి చివరి శనివారం నాడు నల్లనిపూలు, నల్లని వస్త్రాలు, నువ్వులు మొదలైన ద్రవ్యాలతో శనీశ్వరుణ్ణి పూజించాలి. పూజానంతరం బ్రాహ్మణుల్ని పిలిచి వారికి నల్ల ఆవుని, నల్ల కంబళిని అప్పుడే నువ్వులనుంచి తీయించిన నూనెని దక్షిణతో సహా దానం చేయాలి. వీటితో పాటు సంవత్సరమంతా పూజించిన నూనె పాత్రని కూడా దానంగా ఇచ్చేయాలి.

## శనిదేవుని స్తుతి

క్రోడం నీలాంజన ప్రఖ్యం నీలవర్ణ సమస్రజం ।
ఛాయామార్తాండ సంభూతం నమస్యామి శనైశ్చరం ॥ 1

నమోఽర్కపుత్రాయశనైశ్చరాయ నీహారవర్ణాంజనమేచకాయ ।
శ్రుత్వారహస్యం భవకామదశ్చ ఫలప్రదో మే భవసూర్యపుత్రః ॥ 2

నమోఽస్తు ప్రేతరాజాయ కృష్ణదేహాయవైనమః ।
శనైశ్చరాయ క్రూరాయ శుద్ధి బుద్ధి ప్రదాయినే ॥ 3

య ఏభిర్నామభిః సౌతితస్య తుష్టో భవామ్యహం ।
మదీయంతు భయం తస్య స్వప్నేஉపి న భవిష్యతి ॥ 4

*(ఉత్తర పర్వ. అధ్యా-114, శ్లో.39-42)*

## పిప్పలాదకృత శనిస్తుతి

కోణస్థః పింగళో బభ్రుః కృష్ణో రౌద్రోஉంతకోయమః ।
సౌరిః శనైశ్చరో మందః ప్రీయతాం మే గ్రహోత్తమః ॥

*(అధ్యా-114, శ్లో-47)*

**వ్రతఫలం :** ఒక సంవత్సరం పాటు ప్రతి శనివారం ఈ శనైశ్చరవ్రతాన్ని చేయాలి. ముందు తెలిపిన విధంగా వ్రతానికి ఉద్యాపన చేసిన వారికి శనిగ్రహ బాధలు ఎప్పటికీ కలగవు. అదేవిధంగా పైతెలిపిన శనిగ్రహస్తోత్రాల్ని ప్రతిశనివారం పఠిస్తే శనిగ్రహదోషాలు తొలగిపోతాయి. ఈ ఉపాఖ్యానాన్ని చదివిన వారికీ, విన్నవారికీ, చెప్పిన వారికీ కూడా శనిగ్రహ బాధలుండవు.

## శ్రీ భవిష్యపురాణ శ్రవణఫలం

ఎంతో విలువైన విశేషాలతో, ధర్మపరమైన కథలతో, ఐహికాముష్మిక ఫలాలనందించే వ్రతాలతో నిండిన ఈ భవిష్యపురాణం ఉత్తమోత్తమమైనది.

యచ్ఛ్రుతావ సర్వపాపేభ్యో ముచ్యతే మానవో నృప ।
అశ్వమేధ ఫలం ప్రాప్య గచ్ఛేద్భానే నసంశయః ॥

ఈ భవిష్యపురాణాన్ని శ్రవణం చేసినవారు (పఠించినవారు - బోధించినవారు) సకల పాపాల నుంచీ విముక్తులై అశ్వమేధయాగం చేసిన ఫలితాన్ని పొందుతారు. అంతేకాదు మరణానంతరం సూర్యలోకానికి చేరుకుంటారు.

## స్వస్తి

**సర్వేజనాః సుఖినోభవన్తు**



